శ్రీ ర స్తు

# బ్రహ్మాండ సృష్టిక్రమము

ప్రాకృతదేవతాసృష్టివివరణము
వైకృతమానవసృష్టివివరణము
అధ్యాత్మ మోక్షమార్గ వివరణము
అను ఖండత్రయ సహితము.





బ్రహ్మశ్రీ ఆదినారాయణ శర్మగారిచే పరిష్కృతము.



గ్రంథకర్త:
జక్కా వేంకటసుబ్బయ్యా సిద్ధాంతి
చీరాల, గుంటూరుజిల్లా.



బ్రహ్మశ్రీ చుండూరి వేంకటరెడ్డియార్య గురుస్వాములవారు



గ్రంథకర్త:
జక్కా వేంకటసుబ్బయ్యా సిద్ధాంతి

శ్రీ ర స్తు

# గ్రంథకర్తృత్వాదికములు

ఈ గ్రంథనామము బ్రహ్మాండసృష్టిక్రమము ఎట్లనగా — ప్రాకృత దేవతా సృష్టివివరణ ఖండము, వైకృతమానవాది సృష్టి వివరణఖండము, మోక్షవిద్యా అధ్యాత్మ విచారణ ఖండము నను ఖండత్రయ సమన్వితము.

గ్రంథకర్త గృహనామమునుబట్టి జక్కావారు. నామధేయము సుబ్బారాయుడు. జక్కా వేంకటసుబ్బయ్యసిద్ధాంతి యను నామాంతరముగూడా గలదు. ఈ గ్రంథకర్త క్షీరపండరీ (చీరాల) పురనివాసియగుటజేసి గడచిన నలుబది యేండ్లనుండియు నాకు చిరపరిచితులు. వీరు కులముచేత బహూత్తమ పద్మశాలిశాఖకు జెందినవారై యుండినను పూర్వజన్మ సముపార్జిత సుకృతపరిపాకాతిశయముచేతనేమి నిజగురూపదిష్టమై పంచకోటిసంఖ్యాధికముగా వీరిచే చేయబడిన తారకపంచాక్షరీ జపసముంచితాక్షయ ప్రభావమువలననేమి వీరికి సంస్కృతాంధ్రభాషాసాహిత్యమును సిద్ధాంత - జాతక - ముహూర్త-వాస్తు - ప్రశ్నాది పంచశాఖావిశాలంబగు జ్యోతిశ్శాస్త్రమును, ఆయుర్వేదశాస్త్రము, అథర్వణమంత్రశాస్త్రము, ధర్మశాస్త్రము, సాంఖ్యము, తారకము, అమనస్క - అచల వేదాంతశాస్త్రము నను పంచశాస్త్రములలో నఖండ పాండిత్యము వీరికి లభ్యమయ్యెను.

'నిండుమనంబు నవ్యనవనీత సమానము। పల్కు దారుణా ఖండలశస్త్రతుల్య' మనునదియే వీరిస్వభావము.

వీరు జాతకములు లిఖించుట—వాస్తుశాస్త్రానుసారముగా గృహనిర్మాణము గావించుట – ఓషధులు సంపాదించి ఔషధములు స్వయముగ తయారుచేయుట – ఆయుర్వేదవైద్యము చేయుట నను స్వరజనోపయుక్తములగు వృత్తిత్రయముచేత నిరాడంబర జీవితము గడపుచు తమకు నలుబదవయేటనుండియు విధురాశ్రమ జీవితమును జరుపుచు తమ నాశ్రయించిన శిష్యకోటికి తమకు పూర్ణప్రవేశానుభవములుగల పైన పేర్కొనబడిన పంచశాస్త్రములలో నేదికోరిన వారికాశాస్త్రమును బోధించుచు తమయంతటివారినిగా తయారుచేయుచున్నారు.

శ్రీకాకుళ జిల్లా నరసన్నపేటకు సంబంధించిన శ్రీ శివరామ [illegible] సన్న్యాసాశ్రమ పీఠాధిపతులగు శ్రీ శ్రీ శ్రీ కూరాకుల రంగనాథపరదేశి స్వామివారియొద్దనుండి శిష్యోపదేశాధికారపత్రమును 26—[illegible]—1953 న [illegible]యున్నారు.

గ్రంథనామమును అందలి ఖండత్రయ నామములును విషయప్రణాళికలోని యంశములను బరిశీలించి చూచినవారికి పంచసప్తతివర్షవయోవృద్ధులగు గ్రంథకర్తగారి జీవితానుభవమును లోకానుభవమును వివిధశాస్త్ర పరిశ్రమానుభవ ప్రభావములును సువ్యక్తములు గాకపోవు.

తమ యిష్టమూర్తియగు అష్టమూర్తియొక్క కరుణా కటాక్షవీక్షణపరంపరలవలన లభించిన తమ వివిధశాస్త్ర ప్రవేశానుభవములను వెదజల్లి లోకోపకారము గావించుటయే యీ గ్రంథరచనకు పరమలక్ష్యము.

ఈ గ్రంథమున లిఖింపబడిన విషయములన్నింటికిని ప్రమాణగ్రంథనామములు 'అమరంగ నీగ్రంథమమరుటకై' యను సీసమాలికయందు పేర్కొనబడినవి.

కం. జక్కా సుబ్బార్యుని కృతి
చెక్కెర్చిన పండువోలె సేవ్యంబగుచున్
మిక్కిలి గ్రంథానుభవపు
జక్కెరతో రుచివహించి సత్కీర్తిగనున్.

మిత్రప్రశంస

ఇట్లు
బందా ఆదినారాయణకవి

చీరాల, 27-1-1961

శ్రీ గణేశాయనమః

## సృష్టిక్రమవివరము

బ్రహ్మాండసృష్టిక్రమమను గ్రంథము వినయప్రశ్నము.

శ్రీమదఖిలచరాచరజగన్నిర్మాణప్రభుండగు బ్రహ్మదేవుని చేత రచింపబడిన సప్తద్వీప చతుర్దశభువన లోకమానవసమూహములలో త్రిగుణప్రకృతులుగానుండు తామసరాజసులు విచారించకపోయినను సాత్వికజన్మలుగల భక్తులు, జ్ఞానులు, తత్వవేత్తలు, పరబ్రహ్మానుసంధానపరులు, సూక్ష్మబుద్ధితో విచారింతురు. ఈ సత్పురుషులు బ్రహ్మచే సృష్టించబడిన బ్రహ్మాండమునందుగల తత్వవేత్తలు, సకలమతాచారశిష్టములున్ను లోకమందుగల భోగములున్ను అనుభవించి ప్రారబ్ధ భోగాంతమున పరబ్రహ్మైక్యపర్యంతమున కవసరమగు విషయములు గలవు.

బ్రహ్మాండసృష్టిక్రమమను దేవతాఖండమున్ను, సాంఖ్యసూత్రమను మానవజన్మోత్పత్తిఖండమున్ను, మోక్షమార్గసోపానమను అధ్యాత్మబ్రహ్మవిద్యాఖండమున్ను,

యీ మూడుఖండములిందుగలవు.

యీ ప్రథమఖండమున షడధ్వమార్గములును గలవు.

## నిర్గుణ పరబ్రహ్మమందు మాయ ఉత్పత్తి

అవ్యక్తజ్యోతి సం 3-0-0; నాదోత్పత్తి సం 3-0-0; ప్రపంచోత్పత్తిపూహా సం 3-0-0; కాలోత్పత్తి సం 1-0-0; శక్తిపంచాకారములు సం 5-0-0; ప్రణవపంచాకారములు

సం 10–0–0; పంచాతురియుత్పత్తి సం 5–0–0; పంచతన్మాత్రే లుత్పత్తి సం 10–0–0; పంచభూతములుత్పత్తి సం 5–0–0; సప్తబ్రహ్మతత్వోత్పత్తి సం 49–0–0; పంచబ్రహ్మలుత్పత్తి సం 15–0–0.

## సృష్టికి కాలప్రమాణ నిర్ణయము

బ్రహ్మదేవుని పరమాయుర్దాయ ప్రమాణము అనగా 3 పద్మముల 11 మహాఖర్వముల ఖర్వములు 0 సున్నా 42 అర్బుదముల కాలమును సూర్యసిద్ధాంత బ్రహ్మసిద్ధాంత మార్కండేయము మొదలగు సిద్ధాంతములయందు చెప్పిన క్రమమున శతభాగముగా గ్రహించి ఆసంవత్సర ప్రమాణము చేతనే బ్రహ్మదేవుని జన్మోత్పత్తివరకు వేయడమైనది. ఈ సంఖ్యలు ఇప్పటివారికి వాడుకలో లేకయున్నందున సంఖ్యా విశేషములు దెలియుటకై సంఖ్యావివరణమును ఇచ్చట వేయుచున్నాను.

## సంఖ్యా విమర్శనము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | ... | – ఏకం | 1 | 7 సున్నాలు | కోటి |
| 1 | 0 ఒకసున్నా | – దశం | 1 | 8 ... | – దశకోటి |
| 1 | 2 సున్నాలు | శతం | 1 | 9 ... | – శతకోటి |
| 1 | 3 ... | – సహస్రం | 1 | 10 ... | – అర్బుదం |
| 1 | 4 ... | – దశసహస్రం | 1 | 11 ... | – న్యర్బుదం |
| 1 | 5 ... | – లక్ష | 1 | 12 ... | – ఖర్వం |
| 1 | 6 ... | – దశలక్ష | 1 | 13 ... | – మహాఖర్వం |

1 14 సున్నాలు పద్మం
1 15 ... – మహాపద్మం
1 16 ... – క్షోణి
1 17 ... – మహాక్షోణి
1 18 ... – శంఖం
1 19 ... – మహాశంఖం
1 20 ... – క్షితి
1 21 ... – మహాక్షితి
1 22 ... – క్షోభం
1 23 ... – మహాక్షోభం
1 24 ... – నిధి
1 25 సున్నాలు మహానిధి
1 26 ... – పరతం
1 27 ... – పరార్థం
1 28 ... – అనంతం
1 29 ... – సాగరం
1 30 ... – అవ్యయం
1 31 ... – అచింత్యం
1 32 ... – అమేయం
1 33 ... – భూరి
1 34 ... – మహాభూరి

ఇవి 35 స్థానసంఖ్యలు. ఇవి దెలియక ఇందు వ్రాయబడిన దేవతా కాలమానము గోచరము కాదు. యిందులో విషయములు తెలియుట కష్టము. ఇవిచూచిన ఆ సంఖ్యా విషయములు తెలియవచ్చును. (ఈ సంఖ్యా విషయములు పురాణ గ్రంథముల లోనివి కావు.

పంచముఖహనుమాన్ అనుగ్రహమున తెలియబడినవి మాయాశక్తి యుద్భవించినది మొదలు 8 మహాపద్మముల కిది మహాఖర్వముల కాలము జరిగినదని సూచన.

## సంవత్సర ప్రమాణ వర్ణనం

బ్రహ్మదేవుని 1 సంవత్సర ప్రమాణము – 8 పద్మముల 11 మహాఖర్వముల 0–ఖర్వము –0 న్యర్బుదము –0 అర్బుదము

లను 120 చే భాగించగ వచ్చిన సంవత్సరప్రమాణము యెట్లనగా:

2 మహాఖర్వముల – 59 ఖర్వాల–16 న్యర్బుదముల 62 అర్బుదములు – 2 సం॥ ప్రమాణము. 5 మహాఖర్వముల 18 ఖర్వముల 33 న్యర్బుదముల 34 అర్బుదములు.

3 సం॥ ప్రమాణము 7 మహాఖర్వాల 77 ఖర్వాల 50 న్యర్బుదాల 1 అర్బుదము.

5 సం॥ 12 మహాఖర్వముల 96 ఖర్వాల–83 న్యర్బుదాల 35 అర్బుదాలు; 7 సం॥ 18 మహాఖర్వముల – 14 ఖర్వాల–16 న్యర్బుదాల 69 అర్బుదాలు; 9 సం॥ 23 మహాఖర్వముల 32 ఖర్వాల – 50 న్యర్బుదాల 13 అర్బుదములు; 10 సం॥ 25 మహాఖర్వాల 91 ఖర్వముల – 66 న్యర్బుదాల – 70 అర్బుదములు; 15 సం॥ 38 మహాఖర్వాల 87 ఖర్వాల 50 న్యర్బుదముల 5 అర్బుదములు; 49 సం॥ 17 పద్మముల 8 మహాఖర్వాల 11 ఖర్వాల 16 న్యర్బుదముల 8 అర్బుదములు. యీసంఖ్యలు యీగ్రంథవిషయముల కవసరములగుటచేత యిచ్చుట వేయడమైనవి.

బ్రహ్మాయుర్దాయము: 3 పద్మములు 11 మహాఖర్వములు 0 ఖర్వములు 0 న్యర్బుదములు 42 అర్బుదములు.

విష్ణువుఆయుర్దాయము॥ 13 క్షోణుల 43 మహాపద్మాల 43 పద్మాల 52 మహాఖర్వాల 1 ఖర్వము 18 న్యర్బుదాల 44 అర్బుదములు.

ఈశ్వరాయుష్యం: 58 శంఖముల 4 మహాక్షోణుల 10 క్షోణుల 64 మహాపద్మముల 63 పద్మాల 85 మహాఖర్వాల 8 ఖర్వాల 0 న్యర్బుదం 0 అర్బుదములు.

## సంఖ్యా విమర్శనము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧ | ... | — ఏకం | ౧ | ౧౮ సున్నాలు | శంఖం |
| ౧౦ | ఒకసున్నా | — దశం | ౧ | ౧౯ ... | — మహాశంఖం |
| ౧ | ౨ సున్నాలు | శతం | ౧ | ౨౦ ... | — క్షితి |
| ౧ | ౩ ... | — సహస్రం | ౧ | ౨౧ ... | — మహాక్షితి |
| ౧ | ౪ ... | — దశసహస్రం | ౧ | ౨౨ ... | — క్షోభం |
| ౧ | ౫ ... | — లక్ష | ౧ | ౨౩ ... | — మహాక్షోభం |
| ౧ | ౬ ... | — దశలక్ష | ౧ | ౨౪ ... | — నిధి |
| ౧ | ౭ ... | — కోటి | ౧ | ౨౫ ... | — మహానిధి |
| ౧ | ౮ ... | — దశకోటి | ౧ | ౨౬ ... | — పరతం |
| ౧ | ౯ ... | — శతకోటి | ౧ | ౨౭ ... | — పరార్థం |
| ౧ | ౧౦ ... | — అర్బుదం | ౧ | ౨౮ ... | — అనంతం |
| ౧ | ౧౧ ... | — న్యర్బుదం | ౧ | ౨౯ ... | — సాగరం |
| ౧ | ౧౨ ... | — ఖర్వం | ౧ | ౩౦ ... | — అవ్యయం |
| ౧ | ౧౩ ... | — మహాఖర్వం | ౧ | ౩౧ ... | — అచింత్యం |
| ౧ | ౧౪ ... | — పద్మం | ౧ | ౩౨ ... | — అమేయం |
| ౧ | ౧౫ ... | — మహాపద్మం | ౧ | ౩౩ ... | — భూరి |
| ౧ | ౧౬ ... | — క్షోణి | ౧ | ౩౪ ... | — మహాభూరి |
| ౧ | ౧౭ ... | — మహాక్షోణి | | | |

అని-౩౫ స్థానసంఖ్యలు గలవిగా నున్నవి. ఇవి దెలియక ఇందు వ్రాయబడిన దేవతాకాలమానము గోచరము కాదు.

యీ సంఖ్యలు విమర్శ తెలియక యీ గ్రంథమందుండు విషయము తెలియుట కష్టము గనుక ఇవిచూచుకొని ఆ సంఖ్యా విషయము విమర్శ చేసుకొనవచ్చును. ఇవి పురాణగ్రంథము లోనివి కావు. పంచముఖాంజనేయ సాహాయ్యమున యీ గ్రంథమున కాలప్రమాణములు లభ్యము. పరమాత్మనుండి మాయాశక్తి యుద్భవించినది మొదలు యీ గ్రంథప్రారంభము వరకు జరిగిన కాలప్రమాణము ౮౦ మహాశంఖములు ౧౬ శంఖములు ౩౩ మహాక్షోణులు ౧౩ క్షోణులు ౫౭ మహాపద్మములు ౯౦ పద్మములు ౫౫ మహాఖర్వములు ౧ ఖర్వము ౩౬ అర్బుదములు ౧౯౫ కోట్లు ౫౭ లక్షల ౭౫ వేల ౦ శతం ౮౩ సంవత్సరములు గడచినవి.

శ్రీ గణేశాయనమః

# బ్రహ్మాండసృష్టిక్రమము

## గణపతిస్తోత్రము

గీ॥ శ్రీచిదానందమయ చిద్విశిష్టభావ
మచలతత్వంబు సుజ్ఞానసుచరితంబు
విధిపరిణమిల్లు నిగమాంతవిశ్వరూప
సరణి వెలిగెడు విఘ్నేశు సన్నుతింతు.

## గురుస్తవము

గీ॥ ఆత్మతత్వవిశారదు డఖిలసముడు
వాదరహితుండు చుండూరి వంశభవుడు
రెడ్డెయార్యుండు విద్యలో దొడ్డఘనుడు
కారణంబిచ్చి దరిజూపె ఘనగురుండు.

## సర్వగురుజనస్తోత్రము

గీ॥ నిత్యమానందరూపులు నిగమవిధుల
నమరభూతభవిష్యత్తు నమరదెలిసి
గుప్తసిద్ధులు జ్ఞాననిగూఢులైన
తత్వవేత్తల గురువుల దలచి మనుదు.

క॥ తెలిసిన చిన్నలు పెద్దలు
బలుదిట్టతనంబుగలిగి పరిశీలనచే
గల తప్పులన్ని వదలుచు
బలమగు విషయములు దెలియ ప్రార్థింతు తగన్.

గీ॥ కవితప్రజ్ఞల జూపించగలిగి కాదు
ఛందసాలంకరణలీల సలుప కాదు
భక్తియుక్తిని సాంఖ్యంబు పద్ధతిగను
నెనసి విషయంపు జ్ఞప్తికై యిటుల వ్రాతు.

ఆ॥ వె॥ భగవదర్పితంబు బహుళంబుగాచేయ
శక్తిలేక మిగుల చర్చజేసి
నేమిచేయలేక నీశ్వరు దేహంబు
వర్ణనంబు చేతు వసుధలోన.

గీ॥ సరసమైన స్వభాను వత్సరమునందు
ఆశ్వయుజ శుక్లపక్షము నందు గలుగు
శ్రవణనక్షత్ర శుక్ల వారంబునందు
సాంఖ్యయోగంబు మనమున చర్చగలిగె.

## బ్రహ్మాండ సృష్టిక్రమము

ఆ॥ వె॥ కమలజాండసృష్టి గావించుక్రమమున
సాంఖ్యసూత్ర గణన సకలభూత
భాగములను దెలసి పంచీకరించెడు
విధము సుజనులకును వెలయదెలుప.

ఆ॥ వె॥ ఇందు గలుగు విషయ సందేహములకెల్ల
పొందుపరుచు కూర్పుబృందములను
యెందొ వెదుక శ్రమము నిందులేకున్నట్లు
అందమైన ముక్తి బొందుటకును.

గీ॥ పాంచభౌతికంబు పరగ నీదేహంబు
తెరవుదెలియు వేదతరువు చెలువు
ప్రణవపంజరంబు పరమాత్మరూపంబు
తెలియదగిన జ్ఞానదీప మరయ.

గీ॥ వేదసమ్మతమున వెలసెడు ఋషులైన
శాస్త్రవేదులైన సిద్ధులైన
ఆత్మవేత్తలగుచు నలరెడు జనులతో
సములుగారు వారు జగతియందు.

క॥ బాలకులు పప్పుగింజలు
చాలుగబడియున్న యేర్చి చవిగొను భంగిన్
వాలగు శాస్త్రములనుగల
పోలిక లీగ్రంథమందు పొందించె తగన్.

క॥ జక్కా వెంకటసుబ్బయ్య
నిక్కవమగు సాంఖ్యసూత్ర నియమము వరుసన్
వక్కాణించెను క్రమముగ
చొక్కపు మోక్షంబుగోరు సుజనులకెల్లన్.

## సర్వదేవతా స్తవము

సీ॥ శ్రీరమ్యశుభగురు శ్రీమూర్తి ధ్యానించి। విఘ్నవిద్య విరాట్టు వినుతిజేసి। శంకారహితగురు శంకరు పూజించి। శార్వాణికెప్పుడు సాగిమ్రొక్కి। లక్ష్మీశు వర శాంతలక్షణములకెరగి। శ్రీలోకమాతను చేరిమ్రొక్కి। బ్రహ్మాండజనకుడౌ బ్రహ్మను

వినుతించి। గీర్వాణి నెప్పుడు గీర్తిసలిపి। పూర్వదిగ్భాగైక పుణ్యు
హాయగ్రీవు। యామ్యదిక్కూర్మని వెలయగొలిచి। పశ్చమదిశ
నున్న బలవరాహుని గొల్చి। మృత్యుంజయుని సంస్మరించి మదిని।
నారదాదిఋషుల నమలత భజియించి। అష్టదిగీశుల నమరవరుల।
అధ్యాత్మవిదులను ఆత్మలో వినుతించి। బ్రహ్మవిద్వరులను బ్రబలి
కొలచి। మహితమేరుగిరీంద్ర మహిమను గొనియాడి। విద్యాధ
రాదుల వినుతి జేసి। తూర్పుచైత్రరథంబుతో రమాదక్షిణ। నందన
వనమందు నమరియుండు। పశ్చమ వైభ్రాజపద ముత్తరమునందు।
సర్వతోభద్రంబు సమతనుండు। చేరి యోగముల చే చింతించు ముని
ఋషి। సాధుబృందముల సన్నుతులు సలిపి। త్రయము త్రింశ
త్కోటి దేవతాతతి గొల్చి। భక్తవర్యులను సద్భక్తిగొలిచి।
యోగమాహాత్ములవోరిమి సేవించి। కవిరాజవర్యులఘనత నెంచి,
గీ॥ జగము సృష్టిని మనమున చర్చ జేసి। సాంఖ్యతారక విధు
లను సాహ్యముగొని। గ్రంథ మొక్కటి రచియింప గదిసి మదిని।
జన్మకర్మములన్నియు సమయునంచు। చదువుకొన్నందు కిటు
వ్రాతు సచ్చరిత్ర.

## గ్రంథోత్పత్తికాధారములు

సీ॥ అమరంగ నీగ్రంథ మమరుటకై బ్రహ్మవిదులు
దెలిపిన యట్టి విషయములను। సకలార్థ గురుబోధసారంబు
భద్రాద్రి రామ శతకంబు విరాజితముగ। ఆత్మబోధామృతముల
బ్రహ్మవిద్యయు। రామాంజనేయంబు రాజితముగ। వేమన్న
శతకము విమలభాగవతంబు। కైవల్యశుక యోగిక ధనములను।

సమత వేదజ్ఞానసారంబు బ్రహ్మాండ। తారకామృత సారదర్ప ణంబు। భరతఖండ విశేష బహుదేశ చరితముల్। పరగ నాయుర్వేద పద్ధతియును। కైవల్యసారంబు ఘటశోధనీగ్రంథ। వాశిష్టమార్కండవర్తనమును। రామాయణంబును। రాజ చరిత్రల। వేదాంతడిండిమ విషయములను। సత్పంచశిఖ గురు। జనక సంవాదంబు। శివరామదీక్షితచిత్తనియతి। వాసుదేవ మనస వరపంచదశియును। బ్రహ్మాబిలమునందు ప్రబలియున్న। విషయంబులన్నియు విశదీకరముగాగ। బ్రహ్మాండసృష్టిని ప్రబలి యున్న। సాంఖ్యపంచకరణమును సంగ్రహించి,

గీ॥ తెలిసితెలియక నీగ్రంథ తిలక మిట్లు। వ్రాయబూ నితి పాపముల్ వ్రాలునటుచు। సద్గురు వనుగ్రహంబును సాక్షి జేసి। చదువులోనున్న సారంబు చవియదెలిసి.

---

బ్రహ్మాండసృష్టిక్రమము సాంఖ్యసూత్ర రహస్యము- అధ్యాత్మ మోక్షమార్గసోపానము అను నీ గ్రంథమును ప్రారంభించి ఆదియందు గణపతి ప్రార్థనమును స్వగురుప్రార్థ నమును, సర్వగురుజనస్తోత్రమును, వినయదర్శనమును, ప్రతిజ్ఞాది కమును, భావసందేహానివృత్తి – దేహస్వరూపవివరణమును సర్వమానవులతో ఆత్మవేత్తల శ్రేష్టత్వము కవినామప్రకటన మును, సర్వదేవతాస్తవమును, గ్రంథోత్పత్తికి ఆధారములును గ్రంథప్రారంభదినమును అనగా 1943—10—10 తేదీని లిఖించి — తర్వాత.

యీ గ్రంథ సృష్టికిముందు 16 సంవత్సరముల క్రిందటి కాలమందు అనగా 1912-వ సంవత్సరము మొదలుకొని జంబూద్వీప భారతవర్షమందుగల సాత్వికభక్తశిరోరత్నములకు తత్వవేత్తలగు పరబ్రహ్మానుసంధానపరులకు నమస్కరించుచు ప్రశ్నించుచు చర్చించుచు రాగా విద్యాప్రభావము విమర్శగాని కారణమున మనోవేగముచే నుండగా 1914-1-12 తేదీకి సరియగు ప్రమాదీచ సంవత్సర పుష్య శు ౧౫ లు సోమవారం రాత్రి బ్రహ్మశ్రీ పద్మశాలీ కులసంజాత ప్రగడ వెంకటస్వామి గురువర్యునివలన గురుమంత్ర ధ్యానములను గ్రహించుచుండగా స్వల్పకాలములో యిద్దరు స్నేహితులుగా వచ్చిరి. వారి విరుద్ధ ప్రసంగములవలన గురువుగారనుగ్రహము దప్పుటచే మనోవేదనతో పరితపించుచుండగా 5-సంవత్సరములు గడచువరకు - అప్పుడు,

## సద్గురువు తటస్థప్రాప్తి

1929-1-26 తేదీకి సరియగు విభవసంవత్సరపుష్య బ ౧ లు స్థిరవాసరమున బ్రహ్మశ్రీ వేదవేదాంగ ఉపనిషత్సారభూతులై సచ్చిదానందరహిత పరబ్రహ్మానుసంధానపరులగు గుద్దంటి రుద్రయ్యగారు అనుగ్రహాభిమానములతో గుంటూరునుండి చుండూరి వెంకటరెడ్డియార్యస్వాములు దయచేసిరి. నీవు శీఘ్రముగా యీచేవుత్తరము చూచినవెంటనే రావలెనని ఆజ్ఞగల్గగా శీఘ్రముగావెళ్లి బ్రహ్మశ్రీ గుద్దంటి భుజంగముగారి గృహమందు నివసించిన గురువులవారిని విచారించగా,

## గురుపరంపర

సీ॥ శ్రీ విరాడ్బ్రహ్మకు శివుడు శిష్యుండయ్యె। శివు నకు బ్రహ్మయు శిష్యుడయ్యె। అల బ్రహ్మకు వశిష్టు డలరి శిష్యుండయ్యె। ఆ వశిష్టుకు శిష్యు డా జనకుడు। జనకునకును శుక జన్ముండు శిష్యుండు। శుకునకు సాందీప శిష్యవరుడు। సాందీపకునకు కంసారి శిష్యుండయ్యె। వాసు దేవుని శిష్యు డుద్ధవుండ । రాజితోద్ధవునకు రామావధూతయు। రామావ ధూతకు రహి కబీరు। వీర కబీరునకును వేమన్న శిష్యుండు। వేమన్న శ్రీధరువే త్తజేసె। శ్రీధరస్వామికి శిష్యుండు శివరామ। దీక్షితవర్యుండు దివ్యఘనుడు। దీక్షితవరునకు దివ్యకంబాలూరి అప్పయ్య శిష్యుడై యలరుచుండు। అప్పయార్యుని శిష్యు డమల పరశురామ। నరసింహ గురు డనునయముతోడ.

గీ॥ పరమ గురుడైన పోలూరి పావనార్య। గురుని శిష్యుండు చుండూరి గుప్తకులజు। రెడ్డెయార్యుం డఖండ రేరాజసముడు। కారణం బిచ్చి దరిజూపె ఘన గురుండు। బ్రహ్మశ్రీ చుండూరి వెంకట రెడ్డెయార్య దేశికేంద్ర। సద్గురు స్వాములవారు తటస్థించగా। శిరస్సాష్టాంగ నమస్కారములు చేసి విచారించగ.

## అష్టవిధ గురు విమర్శనము

శృతులను బోధించు బోధక గురువును। అజ్ఞానము బాపి సుజ్ఞాన విమర్శచేయు। వేదక గురువును। దురాశలేక భక్తుల హృదయ తాపములబాపి। జ్ఞానబోధచేయు నిషిద్ధ

గురువును। తారక మార్గముదెల్పి। పరబ్రహ్మమునుజూపు కామ్యక గురువును। సాధన చతుష్టయముదెల్పి। శబ్ద బ్రహ్మానందమునుజూపు సూచక గురువును। దశేంద్రియ కర్మల నివర్తించి అజ్ఞానము బాపి। సుజ్ఞాన మార్గము జూపు। వాచక గురువును। నీకు బ్రహ్మత్వము గలదని। జీవేశ్వరైక్య సంధానము దెల్పెడు। కారణ గురువును। సర్వసందేహములు మాన్పి। నిజరహస్యము దెల్పెడు। ఈశ్వర సముండగు। విహిత గురువును। యీ అష్టవిధ గురువులలో శ్రేష్టులగు

## నిజగురు తటస్తము

బ్రహ్మశ్రీ వేదవేదాంగ ఉపనిషత్సార భూతులై। సచ్చిదానంద రహితులై। శ్రీమత్పరమహంస నీవారశూక। పీతాభాస్వదణుస్వరూపాధికులై । పంచకోశాంతర్గత। పంచభూతాత్మక। పంచ వింశతి తత్వాతీతులై। షడూర్మిరహిత। షడ్భావ వికారశూన్యులై। నాదుబిందు కళాతీతులై। సర్వతః పరిపూర్ణులై। వేంచేసియుండు చుండూరి వెంకట రెడ్డియార్య। దేశికేంద్ర సద్గురు స్వాములవారు। పూర్వజన్మ పుణ్యవశంబునను। జ్ఞానవిద్యా ప్రాప్తకాల వశమునను। నీను తటస్థించగా। వారి దర్శనభాగ్య సమయుంబున। గురుధ్యాన మంత్రములతో సిరః స్సాష్టాంగ దండప్రణామములు। సమర్పించి నిలచిన। నిలచిన శిష్యునింగని। వారి కటాక్ష వీక్షణమున। హే వత్సా! నీవు పూర్వజన్మ సుకృత విశేషమున । సాత్వికభావముతో మోక్షవిద్య గోరితివని। ప్రసన్నముఖులై। అనుగ్రహించి।

పరబ్రహ్మ దర్శనప్రాప్త కారణంబగు। గురుసూచనాక్రమం బున। గురు పూజా విధానము జరిగించ సున్నాతులై। వస్త్ర ధారణ జేసి కలశ పూజార్చనయు। అధిష్ఠాన పీఠపూజయు। గావించి ఆసీనులై। సర్వాంగ పూజయందు సమాధినిష్ఠనుండ మంగళహారతు లిచ్చి.

## గురు పూజాక్రమము - ఉపదేశము

మేల్కొల్పగా ప్రామాణ్యములు బలికించి, మాంస పిండమును మంత్ర పిండము చేసి। ద్వాదశ నమస్కారములు చేయించి, నొసట వ్రాత మడిచి। జిహ్వాయందు బీజము లిఖించి, హస్త మస్తక సంయోగముచేసి। మంత్రోపదేశము చేసి। తారక తత్వము। నభ్యాసము చూపించి। చిన్ముద్రం జూపి। ప్రణవ స్వరూపంబు దెల్పి। తీర్థ ప్రసాదంబు లిచ్చి। గురు నియామకములు దెల్పి। మరువకు మని యాజ్ఞ యిచ్చిరి.

## గురు స్తోత్రము

గీ. సచ్చిదానంద మయుడు సద్గురుడు హరుడు। భేద రహితుండు చుండూరి వంశభవుడు। రెడ్డి యార్యుండు మోక్షు రేరాజమయుడు। కారణంబిచ్చి దరిజూపె ఘనగురుండు.

గీ. మూడు మంత్రములును మూలముల్ శృతులును। కారణంబు దీర్చె ఘనుడు నన్ను। వారి దయను గల్గి। వర్ధిల్ల జొచ్చితి। జ్ఞాన కాంతి గలిగి జగతియందు.

క. చుండూర్వెంకట రెడ్డికి। దండి నమస్కృతులు చేసి
దాసోహ మనన్। మెండగు తారక సాంఖ్యములందనునయ
మనస్క విద్య లావుగ నిచ్చెన్.

## ఉపదేశాధికారము

ఇట్టి పరమ గురుప్రసాదమున నోలలాడుచుండు సమయంబున సచ్చిదానంద భావక్రమంబున అధికార మివ్వ దలంచి 1-1-1931 వతేదికి ప్రమోదూత సంవత్సర పుష్య-౧౨లు గురువారము రోహిణీ నక్షత్ర దినము రాత్రివేళ సచ్చిదానంద భావక్రమంబున సర్వవిధివిధానములతో నాకధికార మిచ్చిరి. సంప్రదాయ మవిచ్ఛిన్నముగ సాగునటుల కొంత శిష్య గణమును చేర్చి వారికి నాచేత కారణ మిప్పించి బోధించునటుల నియమించి ఆరాత్రి యోగదృష్టిలో యీ శిష్యులు ఒకరి కొకరు సంబంధము లేక అంతశ్శుద్ధిలేక చీమల పుట్టవలె చెల్లా చెదరుగ నున్నారు. వీరు నీవద్ద నిలచుట దుస్తరమని శెలవిచ్చి గురువులవారు వెళ్లిరి. తదుపరి,

తర్వాత నలుబదిరెండు మందికి కారణమివ్వగా వారు నిష్ప్రయోజకులైనందున విరమించినాడను. కావున సద్గురువనుగ్రహమున లభించిన విద్యా విధానమును గ్రంథ రూపమున సవిమర్శగా లిఖించిన మంచిదని సంప్రదాయము చెడకుండునటుల బహుకాలము పురాణగ్రంథములు విమర్శించి పరిశ్రమ మూలమున 1943—10—10 యీ తేదీకి సరియగు స్వభాను సంవత్సర ఆశ్వయుజ శుక్లపక్ష యేకాదశియందు

ఈ బ్రహ్మాండసృష్టిక్రమ — సాఖ్యసూత్ర రహస్యము - అధ్యాత్మ మోక్ష విద్యాసోపానము అను నీమూడు ఖండములు గల గ్రంథమును ప్రారంభించితిని.

## గ్రంథప్రారంభము

ఇట్లు మనోవిచారణాధీనమై తర్కించుచు అనేకుల అద్వైత మార్గ ప్రచారకుల సాత్విక భక్త రత్నములను దర్శించుచు గోష్టిలో విషయముల గ్రహించుచు పురాణ గ్రంథములు చూచినను పూర్వుల సుందరాకారములు అందములు వజ్రభూషణాద్యలంకారములు వర్ణించిన వారే కాని, త్రిమూర్తుల లోకములలో యుగమన్వంతరాదులు మొదలగు విరాట్శక్తి వలన మూడవదశలో విమర్శించిన కాలప్రమాణ విషయము నెవ్వరు విచారించిన వారు కారు. అందువల్ల దీర్ఘకాలము విచారణచేసి యీ ఖండత్రయంబగు బ్రహ్మాండ సృష్టిక్రమమను గ్రంథమును వ్రాయ సమకట్టితిని. ఇట్లు విచారించిన గ్రంథములను సీసమాలికగా వ్రాసియున్నాను. ఇది బోధనాగ్రంథముగా నుండును గాని అన్యము గాదు. వ్రాసిన విషయమునకు మరియొకచోటు విమర్శార్థము వచ్చును. అందువలన శంకించకూడదు. తారకము, సాంఖ్యము, అమనస్కము, అచలమార్గమును మూడవఖండమున బాగుగా విమర్శయగును. మానవ దేహమునకున్ను బ్రహ్మాండమునకున్ను సమభావార్థములుగా నుండునట్లు ఎల్లరకు తేటతెల్లముగా దెలియునట్లున్నూ గురుస్వామి యనుగ్రహమున నిట్లు వ్రాసియున్నాను.

శ్రీ పార్వతీ పరమేశ్వర సంవాద రూపంబుగనుండు వ్యాస శుక సంవాదమును ఆధారము జేసికొని ఈ బ్రహ్మాండ సృష్టిక్రమమును వ్రాయుచున్నాను. నిరామయ – నిరంజన – నిర్గుణ పరబ్రహ్మమందు అకారణముగ ప్రతిఫలించిన త్రిలోక సంజనిత సప్తద్వీప చతుర్దశ భువనములయందు గల జీవులు తమ కర్మానుభవము అనుభవించుటయు తదుపరి పరబ్రహ్మ యందు చేరుటయు–ఆయా సందర్భముల ననుసరించి బ్రహ్మాండ సృష్టిక్రమమను నామోద్ధరణము గావింపబడినది. ఈ బ్రహ్మాండ సృష్టిక్రమము – దేవతాఖండము – సాంఖ్యసూత్ర రహస్యము– మానవజన్మోత్పత్తి ఖండము – అధ్యాత్మ మోక్షమార్గసోపాన ఖండము – ముక్తిమార్గము – ఇది పెద్దల అనుగ్రహాము ననుసరించి యిట్లు వ్రాసితిని.

## గురుధ్యాన మూల సూత్రములు

శ్లో॥ గురుబ్రహ్మాం గురుంవిష్ణుం। గురుదేవో మహేశ్వరః।
గురు స్సాక్షాత్పరబ్రహ్మాం। తస్మై శ్రీ గురువే న్నమః.

శ్లో॥ అఖండ మండలాకారం। వ్యాప్తయేన చరాచరం।
తత్పదం దర్శితం। యోగం తస్మై శ్రీ గురువే న్నమః.

శ్లో॥ మన్నాధ శ్రీ జగన్నాధ। మద్గురు శ్రీ జగద్గురోః।
మమాత్మాసర్వ। భూతాత్మా। తస్మై శ్రీ గురువే న్నమః.

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధశ్చ। జ్ఞానాంజన శలాకయోః।
చక్షురున్మీలితంయోగం। తస్మై శ్రీ గురువే న్నమః.

శ్లో॥ చైతన్యం శాశ్వతం బ్రహ్మం। వ్యోమాతీతం నిరంజనం। నాదుబిందు కళాతీతం। తస్మై శ్రీగురువే నమః.

శ్లో॥ అజ్ఞాన మూలహరణం। జన్మ కర్మనివారణం। జ్ఞానవైరాగ్య సిధ్యర్థం గురు పాదోదకం పీత్వా। గురోరుచ్చిష్ట భోజనం। గురుపూజ సదాధ్యానం। గురుమంత్రం సదా జపేత్.

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం। ద్వంద్వాతీతం గగనసదృశం। తత్వమశ్యాదిలక్ష్యం। ఏకం నిత్యం విమలమచలం। సర్వధీసాక్షిభూతం భావాతీతం। త్రిగుణ రహితం। సద్గురుం తం నమామి.

శ్లో॥ యస్యాంతర్నాదిమధ్యం। నహి కర చరణం। నామగోత్రం నసూత్రం। నజాతిర్నైవవర్ణా। నభవతి పురుషో। నానపుంసం నచస్త్రీ। నాకారం నైవకారం। నహిజనిమరణం। నాస్తిపుణ్యం నపాపం। తత్వంనో తత్వమేకం। సహజ సమరసం। సద్గురుం తం నమామి.

శ్లో॥ నిరాభాసం నిరాధారం। నిరాకారం నిరంజనం। నిశ్చలం నిర్వికారంచ। స్వప్రకాశవివర్జితం॥ సద్గురార్పణమస్తు.

గురువులు శిష్యులకు కారణమిచ్చు సమయమున యీ సూత్రములిచ్చి పూజచేయుదురు. ఇవి మూలసూత్రములు. 36 తత్వములకు మూలసూత్రములు గలవు. మొట్టమొదట తెలిసిన గురువులు యీ సూత్రము లిచ్చెదరు.

—o—

శ్రీ ర స్తు

# బ్రహ్మాండ సృష్టిక్రమము

## నిర్గుణ పరబ్రహ్మ ధ్యానం

శ్లో. యస్యాంతర్నాదిమధ్యం। నహికరచరణం। నామగోత్రం నసూత్రం।
నజాతిర్నైవవర్ణా। నభవతిపురుషో। నా నపుంసం నచస్త్రీ
నాకారం నైవకారం। నహిజనిమరణం। నాస్తిపుణ్యాం నపాపం।
తత్వంనోతతత్వమేకం। సహజనమరసం। సద్గురుం తం నమామి.

ఈ నిర్గుణ పరబ్రహ్మధ్యానమయులగు 'జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ' అను క్రమంబున శ్రీపార్వతీ దేవికి పరమేశ్వరు డుపదేశించిన క్రమంబున బ్రహ్మ వశిష్ట గురు పరంపర సాంప్రదాయకులగు వ్యాసులవారు ఒక సమయంబున.

## వ్యాస శుక సంవాదము

వ్యాసమహాఋషి శుకుని బిలిచి నీవు బాల్య చాపల్యమున స్వధర్మ విధులు తెలిసికొనక అందందు సంచరించుచు వ్యర్థముగ కాలము గడుపుచుండుట మంచిది కాదని మందలించి మనకీ వ్యర్థపు కాలక్షేపణ పనికిరాదని చెప్పగా నేను చేయవలసిన కర్తవ్య మేమని శుకుండడుగగా మనము ఋషుల మైతిమి. లోకశుభము కొరకు స్నాన సంధ్యానుష్టాన జపతప హోమాది షట్కర్మల నాచరించుచు సకలజీవులకు సౌఖ్యము ప్రసాదించు కొరకు తపశ్చర్యలతో దైవ సాక్షాత్కారమున యితరుల దరిజేర్ప ప్రయత్నించుట మన విధియై యున్నది.

ఋషులగు మనము యితరులను సంసార సముద్రమునుండి దాటించుటకు పరమేశ్వరుని వలన సృష్టింప బడితిమి. అందు వలన మనకీలోక చపలవు క్రీడ లనవసరము. అని సంగ్రహముగ నార్ష ధర్మమును దెలుప - శుకుండు—తండ్రీ నీవు దెల్పు విషయములు నేను బాల్యావస్థనున్న కారణమునఁ బోధపడినవి కావు. సమగ్రముగ విమర్శయగు నట్లు సెలవిమ్మని వేడుకొనగా— మనము ఋషులము- పరుల కడతేర్చి శుభము లొసంగుటకై దైవ నిర్ణయము దాటశక్యముకాదని చెప్పగా ఆ విధు లెవ్వి యని శుకు డనగా.

## బ్రహ్మాండ వలయము

వ్యాస మునీంద్రుడు—శుకా వినుము: 14 కోట్ల యాభై యారు లక్షల యోజన విశాలమగు బ్రహ్మాండ వలయము నందుండు 14 భువనములలో 14 ఆచార విధు లెవ్వియనిన, షట్కర్మాచరణలను స్నానము, సంధ్యయు జపము - తపము— హోమము- యజ్ఞములు. ప్రాతఃకాలము నిద్ర లేచునపుడు భగవ ధ్యానమున్ను, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి యను యీ 14 ఆచారములతో నుండువారిని దయా సముద్రుడగు భగవంతుడు కృపా పాత్రులంజేసి - సర్వ లోకస్థులచేతను, పూజనీయులం జేయును. ఇది పరమేశ్వరుని ధర్మస్థాపన విధియై యుండును. అని పలుకగా.

శుకుండు- వ్యాసునింజూచి- లోకములని శెలవిచ్చితిరి. అవి యెన్ని లోకములు శెలవివ్వుమనగా వ్యాసుం డిట్లు చెప్పదొడగె.

వ్యా— నాయనా! శుకా లోకములకు భువనము లనియు పర్యాయ నామము గలదు. ఇవి 14 భూమి క్రింద నుండునవి సప్త పాతాళములనియూ, భూమి కూర్ధ్వముగ నుండునవి సప్తోర్ధ్వ లోకములని పెద్దలు నిర్వచింతురు. యీ లోకము లన్నియు, చరాచర ప్రాణికోట్లతో నిండియుండునని తెలిసి మనము నియమములు దప్పక పాటించుట, వ్రతముగా నుండును.

శు—చిత్తము-వీనివలన మనకుకలుగు మేలెద్దియనగా.

వ్యా— పొరబడకు. మన మేపని జేసిననూ ప్రతి ఫలాపేక్ష లేక భగవదర్పిత బుద్ధితో చేయవలయును. ఫలాపేక్ష యేమాత్రము పనికిరాదు. భగవ ద్విషయమున నేమాత్రము కూడదు. ఆవిధానము యిచ్చి పుచ్చుకొను వ్యాపారమునకు చెందినది. ఫలాపేక్ష కర్మ జన్మమునకు కారణము, జన్మము అనేక బాధక బంధకములకు కారణము. జన్మరాహిత్యమునకే మనము ముఖ్యముగ కర్మము లొనర్చి ఫలత్యాగబుద్ధితో సుఖపడి ఇతరులు మనవలె ఆనందించునట్లు యత్నించవలెను.

వ్యా — ఇదియునుగాక నీ యభ్యాసము వలన జక్కని నిష్ఠాపద్ధతి యలవడును. అట్లే యోగారూఢత లభించును. ఆ కారణమున ఆనందము దొరకును. దానివలన పరమాత్మ దర్శనము దొరకును. అది బ్రహ్మానందమై తత్వమస్యాది మహావాక్యార్థ నిర్వచనములకు లక్ష్యమననొప్పి పురుషోత్తమ ప్రాప్తి తదైక్యముగలిగి జన్మకర్మ బంధరాహిత్యమై పునర్జన్మము

రాకుండ దప్పించును. ఇంతకు మిక్కిలి ఫలము గోరుట తుచ్ఛ లౌకిక ఫలకాంక్ష - కేవల నీచముగదా.

శు — అయినను ప్రస్తుతము నేనేమి చేయవలెనో సెలవిచ్చి ఆ విధానము దిద్ది తీర్ప ప్రార్థించుచున్నాను.

వ్యా — మంచి లగ్నమును నిర్ణయించి శృతి పాదమును ప్రారంభము చేసి తొలుత నిర్గుణ పరబ్రహ్మ ధ్యానశృతిని పాఠముగా ప్రారంభించి చెప్పసాగిరి.

## నిర్గుణ పరబ్రహ్మ శృతి

శృతి — అధపరమాత్మా యధాక్షర ఉపాసనీయః। సచప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగాను మాత్మచింతకః। వీటకణికాకారః శ్యామాక తండు లోవా। వాలాగ్ర శత సహస్ర వికల్పనాభిర్వా సలభ్యతే నోపలభ్యతే నజాయంతే నమ్రియతే నశుష్యతి నక్లిద్యతే నదహ్యతే నకంపతే నభిద్యతే నశ్విద్యతే నిర్గుణసాక్షిభూతః। శుద్ధోనిరవయ వాత్మా। కేవలస్సూక్ష్మో నిర్మమో నిరంజనో నిర్వికార - శబ్ద - స్పర్శ-రూప-రస-గంధవర్జితో। నిర్వికల్పో నిరాకాంక్షః సర్వవ్యాపీ సోచింత్యః నిర్వర్ణ్యశ్చ పునాత్య శుద్ధాన్యపూతాని నిష్క్రియ స్తస్య సంసారోనాస్తిః ॥శ్చ॥

శు— శుకునకు వ్యాసమహర్షి నిర్గుణ బ్రహ్మశృతికి అర్థవివరణము చెప్పుట. ప్రణవాక్షరోపాసకులు మొదలుగ సమాధి నిష్టాచార్యుల పర్యంతము సిద్ధిబొందిన మహాను భావులు భక్తశిరోమణులు భగవదంశాసంభూతులై

యున్నారు. వారు అష్ట సిద్ధులు గలిగి ఇహమందు భోగంబును-పరమందు మోక్షమును గలిగి సుఖింతురు. పరబ్రహ్మైక్య సమర్థులైన వారి వాగమృత ధారలే వేదాగమోపనిషత్తులు.

వ్యా — పరబ్రహ్మమును ఆత్మచింతన చేయువారికి మర్రిగింజవలె, చిర్రిగింజవలె శరాగ్రమున వేయవ భాగముగా అణువైయుండునదియు, గురు సేవామాత్రమున లభించునదియు, సామాన్యులకు లభింపనిదియు, పుట్టుక లేనిదియు, అలవి కానిదియు, దహింపరానిదియు అగు పరబ్రహ్మలక్షణములు గోచరించును.

మరియు నా పర బ్రహ్మము-ఏ లోపము లేనిదియు, కదులనిదియు చలింపచేయుటకు-తగ్గించుటకు అలవి కానిదియునై యుండును. గుణ వికారములు లేక సర్వసాక్షియై శుద్ధమై శరీరాద్యవయవములు లేనిదై అయ్యాది సూక్ష్మాతి సూక్ష్మమైనది నిర్మలమైనది చూచుచున్నట్లుండనిదిగను వికార రహితమైనదిగ నుండును. యింతయేకాక - శబ్ద - స్పర్శ - రూప రస గంధములు దానికి లేవు. వికల్పము లేనిది. యే కాంక్షలు లేనిది. సర్వవ్యాపకమైనది. యేచింతలు, యేవర్ణభేదములు, ఆది మధ్యాంతములు లేనిది, నిర్మల మైనది, అపవిత్రము, కర్మాదికములు, సంసారము లేనట్టిది. ఇవియన్నియు పరబ్రహ్మలక్షణములు.

శు— పై శృత్యర్థ ప్రకారము వివరముగా క్రమార్థము బోధించగా (శ్రీ) శుకున కొకయూహ జనించి అది

ఆ మహనీయున కపూర్వమనితోచి యిట్లు దనలో దానే వితర్కించుకొనుచు పరమాత్ముడొక డున్నాడా? అతడు ఆది దేవుడా?

అతనికి సంబంధమగు దేవతాలోకములున్నవని తండ్రి గారు బోధించిన బోధకు చాలా వరకు మనస్సు నాకర్షించి నది – సందేహములున్నవి – అడిగి తెలియుట అత్యవసరము. జగములెట్లు బుట్టెను? దేవ మానవ తిర్యగ్జంతువులు మొద లగు భూతసముదాయ మెట్లు గల్గెను? యివి నా సందేహము లని శ్రీ శుకుండు దెలుప వ్యాసభగవానుడు ఇట్లుపన్యసింప దొడగె.

వ్యా—నాయనా శుకా వినుము. పరమాత్మ దర్శ ము లభించు నాతని మర్మమును గ్రహింప నెంత వివేకు లైనను సమర్థులుగారు. గురుసేవ గురుబోధలు అలవడినగాని లక్ష్య లక్షణ సమన్వయములు లభించవు. పిమ్మట గురి కుదురును. పరబ్రహ్మతత్వ మనగా సామాన్యమైనదికాదు. అది యసా ధ్యము. సమానాధికరహితము నిరూపింపనలవిగానియఖండము– అద్వితీయము–కేవల అనుభవ వేద్యము. అకారణ వాత్సల్యము గల–గురు శుశ్రూష వలనగాని యదిపొందుభాగ్యము చేతను లకు లభింపదు సుమా అని చెప్పగా.

శు—తండ్రీ–సద్గురుప్రభో అది యంతటి మహిమ గలది యని స్పష్టపడు చున్నది. కాని అయినచో నీ దృశ్యము నకు అంతటికిన్నీ జననమాదిగాగల వానికి నాథు డెవ్వడో దెల్పుమని ప్రార్థన.

వ్యా — శుకా చెప్పెద వినుము. బ్రహ్మ - విష్ణువు మహేశ్వరుల యుత్పత్తికి ఆ పరబ్రహ్మతత్వమే కారణము. సూర్యాది నవగ్రహములు అష్టదిక్పాలకులు–పార్వత్యాది శక్తి త్రయము అందుండియే జనించిరి. యింతియే కాక భద్రాశ్వ వర్షమున హయగ్రీవుడు, భారత వర్షమున కూర్మరూపుడు, కేతుమాల వర్షమున వరాహరూపుడు, ఇలావృత వర్షమున మృత్యుంజయుండును అందుండియే జనించిరి.

బ్రహ్మఋషులు, నవ బ్రహ్మలు ఏకాదశ రుద్రులు ద్వాదశాదిత్యులు, విష్ణుదేవతా సంబంధమగు 24 అవతార పురుషులు ఈశ్వర దేవతా సంబంధమగు 64 అవతార పురుషులలో ఆపరబ్రహ్మ తత్వము నుండియే యావిర్భవించెను.

కావుననే పరమసిద్ధులు, జగద్గురువులు, సాత్వికతత్వ యుక్తులగు భక్తవరేణ్యులు, ఉత్తమాచార సంపన్నులగు ధీమంతులు, విద్యావివేక సంపన్నులు 4 వర్ణముల వారు, శూద్ర ఛండాల మ్లేచ్ఛ పుళింద కిరాత శబరాది జాతులు సకల మృగ పక్షి సర్పాది క్రిమికీటకములు, ఇవి యన్నియు యీ నిర్గుణ బ్రహ్మ తత్వము నుండియే యుదయమైన కారణమున ఆ తత్వము నాశ్రయించి, సేవించు చుండుట, జన్మ రాహిత్య భాగ్యమును లభింప జేసుకొనుచు దానియం దైక్య మందు మహాభాగ్యమును సంపాదించుకొను చున్నవి. కేవల దేవతారాధనమును జేయించుట, భోగభాగ్యముల కొరకాశించిన లంచములతో సమానము - నిజగురు మోక్షము నొందజాలరు. కాబట్టి మహిమముగల యీ పరమాత్మ నాశ్రయించి బాధారహితముగ శిష్యుని యనుగ్రహించు

శక్తిగల. సద్గురువుల నాశ్రయించి, పరమాత్మమూల మంత్రము లగు ద్వాదశి పంచదశి షోడశి మంత్ర-మంత్రమూలమంత్ర సారములం దెలసి బ్రహ్మవిదులై నిరంతర నిశ్చలసమాధి పరులై బ్రహ్మనిష్ఠచేత పరబ్రహ్మైక్యము పొంది, యీ జన్మమును తరింప జేసికొని పునర్జన్మ బంధమును దప్పించు కొనవలెను.

శు— అయ్యా ఆ పరమాత్మ స్వరూప మార్గమెట్టిదో సూక్ష్మముగ వివరింప గోరుచున్నానని మనవిచేసెను. ఇట్లు చేయగా వ్యాసుండు సంతోషించి యిట్లను చున్నాడు.

## వ్యాసుడు శుకయోగికి పరమాత్మ స్వరూపము దెల్పుట

శుకా— అలకింపుము. శ్రీమదనంతుండు నిత్యుండు నిరాధారుండు నిరామయుండు అఖండ స్వరూపుడు నిష్కళం కుండు నిరుపద్రవుండు అద్వితీయుండు నిరాభాసుండు నిరంజ నుండు నిర్వచనుండు నిర్విశేషుండు నిరతిశయుండు నిశ్చ లుండు నిత్యానందుండు నిర్వికారుండు సర్వసాక్షియు సత్య స్వరూపుండు నిష్కర్ముండు కరచరణాద్యవయవహీనుండు జాతి కుల నామవర్జితుడు స్త్రీ-పురుష - నపుంసక రూపవర్జి తుడు ఆకార రహితుడు జన్మమరణాద్యవస్థలు లేనివాడు పుణ్య పాప కర్మ వర్జితుడు సమరస గుణుండు మహాతత్త్వైక రూపుండు త్రిగుణ రహితుండు సర్వవ్యాపకుండు నిర్వికల్పుడు నిస్సంకల్పుడు పరమపవిత్రుడు ప్రపంచ సంబంధ రహితుడు ఏ వస్తువునం దంటనివాడు కేవలాత్ముండు పరిపూర్ణుండు బయలుస్వరూపుండు సజాతీయ విజాతీయ స్వగతభేద రహిత నిర్గుణ పరబ్రహ్మగా నుండెను.

## మాయ ఉత్పత్తి కారణము



ఈ చక్రాకారముగ వ్రాసియున్న మండలమును 14 కోట్ల- 56 లక్షల యోజనములు యెత్తున్నూ 12 కోట్ల 85 లక్షల యోజనముల విశాలముగల బ్రహ్మాండమున కతీతమగు - నిరామయ - నిరంజన నిర్గుణ పరబ్రహ్మముగా నిశ్చయముగా నమ్మి విచారించేది.

జగత్సృష్టికి పరబ్రహ్మయందు మాయాశక్తి యుత్పత్తి కాలములు 3 పద్మముల 54 మహాఖర్వముల 69 ఖర్వాల 12 న్యర్బుదాల 25 అర్బుదములకు మాయ ఉత్పత్తి.

3 – 54 – 69 – 12 – 25 సం॥ మాయ
3 – 46 – 91 – 62 – 24 ... నాదము
3 – 39 – 14 – 12 – 23 ... వ్యూహ
3 – 31 – 36 – 62 – 22 ... కాలము
3 – 28 – 87 – 45 – 55 ... బిందువు
3 – 26 – 28 – 28 – 88 ... అర్ధచంద్రం
3 – 23 – 69 – 12 – 21 ... కుండలం
3 – 21 – 9 – 95 – 54 ... దండం
3 – 18 – 50 – 28 – 87 ... తారకం

అధోశక్తి కుండలి

3 – 15 – 91 – 62 – 20 ... తారకము
3 – 10 – 73 – 28 – 86 ... దండము
3 – 5 – 54 – 95 – 52 ... కుండలం
3 – 0 – 36 – 62 – 18 ... అర్ధచంద్రం
2 – 95 – 18 – 28 – 84 ... బిందువు

ఊర్ధ్వ ప్రణవకుండలి

2 – 89 – 99 – 95 – 50 ... యకారం
2 – 87 – 40 – 78 – 83 ... వకారం
2 – 84 – 81 – 62 – 16 ... శికారం
2 – 82 – 22 – 45 – 49 ... మకారం
2 – 79 – 63 – 28 – 82 ... నకారం

పంచాక్షరి

2 - 77 - 4 - 12 - 15 ... మానసబ్రహ్మ
2 - 58 - 89 - 95 - 16 ... చాక్షుషబ్రహ్మ
2 - 40 - 75 - 78 - 47 ... వాచకబ్రహ్మ
2 - 22 - 61 - 61 - 78 ... శ్రావణబ్రహ్మ
2 - 4 - 47 - 55 - 9 ... నాసత్యబ్రహ్మ
1 - 86 - 36 - 38 - 40 ... అండజబ్రహ్మ
1 - 68 - 19 - 20 - 71 ... పద్మజబ్రహ్మ

సప్తబ్రహ్మ తత్వములతో బ్రహ్మోత్పత్తి కాలము

1 - 50 - 5 - 50 - 2 ... అవ్యక్తమునకు బ్రహ్మ ఉత్పత్తి
1 - 42 - 28 - 0 - ౧ ... విష్ణువు
1 - 34 - 50 - 50 - 0 ... ఈశ్వరుడు
1 - 26 - 72 - 99 - 9 ... ఇంద్రుడు
1 - 18 - 95 - 49 - 8 ... సూర్యుడు

పంచమూర్తులు

1 - 11 - 17 - 99 - 7 ... హంకారం
1 - 5 - 97 - 65 - 73 ... యకారం
1 - 0 - 79 - 32 - 39 ... రకారం
0 - 95 - 60 - 99 - 5 ... వకారం
90 - 42 - 65 - 71 ... లకారం

పంచతన్మాత్ర లుత్పత్తి

85 - 24 - 32 - 32 ... ఆకాశం

82 - 65 - 15 - 70 ... వాయువు

80 - 5 - 99 - 3 ... అగ్ని

77 - 46 - 82 - 36 ... జలం

74 - 87 - 65 - 69 ... భూమి

72 - 26 - 49 - 2 ... సృష్టి

పంచభూతములు

ఈ నిర్గుణ పరబ్రహ్మమును చూచు చుండియు గ్రహించ చాలరు. యెంత విద్యావంతులు గాని యెంత ధీమంతులుగాని యీ మర్మము తెలియ చాలరు. సాంఖ్య తారకా మనస్కవిధులు తెలిసినా యీ నిర్గుణ బ్రహ్మమును తెలియ చాలరు. గురు సూచన వలన గాని గురి పడదు. ఈ నిర్గుణ బ్రహ్మ సంబంధ మంత్ర త్రయమును గలదు. ద్వాదశి, పంచదశి, షోడశీ, మంత్రములు-సంకల్ప-కరన్యాస-అంగన్యాస-ధ్యానములతో నున్నవి. ఇవి సిద్ధి బొందిన వారికే 'మాయ మాయ మాయె మరియేమి లేదాయె' అను వాక్య ప్రకారము దృష్టాంతము బ్రహ్మ విదులైన మహానుభావులున్నూ బ్రహ్మ-విష్ణు ఈశ్వరాది దేవతలున్నూ తడవులేక సేవింపు చుందురు. యీ పర బ్రహ్మమును సేవింపక నిజమోక్షము నందలేరు.

వ్యా — మాయ ఉత్పత్తి = 3 పద్మముల 54 మహాఖర్వముల సం॥ నాడు 'బ్రహ్మణోరవ్యక్తః' అను సూత్రమును బట్టి విచారించగా నిర్గుణ పరబ్రహ్మము యే ప్రమేయము లేక అప్రమేయుడై యుండగా యీ పరబ్రహ్మమునందు అవ్యక్త మాయ నిర్గుణ బ్రహ్మమునందు అకారణముగా జనించి మూల ప్రకృతియై రవి చంద్ర ప్రకాశ జ్యోతివలె స్వయంభువై కాల క్రమంబున పంచవర్ణ కళలతో ప్రభవించె. తర్వాత జీవ బ్రహ్మాత్మకముగా అల్పమధ్యాధిక గతు ప్రథమమున సాత్విక గుణముచే శాంతము వహించి శ్వేతచ్ఛాయతో ప్రకాశించి మరల రాజసగుణ ప్రవర్తనమున రక్తచ్ఛాయతో ఉగ్రగుణ స్వభావముగా నావిర్భవించి, పిమ్మట తామసగుణ వ్యవహారముగా నీలవర్ణ కళతో ప్రకాశించి తామసోగ్ర గుణ వ్యవహారముతో విజృంభించి ఇట్లు త్రిగుణ సంభూత మాయావిలాస కారణమై సమర్థతా శక్తివంతమై ప్రకాశించె.

3 పద్మముల 54 మహాఖర్వములకు యీ మూల ప్రకృతి స్వయంభువై తనంతట తాను చంద్రునియందు శీతలము వలె, సూర్యునియందు వేడి వెలుగువలె, మణులయందు కాంతివలె, పుష్పములయందు సుగంధమువలె, జలమునందు జలమాలిన్యమను పాచివలె, దధియందు నవనీతమువలె, నువ్వులయందు తైలమువలె, తర్కితదాహవం దగ్నివలె, మహా తేజోవంతమై చిత్రవిచిత్ర కళలతో శుభశోభితమై పంచవర్ణ రూపంబులై, కళావంతమై, వస్తువులయందు పంచ వర్ణములై, షడ్రసరూపంబులై, మృదులమై శాంతమై

మాయాశక్తి పరబ్రహ్మమునందు ప్రతిఫలించియు అవినాభావ సంబంధముగ వుండి లేనట్లు లేక యున్నట్లు తనంతట స్వయంభువై యుద్భవించి తాను వేరై తనశక్తిసామర్థ్యము అతి చన స్వభావమున సృష్టికి ప్రధానమై వామభాగంబున సృష్టిస్నీ, ఊర్ధ్వమున స్థితిస్నీ, కుడి దక్షిణ భాగమున లయంబును, శక్తి కుండలియై స్వాధిష్ట బ్రహ్మస్థాన మనంబడి యోన్యాకారమై సృష్టికి మూలమై స్థితిలయముల కాలవాలమై కామేచ్ఛామోహములకు మూలకారణమై సంగమ కర్మకు స్థానమై శాంతాగ్ని మండల స్వరూపమై పీఠాకారమై శ్రీ చక్ర రూపమై పంచశక్త్యాత్మకమై భూత - భవిష్య - ద్వర్తమానముల కాలసూచకమై తన స్వయంభువత్వ శక్తిచేత ప్రభవించి మహిమగలిగి స్వసమర్థతచేతనే నిర్గుణ బ్రహ్మమును సాహ్యము గొని విజృంభించి నిర్గుణ బ్రహ్మమం దావరించి నిర్గుణ బ్రహ్మమును సగుణ మాయాశబలిత విరాడ్బ్రహ్మ స్వరూపం బేర్పరచి శుద్ధ జ్యోతిర్మయాకారమై యీచిచ్ఛక్తి వలన శబ్దరూప కారణంబు గలిగె. యెట్లనగా,

వ్యా — నాదోత్పత్తి 3 ప 46 మ ఖర్వముల 3 పద్మముల - 46 మహా ఖర్వముల సంవత్సరముల కాలమునకు మాయాశక్తి త్రిగుణాంశా బలమున విజృంభించి—అల్ప—మధ్య—అధికగతుల - అకారస్వరమున ప్రథమమున - ద్వితీయమున ఉకారస్వరముగాను తృతీయమున - హల్మాత్ర మకారముగా యీ అక్షర త్రయమున హ్రస్వ "ఓం" అను శక్తి హంశమగు అధో ఓంకారము జనించే "ంఌ". అంతట సృష్టి విస్తరించని

కారణమున దీర్ఘముగా నాలోచించి, నిర్గుణ బ్రహ్మావరణమును సాహ్యముగా గ్రహించి ద్విగుణముగా నావరించి విజృంభించి స్ఫుటాస్ఫుట శబ్దములు-వాక్కులు-వచనములు సూత్రములు శ్లోకములు శృతులుగా భాషాశబ్దములు వివేక ప్రజ్ఞచే త్రిగుణ పద్ధతుల ననుసరించి క్రమాభివృద్ధిగా దశదిశ లాక్రమించి సర్వావరణంబులు నిండి ప్రకాశించి శబ్ద బ్రహ్మ రూపంబయ్యె.

ప్రపంచోత్పత్తి వ్యూహ ప్రారంభము 3 – ప – 39 మ ఖర్వాలు 3 పద్మముల 39 మహాఖర్వముల సంవత్సరముల కాలమున సంపూర్ణ జీవ బ్రహ్మ రూపంబున గుణత్రయ మర్యాదను ప్రపంచోద్భవ సృష్టి–స్థితి లయాదుల నూహింపదొడగె యెట్లనగా: సూర్య–చంద్ర–అగ్ని మండల స్వరూప కారణంబులగు అక్షరత్రయము నాధారముగా జేసి పంచభూత సహిత దేహముల సృష్టించుటకు తాను యత్నించి ద్విగుణముగా నిర్గుణ బ్రహ్మ నాశ్రయించి సగుణ విరాడ్బ్రహ్మ రూపమును సృష్టించి, పరిచర్యోపచార క్రమంబుల సకల లక్షణాంతరములు తన స్వయంభువత్వ శక్తిచేత సంపూర్ణజీవ విరాడ్బ్రహ్మ స్వరూపంబు నేర్పరచె యెట్లనగా:

తాను స్వయంభువత్వ శక్తిచేత, విజృంభించి ఆలోచించగా 3 పద్మముల, 31 మహాఖర్వములనాడు కాల ప్రమాణమును విమర్శింపదొడగె, యీ విషయము ప్రళయ కాలమును విమర్శచేయు ఘట్టమున సంపూర్ణముగా, కాల ప్రమాణము తెలియగలదు.

యీ మూల ప్రకృతి యను మాయాశక్తి, స్వయంభువత్వశక్తి చేతనే 3 పద్మముల 28 మహాఖర్వముల సంవత్సరముల నాటి కాలమున ప్రణవ విరాడ్బ్రహ్మమును సృష్టించుట యెట్లనగా :

ప్రణవ పంచాకారముల సృష్టి – 3ప–28 మ ఖర్వములు.
శ్లో. ప్రథమం తారకం చైవా। ద్వితీయం దండ ముచ్యతే। తృతీయం కుండలాకారం। చతుర్థం అర్ధ చంద్రికం। పంచమం బిందు సంయుక్తం। ఓ మితి జ్యోతిరూపకం॥ యీ సూత్ర క్రమంబున, యీ మూల ప్రకృతి యను మాయా శక్తి, ప్రథమంబున తారక రూపముగాను, ద్వితీయమున దండాకారముగాను, తృతీయమున కుండలాకారముగాను, చతుర్థమున అర్ధ చంద్రాకారముగాను, పంచమమున బింద్వాకారముగాను ప్రబలమై అధోప్రణవ కుండలీ శక్తిగా స్వయంభువత్వ సామర్థ్యము చేత విజృంభించి ద్విగుణముగా పురుషాంశమున ఊర్ధ్వ ఓంకార, మాయాశబళిత విరాడ్బ్రహ్మమును సృష్టించనెంచి ౧ మొదట తారకాకారముగాను, రెండవ తూరి–౨–దండాకారముగాను– మూడవ తూరి–౭– కుండలాకారముగాను నాలుగవ తూరి–ఒ– అర్ధ చంద్రాకారమును చేర్చగా -ఒ- అను అక్షరాకారము కాగా అయిదవ తూరి ఓంబిందువును శిఖను చేర్చగా 'ఓం' అను పూర్ణ ఓంకార మాయాశబళిత, విరాడ్బ్రహ్మ స్వరూపంబయ్యె. యీ ఓంకారమును, ఆది విరాడ్బ్రహ్మమని కొనియాడుదురు. 3 పద్మముల 18 మ–ఖర్వములు.

శ్లో॥ ఓంకారం బిందుసంయుక్తం । నిత్య ధ్యానంతు యోగినాం । కామదం మోక్షదం చైవా । ఓంకారాయ నమోన్నమః॥ యీ ఓంకారము జపించి పరమ సిద్ధులయ్యేదరు. అట్టి యోగులకు కోర్కెలు సమకూరుటయు, మోక్షము పొందుటయు సిద్ధించును- భూత భవిష్య ద్వర్తమానములు తెలియును. దేవతా దర్శనములున్నూ అగును. ఇందున కెలాటి సందేహము పడరాదు.

ఓంకారమందు పంచాక్షరి యుత్పత్తి -2 పద్మముల 95 మ- ఖర్వములకు ప్రణవ పంచాకార కళలయందు అనగా 3 పద్మముల 31 మహాఖర్వముల నాడు విరాట్శక్తి వలన విమర్శింపబడిన 3 పద్మముల 28 మహాఖర్వముల సంవత్సర ములనాడు అఖండ మండలాకార స్వరూపంబగు బిందు వున్నూ, 3ప- 26మ - ఖర్వముల కాలమునకు, జలప్రవాహ కారణమగు అర్ధచంద్రాకారమున్నూ, 3ప- 23మ- ఖర్వముల కాలమున ప్రళయాగ్నిమండల స్వరూపకారణంబగు కుండలా కారం బేర్పడి 3 ప - 21 మ - ఖర్వముల సంవత్సర ములకు జగత్ప్రాణ ప్రవాహ సప్తవాయురూప కారణంబగు దండాకారం బేర్పడియె. 3 ప- 18 మ- ఖర్వముల నాటికి జీవాంకుర శక్తి ప్రధాన కారణంబగు తారకాకారం బేర్పడియె. ఈ పంచాకార కళలే, ప్రణవశబ్ద బ్రహ్మంబై తదంశలే పంచాక్షరికి కారణంబులయ్యె యెట్లనగా:

## పంచాక్షరి యుత్పత్తి క్రమము

3 ప-15మ - ఖర్వములకు లక్ష్మీహాంశ గల జీవ బ్రహ్మాంకురంబగు తారకాకారంబున - (న) కారంబును, ప్రాణి బలరూప కారణంబగు, వాయువు నందు, దండాకారమున (మ) కారంబును, శాంతాగ్ని మండల తేజోబల కారణంబగు, కుండలాకారంబున (శి) కారంబును, ప్రాణ రక్షణ కారణ అర్ధ చంద్రాంశంబున, (వ) కారమున్ను, అఖండ మండలాకార ఆకాశాంశమున, బిందువు నందు, (య) కారమున్ను, చేరి పంచాక్షరి యయ్యె. యీ పంచాకారములు 5- సంవత్సరములకు అనగా 2 పద్మముల 95 మహా ఖర్వాల కాలమునకు, ప్రణవ పంచాకారములున్ను, 2-పద్మముల 78 మ-ఖర్వములకు పంచాక్షరి యుత్పన్నమయ్యె. యీ పంచాక్షరి మోక్షమును, సర్వసిద్ధుల నిచ్చును.

## పంచాక్షరి ధ్యానము

యీ పంచాక్షరి ధ్యాన జపాదులవలన మనస్సు శుద్ధి గలిగి జ్ఞానోత్పత్తి గలిగి సర్వ సంశయములు, సర్వ శత్రు బాధలు శమించి జయము పొంది, భావ్యకాల సూచనలు దెలియుచు మనోల్లాసము గలిగి జనులు స్నేహము చేయుటయు సర్వజీవులు సమ ధర్మమున నుండును.

## పంచాక్షరీ ధ్యాన శ్లోకములు

శ్లో॥ ఓంకారం బిందు సంయుక్తం నిత్యధ్యానంతు యోగినాం। కామదం మోక్షదం చైవా ఓంకారాయ నమోన్నమః ॥

శ్లో॥ నమంత ఋషయోగీనాం నమోధ్యా సిరసాంగనా।
నమంత దేవ దేవేశ నకారాయ నమో న్నమః॥

శ్లో॥ మహాదేవం మహాత్మానం, మహాధ్యానం పరా
యణం। మహాపాప వినిర్ముక్తం, మకారాయ నమో న్నమః॥

శ్లో॥ శివం శాంతం జగన్నాధం లోకాను గ్రహాకారణం।
శివమేవ పరంధైవం శికారాయ నమో న్నమః॥

శ్లో॥ వామనం వృషభం యంత్రం వాసుకీ కంఠ భూష
ణం। వామశక్తి ధరం దేవం వకారాయ నమో న్నమః॥

శ్లో॥ యంత్ర యంత్రస్తితం దేవం యంత్ర సర్వార్థ
సాధకం। యంత్ర యంత్రేశ దేవేశం యకారాయ నమో న్నమః॥

శ్లో॥ షడక్షర మిదం స్తోత్రం, ప్రాత రుద్దాయ
యః పఠేత్। జనయత్ర కృతం నిత్యం సర్వపాప నికృంతనం॥

యీ పంచాక్షరి ధ్యాన జపాదులు సర్వారిష్టములు హరించును. యీ పంచాక్షరికే సంకల్పము కరన్యాసము- అంగ న్యాసము- ధ్యానము- దిగ్బంధనము - కవచములున్నూ గలవు. ఇవి నిత్య ధ్యాన పారాయణ చేయువారికి నూతన జ్ఞానము గలుగును. సర్వారిష్టములు తొలగి, స్వేచ్ఛా పరు డగును. యీ పంచాక్షరి యందుగల 5 అక్షరములకు 5 మంత్ర ములున్నూ, కరన్యాసాక్షరముల వలన 5 మంత్రములున్నూ, అంగన్యాసమున 6 మంత్రములున్నూ, చేరి 11 మంత్ర ములున్నూ, దశమంత్ర పల్లవములతో 10 మంత్రములున్నూ, పంచభూత మంత్రములున్నూ, సూర్య చంద్రాగ్ని స్థాన

ముల బ్రహ్మ, విష్ణు, ఈశ్వర మంత్రములు కలిసి, ఈశ్వర అష్టమూర్తి స్వరూప ధ్యాన – జప పూజామంత్రములున్నూ, అనంతములుగా నున్నవి. అన్ని మంత్రములు వ్రాయుట దుస్తరము. ఆయా మంత్రముల బీజములు మాత్రము ఇచ్చట వ్రాయు చున్నాను. గ్రంథ విస్తర భయమున్నూ, గలదు. వీటితో ముగించుచున్నాను.

## ఓంకార విరాట్టు మహిమ

శ్లో॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షుభిః। ఓ మిత్యేకాక్షరం బ్రహ్మవ్యా హరన్మామనుస్మరన్ ప్రయాతి త్యజం దేహం నయాతి పరమాంగతిం। ప్రాధాన్యం శ్రూయతే శ్రుత్యా ప్రణవస్య జాపాదిషు తస్మాత్సర్వప్రయత్నేన ప్రణవైకపరోభవేత్। జపజ్ఞానా త్తథాధ్యానా నాన్యద్భిక్షోస్తు శోధనం। తస్మాత్తాని తథాకుర్యాత్ ద్యుతిశుధ్యర్థమాత్మనః.

ఇది విరాడ్బ్రహ్మ స్వరూపమగుటచే దీని కన్యముగా మించినది లేదు. ఇది త్రిమూర్త్యాత్మకము. ప్రథమ ద్వితీయ మూర్తులు స్వరవ్యంజనాత్మకములు. తృతీయమూర్తి అతి సూక్ష్మములు, అని యోగులు ధ్యానింతురు. పరమాణువు అర్ధాంశము. నిర్గుణ ప్రకాశము. అక్షయమైయుండును. ఇది యెరిగిన ముక్తిలభించును. జ్ఞాన తేజస్సు గలుగును. అకారము తేజస్సున్నూ, ఉకారము క్షరమున్నూ, మకారము అతి సూక్ష్మమున్నూ కలిసి ఓంకార మయ్యెను. అకారము బ్రహ్మ స్వరూపము, ఉకారము విష్ణు స్వరూపము, మకారము రుద్ర

స్వరూపము అని తెలియవలెను. నిత్య నిర్మల నిర్గుణము ఓంకార మయ్యెను. దీని నుచ్చరించి-జపించి స్మరింపుచున్న యోగసాధన కల్పించును. యోగారూఢునకు సర్వసిద్ధుల నిచ్చును.

## యోగాభ్యాసము

ఇట్టి ప్రణవమును పూరకమున 2 రేచకమున 2 కుంభకమున 2 ను ఇట్లభ్యసించినను నియామకమున క్రమ వృద్ధిగా చేయుచుండిన అభ్యాసమున స్థిరపడును. తర్వాత 12 ప్రణవము లుచ్చరించునంత కాలమును, తర్వాత 24 ప్రణవము లుచ్చరించు నంతకాలమున్నూ, తర్వాత 36 ప్రణవము లుచ్చరించు నంతకాలమున్నూ యిట్లు కాలక్రమాభివృద్ధివలన యోగారూఢత గల్గును. జలచర స్థలచర క్రూర జంతువుల వలన యోగనిష్టునికి బాధలంటవు. సర్వజంతు వశీభూతములగును. వశ్యసిద్ధి లభించి సిద్ధుడగును. గుణత్రయ వికారములు వదలవలెను. యీ గ్రంథమున అధ్యాత్మఖండమున గుణత్రయ వివరణము వ్రాసియున్నది. అది చూచేది.

## యోగులు నిత్యధ్యానము చేయు పంచరత్నములు

శ్లో॥ నాహం దేహో నేంద్రియాణ్యంత రంగో। నాహంకార ప్రాణ వర్గోన బుద్ధి॥ దారా పుత్ర క్షేత్ర విత్తాది దూరః. సాక్షీ నిత్య ప్రత్యగాత్మా శ్శివోహం॥

శ్లో॥ రజ్జు జ్ఞానాద్భాతి రజ్జో యథాహి సత్యం। జ్ఞానాద్భాతి। రజ్జో యథాహి సత్యం జ్ఞానాదాత్మనో జీవభావః॥

ఆప్తోస్మ్యాహం భ్రాంతి నా శోపింరజ్జుః। జీవో నా మం దేశి శోక్త్యా శివోహం॥

శ్లో॥ ఆధాతీదం విశ్వమాత్మాన్య సత్యం। సత్యం జ్ఞానా నంద రూపో విమోహాత్। నిద్రామోహా స్వప్నతస్త్స్య సత్యం శుద్ధః పూర్ణో దేశికోక్త్యా శివోహం॥

శ్లో॥ జాతో నాహం సప్రవృద్ధోన నష్టః దేహస్యోక్తా ప్రాకృత సర్వ ధర్మాన్। కర్తృత్వాది శ్చిన్మయాశ్చాస్తి నాహం। కారశ్చైః హ్యాత్మనో మే శ్శివోహం॥

శ్లో॥ ముక్తో నాన్యత్కించి దత్రాస్తి విశ్వం। సత్యం చాహ్యం వస్తు మాయోప క్లుప్తం। అస్యచ్ఛాంత్యం। ద్భాసమానం స్వతుల్యం మయ్యం ద్వైతే భాతి కస్మాచ్ఛివోహం॥

సర్వం సద్గురు దేవార్పణమస్తు.

---

## ఓంకారమందు జనించిన అధర్వణవేద మంత్రబీజాక్షర సూత్రములు

శ్లో॥ అకారం మాతృబీజంచ ఆకారం పాశబీజకం। మాయాబీజం ఇకారంతు। ఈకారంతు మహాత్మనః। ఉకారం వర్ధనం బీజం। ఊకారోచ్చాటనం తథా। ఋకారంగణ బీజంతు। ఋూకారం మోహానం తథా। ఌకారం ద్వేషణం బీజం ౡకారోచ్చాటనం తథా। ఎకారం శ్రీవశం చైవా ఐకారం పురుషవశ్యకం। ఓకారం లోకవశ్యంచ ఔకారం రాజవశ్యకం। అంకారం రాజవశ్యంచ అఃకారం అశ్వవశ్యకం॥ అఃకారం మృత్యునాశంచ అమృత ప్రాణబీజ ఇతి.

శ్లో॥ కకారం కామబీజంచ। ఖకారం గమనం తథా। గకారం గణపతించైవా। ఘకారం స్తంభనం తథా। జకారం పుణ్యబీజంచ। చకారం చండికాబీజం। ఛకారం భద్రకాళికాం జకారం చంద్రబీజంచ। ఝకారం రుద్రబీజకం। ఞకారం శూల బీజంచ। టకారోచ్చాటనం తథా। ఠకార స్తంభనం బీజం। డకారం గరుడం తథా॥ ఢకారంచ కుబేరంచ। ణకారం యక్షబీజకం। తకారం ధనబీజంచ। థకారం సూర్యబీజకం। దుర్గాబీజం దకారంచ। ధకారం ధర్మబీజకం। నకారం ధూమబీజకం। పకారం వీరభద్రంచ ఫకారం దేవబీజకం। బకారం అశ్వినీబీజం। భకారం భద్రకాళికాం। మకారో రుద్రలక్ష్మీంచ యకారం వాయుబీజకం। రకారం అగ్నిబీజంచ లకారం శక్తిబీజకం। వకారో మృత్యు బీజంచ శకారం లక్ష్మీబీజకం। షకారం సూర్యబీజంచ। సకారంచ సరస్వతీ। హకారం దేవమాకాశం। ళకారం భూమిబీజకం। క్షకారం శ్రీనృశింహాంచ। ఇత్యాసౌబీజ నిర్ణయం అకారాది క్షకారాంతం సమాసా పరికీర్తితం.

## బీజదేవతా భేదములు

అకారం బ్రహ్మబీజం। ఆకారం మాయాబీజం। ఇకారం విష్ణుబీజం। ఈకారం మాయాదేవతబీజం। ఉకారం లోకదేవతా బీజం। ఊ పృధ్వీ బీజం। ఋ విధిదైవతబీజం। ౠ శిఖండిబీజం ఌ ఆకర్షణ బీజం। ఏ వీరభద్ర బీజం। ఐ సరస్వతి బీజం। ఆనంద బీజం। వాగ్భవ బీజం బ్రహ్మ బీజం.

## సర్వమంత్ర బీజములు

ఓం ప్రణవబీజం । ఈశ్వరబీజం । విరాడ్బీజం శంకర బీజం। అం మహేశ్వరబీజం। ఆః కాలరుద్రబీజం। కం అగ్నిబీజం క్రాం అంకుశబీజం। ఖం మారణబీజం ఘం స్థంభనబీజం భైరవ బీజం। జం ప్రాణబీజం కాలబీజం। జకారం భద్రబీజం జాతవేద బీజం। ఝుం మంత్రబీజం। అర్ధనారీశ్వరబీజం।ఞం పరమాత్మబీజం। టకారం పార్థివబీజం। డకారం భార్గవబీజం। ఢం ధనబీజం ణం నందిబీజం। థం పరాశక్తిబీజం। దం వరుణబీజం। ధకారం ధర్మబీజం । నైరుతిబీజం। నం నిర్వికల్పబీజం। పం పాశబీజం ఫం వాసుదేవబీజం। పాశుపతబీజం। బంత్రిమూర్తిబీజం। భం భార్గవ బీజం। మం పార్వతిబీజం। రం రుద్రబీజం। లం వృధివీబీజం రాజస్థంభనబీజం। వం అమృతబీజం। షం ద్వాదశాత్మబీజం నైరుతిబీజం। విద్వేషణబీజం। సం సరస్వతిబీజం। యక్షబీజం హాం యమబీజం। శివబీజం। శం యమబీజం। క్షుం భైరవబీజం క్షేత్రబీజం.

## దిక్పాలక బీజములు

ఝుం ఇంద్రబీజం। రం అగ్నిబీజం। దం యమబీజం క్షుం నైరుతిబీజం। వం వరుణబీజం। శం వాయువ్యబీజం। క్షుం కుబేర బీజం। హాం ఈశాన్యబీజం। ఖం ఆకాశబీజం। లం పృధివిబీజం క్షుం అవాంతరబీజం। ఇవి దిగ్బంధనబీజములు. ప్రణవ విరాడ్బ్రిష్టా మందు ఆవరింపబడియుండు అధర్వణశాస్త్రవిదు లెరుగుదురు.

## బీజవివరణము

శ్రీం లక్ష్మీబీజం। హ్రీం మాయాబీజం। శక్తిబీజం। హ్రూం వారాహిబీజం। హ్రాం ప్రసాదబీజం। ద్రీం ఉన్మత్తబీజం। బాణబీజం। మదన బాణబీజం। సోం చంద్రబీజం। హూం రుద్రబీజం। క్షుం భైరవబీజం। క్లీం కామరాజబీజం। విష్ణుబీజం। రం వారాహి బీజం। వం అమృతబీజం। క్ష్రౌం నరసింహబీజం। గ్లాం భూమిబీజం। శ్రూం తుంబురబీజం.

## మంత్ర బల బీజములు

శ్లో॥ అకారాదమృతప్రాణా, బీజాత్సర్వార్థసాధకం। భక్తార్తరక్షణోద్ధారం। క్లీంబీజం కులవర్ధనం॥ ఖేంబీజం మ్మారణా గ్నిచ। ఠం వైరికుల స్తంభనం। ఘకారం రౌద్రసంహారం। చకారం చండికేశ్వరి। ఝకారం మంత్రవిజృంభం। ఢకారం శత్రు మారణం। ధం ధందనాది సంపత్తి। భకారం భయనాశనం। మకారం మానసోల్లాసం। యకారం యమభయం హరం। రకారాగ్నిం మారణంచ। లకారం వృద్ధిబీజకం। లక్ష్మీవశ్యం లాలనంచ। వ-శ-ష-సం-వశ్యబీజకం। ఐం బ్రహ్మమహాదా నందం। హ్రీం భీషణ మహాత్ప్రదం.

## మంత్రదశ పల్లవములు

శ్లో॥ వశ్యాకర్షణమంత్రాదా। ద్వేషమారణమధ్యమే। ఉచ్చాటనాది మంత్రాంతే। ఇత్యేవం మంత్రపల్లవాః॥ వషడ్వశ్యే। ఫటుచ్చాటే। హుంద్వేషే। ఖేచమారణే। ఠంస్థంభే వౌషడాకర్షే। నమసంపత్తిమేవచ। స్వాహాశాంతి సధాపుష్టి।

రిత్యేతే మంత్రపల్లవాః॥ న్యాసబీజములు దశమంత్ర పల్లవములు కలిసి। మంత్రమునకు షోడశకళలు పూర్తియగునని అధర్వణ వేద సిద్ధాంతము.

## యంత్రోద్ధారణ

శ్లో॥ బీజం ప్రాణంచ శక్తించ। వృద్ధి ర్వశ్యాదికం తథా। గాయిత్రీ మంత్ర యంత్రాది। ప్రాణస్థాపన మేవచ। భూతదిక్పాల బీజాని। యంత్రస్యాంగాని వైదశ। మంత్ర బీజం శిరోభాగం। దృష్టి బీజంతు పార్శ్వకం। శక్తి బీజ మధో లిఖ్య। ఈశాన్యే వశ్య బీజకం। ఆగ్నేయే ప్రాణ బీజంచ। వాయువ్యం భూత బీజకాన్। ప్రాణ ప్రతిష్ఠా నైరుత్యాం। ప్రాదక్షిణ్యే నయోజయేత్। ఇంద్రాది గోపబీజాని। గాయిత్రీ మంత్ర యంత్రవాన్ ॥

ఓంకార విరాడ్బ్రహ్మ మందు। సప్తకోటి మహామంత్ర యంత్ర బీజములుగా। తొలుత ప్రభవించె। చతుర్వేదములు 28 ఆగమముల యందును। హోమ మంత్రంబులై। యజ్ఞాది, వేదబుక్కులుగా పరిణమించి। సర్వదేవతా వశీకరానుగ్రహ సాధకములుగా। నుండు అధర్వణ వేదవేత్తలకు। యీ రహస్యములు తెలిసి యుండును। గ్రంథ విస్తర భయముచే ముగించితిని ॥

## షడధ్వ వివరణము

అకారాద్యక్షర బీజ వర్ణాధ్వము-1- ముప్పది రెండు విద్యల పదాధ్వము -2- అరువది నాల్గు విద్యల కళాధ్వము

3-సప్తకోటి మంత్రబీజ। మంత్రాధ్వము -4- బ్రహ్మాది దేవతల వలన భువనాధ్వము -5- అధ్యాత్మ మోక్ష విద్యాశాంతి కళాధ్వము - 6- యీ షడధ్వములు। ఓంకారంచ చరాచర అను సూత్రముచేత। సర్వము ప్రణవమందె పుట్టినవి॥

## బ్రహ్మచైతన్యోత్పత్తి వివరము

2- పద్మముల 79 మహాఖర్వముల కాలమునకు ఓంకారమందు విరాట్శక్తి ముక్తికాంతారూపమున సర్వ సృష్టికి మూల కారణమై బ్రహ్మపిపీలికాది పర్యంతము సృష్టి చేయుటకు మంత్ర రూప మూలములచేత హెూమాది కార్య కర్మరూపములుగా ప్రారంభించి చేయు నవసరమున జీవ బ్రహ్మరూపంబున మనోవ్యాపార రూపక మానస బ్రహ్మ రూపోదయంబయ్యె. సకల విషయ వ్యాపారంభ ప్రవర్తన సంకల్ప వికల్పముల జరిగించు చుండె. ఇది బ్రహ్మరూప ప్రథమ తత్వము. జీవ బ్రహ్మధిష్టానము. శక్తియొక్క సృష్టి వల్లనే బ్రహ్మాండోత్పత్తికి కారణము.

## బ్రహ్మచైతన్యోత్పత్తులు

2 పద్మముల 58 మహాఖర్వముల కాలమునకు పంచ రూపదృగ్గోచరాధీనంబగు చాక్షుష బ్రహ్మతత్వము జనించె. ఇది జ్ఞానేంద్రియ వ్యవహారముల రెండవబ్రహ్మరూపము.

2 పద్మముల 40 మహాఖర్వముల కాలమున స్ఫుటాస్ఫుట వచన సత్యాసత్య వ్యాకరణాదివిశేష సప్తకోటి మహామంత్ర

భాష్యాది కృత్యములు గల వాచకబ్రహ్మతత్త్వము 3 వ బ్రహ్మరూపము.

2 పద్మముల 22 మహాఖర్వముల కాలమున దశదిశాశబ్ద గ్రహణ మాలకించుట, వినుట, విషయము దెలియుట ఇట్టి శ్రవణగ్రాహ్యంబగు శ్రావణబ్రహ్మతత్త్వోత్పత్తి యను 4 వ బ్రహ్మరూపము.

2 పద్మముల 4 మహాఖర్వముల కాలమున సత్యాసత్య వివేక పరిశీలనాది వివేకము గల నా సత్యబ్రహ్మతత్త్వ ముదయించె. ఇది 5 వ బ్రహ్మరూపము.

1 పద్మము 86 మహాఖర్వముల కాలమున స్థూల సూక్ష్మ అనంత కోటి బ్రహ్మాండవలయం బగు 14 కోట్ల 56 లక్షల యోజనముల పొడవును 12 కోట్ల 85 లక్షల యోజనముల వెడల్పు గల బ్రహ్మాండవలయాక్రమ విక్రముండగు అండజబ్రహ్మతత్త్వ ముదయించె. 6 వ బ్రహ్మరూపము.

1 పద్మము 68 మహాఖర్వాల కాలమునకు సర్వలోక సృష్టికర్త యగు పద్మజబ్రహ్మ 7 వ తత్త్వము పూర్తియై సంపూర్ణలక్షణ శోభితముగా జనించె. యీ విరాట్శక్తి బ్రహ్మను సృష్టించుట కింత కాలవ్యవధి జరిగెను. యీ విరాట్శక్తి భువనాభివృద్ధి కారణకర్తయై అధో మధ్య ఊర్ధ్వభాగముల తామస రాజస సాత్వికగుణ మర్యాదలచేత.

శ్లో॥ ఊర్ధ్వే సాత్వికమిత్యాహు ర్మధ్యే రాజస ముచ్యతే। అధోగతం తామసంచ గుణత్రయ మితీరితం॥ అను

నూత్రక్రమమున సాత్వికగుణప్రవర్తనలచే నుండు యూర్ధ్వ మున దేవతాలోకమున్నూ అనగా స్వర్గలోకమున్నూ, రాజసగుణ ప్రవర్తనలుగల మధ్యభాగమున మానవలోక మున్నూ, తామసగుణ ప్రవర్తనలుగల మూఢకర్మలచేత అధోభాగమున నరకలోకముగాను యీ త్రిలోకముల సృష్టి చేయుటకు, విరాట్శక్తి ప్రథమంబున శుద్ధ జీవచైతన్యమును పద్మజబ్రహ్మగా సృజించెను. 1– పద్మం 55– మహాఖర్వముల కాలమున.

## విరాట్శక్తిచే త్రిమూర్తు లుత్పత్తి

బ్రహ్మోత్పత్తి యీ మూలప్రకృతి యను విరాట్శక్తి ప్రభవించి తనయందుగల స్వయంభావత్వ శక్తివలన ప్రథ మంబున జగదుత్పత్తి చేయుపద్ధతి నవలంబించి రాజసగుణోద్రేక మున బ్రహ్మజన్మాకారమును సృజించె. అప్పటికి 1– పద్మం 50 మహాఖర్వముల 5– ఖర్వముల 50 న్యర్బుదముల 2 అర్బుదముల కాలమాయెను. క్రమాభివృద్ధికి రాగా అధిక సుందరాకారుండగుటవలన విరాట్శక్తి విభ్రమచెంది యొక సుందరాకారము ధరించిన స్త్రీయై కామించి నా కామము దీర్చుమనగా బ్రహ్మదేవుండు నీవు మాతృదేవతవు, అది ధర్మము కాదనగా విరాట్శక్తి యిట్లనియె. నాకు జరాయువు బుట్టెను. దానికి నీవు జనించితివి. గనుక నీవు నాకు మనుమడ వయ్యెద వనగా విని సమ్మతించని కారణమున శక్తి కోరిక తీరలేదని కోపించి నీవలన సృష్టిభంగమై యత్నము సాగని

కారణమున బ్రహ్మను శక్తి సంహారించె. తర్వాత రాజసవృత్తి వలన ప్రయోజనము లేదని ఆవృత్తి చాలించి తర్వాత.

## విష్ణువుత్పత్తి

1- పద్మ 34 మహాఖర్వములకు సాత్విక గుణవృత్తి నవలంబించి పరమసాత్వికగుణమూర్తియగు విష్ణువును సృజించగ। పరమసాత్విక మూర్తియై - శాంతవృత్తి గలిగి సకలసుగుణగుణాభిరాముడై వృద్ధికి వచ్చుచు। ప్రకాశింపు చుండగ సృష్టికి కారణంబగు కామేచ్ఛను దెల్పగ। సమ్మతించని కారణమున ఆ విష్ణువును పనికిరావని ప్రచండ కోపావేశంబున సంహారించె. ఆయుగ్రము శాంతించక సాత్విక రాజసములు పనికిరాలేదని ప్రచండతామసరోషావేశమున.

## ఈశ్వరోత్పత్తి

శాంతించక తామసరౌద్రావేశమున ఈశ్వరు సృష్టించగ అభివృద్ధికి వచ్చుచు, శక్తియొక్క సంకల్పరూపేచ్ఛను దెలియ పరచగా కొంతకాల మాలోచించి శక్తిసంకల్పమును మార్చి స్వయముగా శిష్టాచారము లేర్పరచ దలంచి తగిన యాధార ములకొరకు యోచించుచు నీ యిచ్ఛదీర్చుట కాలోచించు చున్నాను. కొంతతడవు నిదానించవలసినదని చెప్పగా శక్తి ఆశవదలక నిరీక్షించుచుండగా.

## ఈశ్వరుండు శక్తివలన సర్వరహస్యములు దెలియుట

ఈశ్వరుండు శక్తివలన సాత్విక రాజస తామస గుణధర్మములు భూత భవిష్యద్వర్తమాన విషయవిమర్శలు.

ఉత్పత్తి స్థితి లయ క్రమములు పంచ వేదముల ధర్మ కర్మానుష్ఠాన విధులు ఉపనిషద్రహస్యములు షట్శాస్త్రవిధులు అష్టావింశతి ఆగమకర్మములు సృష్టివిధానములు పోషణవిధానములు మారణక్రమములు శిక్షాదిక్రమంబులు రక్షణక్రమములు శాపానుగ్రహసమర్థతలు భక్తరక్షణవిధులు శత్రుశిక్షణాది విధులు మహాత్పురుష లక్షణములు అగ్ని నేత్రము డమరుకవిద్య భరతనాట్యవిధులు ఇంద్రజాలమహేంద్రజాల టక్కు టమార గోకర్ణ గజకర్ణ విద్యలు ఈశ్వరుండు శక్తివలన గ్రహించి బ్రహ్మవిష్ణువులను సజీవులంజేసి బ్రహ్మకు సృష్టిక్రమము విష్ణువు జీవపోషణ కర్తృత్వమున్నూ ఈశ్వరుడు మారణ శోషణకర్మములున్నూ సర్వవిద్యారహస్యములు గ్రహించి త్రిమూర్తులేకమై బ్రహ్మ విష్ణువులకు విద్యాలోపంబులు దీర్పించి విరాట్శక్తివలన సర్వసంశయములు దీర్చుకొని నిత్యానుష్ఠానములు క్రమములు దప్పక ప్రవర్తింపుచుండిరి. మరియు తర్వాత.

## త్రిశక్తు లుత్పత్తి

1 పద్మ 26 మహాఖర్వముల కాలమున యొక సమయంబున విరాట్శక్తి త్రిమూర్తులను ప్రార్థింపగ విని తెలియని వారివలె నిరీక్షించి చూచుచుండిరి. గాని ప్రతిసమాధానము లేకయుండగా యీ శక్తి తనసృష్టి యిచ్ఛాకారణ విధానమున ప్రార్థించి తన కామేచ్ఛను దెల్పగ నీ విషయమే ఆలోచించుచున్నాము. కొంచము నిదానించమని చెప్పగా విని మనశ్శాంతి

బొందియుండె. యిట్లుండగా యొక సమయమున మరియొక తూరి శక్తి ఆ విషయము మందలించగా!

విరాట్శక్తి మాయాతనువు ఈశ్వరుండు అగ్ని నేత్రము ధరించి క్రూరదృష్టితో వీక్షింపగ విరాట్శక్తి ఈశ్వర నేత్రాగ్ని దృష్టివలన దగ్ధమై భస్మరూపంబయ్యె ఆభస్మము త్రిమూర్తులు శక్తి యిచ్చిన మంత్రబలముచేత మూడు భాగములుచేసి ముగ్గురున్నూ మంత్రోదకములతో చల్లి అనుష్టానము పూర్తి యగువరకు చేయగా క్రమముగా.

## పార్వతీ లక్ష్మి సరస్వతు లుత్పత్తి

1 పద్మం 25 మహాఖర్వములు విష్ణువువద్ద పార్వతియు, బ్రహ్మవద్ద లక్ష్మియు, ఈశ్వరునివద్ద సరస్వతియు, ఉత్పత్తియై, బ్రహ్మ సరస్వతినిన్ని, విష్ణువు లక్ష్మినిన్ని, ఈశ్వరుడు పార్వతినిన్ని భార్యలుగా గ్రహించిరి. అంతట త్రిమూర్తులున్నూ, త్రిశక్తులున్నూ, ప్రత్యేకము వారివారి అవసరములకొలది సృష్టిక్రమములు, విచారించుచుండిరి.

## విరాట్శక్తి ప్రభావము

విరాట్శక్తి మాయాతనువు దగ్ధమై ఆత్మప్రాయముగా పార్వతికి ప్రత్యక్షమై నీవు జగన్మాతవై జగద్రక్షణకర్తృత్వము వహించి ముందుత్పత్తికాబోవు 14- భువనంబులం గాపాడి శిష్టరక్షణ దుష్టశిక్షణ పరిపాలనంబుచేయు నవసరమున నేను నీయందావరించి యుండుదునని మనోవాగ్దత్తంబులిచ్చె. తదాదిగా పార్వతీ జగన్మాతృకగా నవతరించియుండె. వీరు దేహరహిత

ఆత్మ ప్రాయులుగా జ్యోతిస్స్వరూపులై యుందురు. లోక మోహితులై అజ్ఞానాంధకారమున నుండువారికి స్వాధీనులు కారు.

యీ విరాట్శక్తి దత్తమగు పార్వతీదేవియు, శచీదేవి స్వాహాదేవి,శ్యామలాదేవి, దీర్ఘాదేవి,కాళికాదేవి,అంజనాదేవి, చిత్రరేఖ మొదలుగాగలవారున్ను గాక। కృతయుగంబున రేణుకా శక్తియున్నూ, త్రేతాయుగంబున జానకీ శక్తిగానూ, ద్వాపరంబున ద్రౌపది శక్తిగాను, కలియుగమున సర్వదేవతా ఋషిగణంబులకు భార్యలుగాను, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర పంచమ చండాల మ్లేచ్ఛ శబర పుళింద కిరాత కులాదులలో ఒక్కొక్కనికి ఒక్కొకభార్యగా పశు, మృగ, క్రిమి, కీటక జాతులలోను స్త్రీరూపములుగా నవతరించి నటింపుచు జగత్ప్రచారము చేయుచు లోకమున విహారము చేయుచుండు మరియు.

## ద్వాత్రింశత్ప్రదేవతలు

విరాట్శక్తి మొదటనుండియు గాయిత్రీ, బాల, భగళా, లలితా, త్రిపురసుందరి, కాళి మొదలగు ప్రధానదేవతలుగా పీఠాధిదేవతలు గలరు. వారెవరనగా–యిపుడు చెప్పినవారు గాక 32 అవతారములు గలవని ప్రసిద్ధి–అధర్వణవేద ప్రమాణము.

శ్లో॥ లంకాయాం శాంకరీదేవి, కామాక్షీ కంచిపట్టణే, ప్రద్యుమ్నే సింహళాదేవీ, చాముండీ క్రౌంచపట్టణే, అలంపుర్యాం

జోగులాంబా, శ్రీశైలే భ్రమరాంబికా, కొల్లాపుర్యాం మహాలక్ష్మీ మారీ స్ఫోటకహారిణీ, ఉజ్జయిన్యాం మహాకాళీ, మహూర్యా వీరపూరికా, ఓఢ్రాయాం గిరిజాదేవి, పీఠికా పురుహూతికా, గయాం మాంగల్యగౌరీచ, మాణిక్యా ద్రాక్షవాటికా, జ్వాలాయాం వైష్ణవీదేవి, ప్రయాగే మాధవేశ్వరీ, వారణాశి విశాలాక్షీ, అయక్షేత్రే కామరూపిణీ, హరిద్వారే మహామాయా, కాశ్మీరేచ సరస్వతి, జ్వాలారంధ్రే మహామాయా, బ్రహ్మాండేభువనేశ్వరి, చిదంబరేచసావిత్రి, బదర్యాంకాళరాత్రిణీ, ఏకశిలాయాంచ దుమూరా సేతోః సర్వతవర్ధనీ, గాయత్రీదేవి కావేర్యాం, పట్టస్తే భద్రకాళికా, హాల్యాదినగర మీనాక్షీ, జగదాంబా పుష్పగిరేః, ఇంద్రకీలాద్రాచ దుర్గా సద్భక్త జనరక్షణీ, కేదారపురపీఠేచ మహిషాసురమర్దనీ, త్రిపురాంతక పీఠేచ దేవీత్రిపురసుందరీ, ద్వాత్రింశత్పీఠ పీఠాని నిర్మితం విశ్వకర్మణః, యేతత్పరాది దేవీచ త్రిసంధ్యాయాం పఠేన్నరః సర్వసంపత్ప్రదం శోభం సర్వకామాంచ వాప్నుయాత్.

యీ 32 పీఠదేవతులకున్నూ యితర దేవతులకున్నూ 10 అక్షరములకు మించని బీజమంత్రములున్నూ 20 అక్షరములకు మించని బీజమంత్రములున్నూ 20 అక్షరములకు మించినది మూలమంత్రము. యీ 3 రకముల మంత్రములున్నూ బాల్యవయసున చేయతగినవి. యవ్వనమందును, వార్ధక్యమునందును మాలామంత్రములు త్వరగా సిద్ధించును. అభీష్టకామ్యసిద్ధికొరకు యే వయస్సునందైనను యే మంత్రమైనను జపించవచ్చును. యే మంత్రమునకైనను 10 వంతు తర్పణము,

తర్పణకు 10 వంతు హోమమున్నూ హోమమునకు 10 వంతు భోజనములున్నూ చేయవలెను. నిశ్చయముగా నమితముగా జపముచేసిన ద్విగుణజపమువలన పైక్రమ మవసరములేదు.

## మంత్రార్ణవ సిద్ధారిశోధనము

నృసింహము, సౌరము, వారాహము, వారాహి. ఏకవర్ణ, త్రివర్ణ, పంచవర్ణక, షట్, సప్త, అష్ట, నవ, ఏకాదశ, ద్వాత్రింశ, వర్ణక హంసధ్యానమంత్రములు వేదోదితమంత్రములు ప్రసాదమంత్రములు గారుడమంత్రములు బాల పంచాక్షరి ఏకాక్షరి బీజమంత్రములకు బౌద్ధ జైన స్వప్నలబ్ధి మంత్రములు శ్రీమూలకోపదేశములు మాలామంత్రములు వీటికి మంత్రార్ణవ సిద్ధారి శోధన మవసరములేదు. తక్కిన వాటికి అవసరమని మంత్రమహోదధియందు గలదు.

## జపమాలా లక్షణము

జపమాల 108 కి తక్కువయుండరాదు. మాల యితరులకు చూపరాదు. రుద్రాక్షమాల సర్వకామముల నిచ్చును. కోరికల నిచ్చును. మోక్షము నిచ్చును. తులసిమాల బ్రహ్మజ్ఞానము నిచ్చును. కుశగ్రంధి ఆత్మజ్ఞానము నిచ్చును. పగడమాల లోకవశ్యము నిచ్చును. స్ఫటికమాల సామ్రాజ్య పుత్రసంపద నిచ్చును. ముత్యమాల విద్యాలాభము నిచ్చును. మాణిక్యమాల త్రిలోక స్త్రీ వశీకరమున్నూ, ఇంద్రనీల మరకతములు మాలలు శత్రువుల జయించును. పారదమా

మోక్షము బంగారు వెండిమాలలు మహాదైశ్వర్యము కలిగించును.

## జపాంగుళీ లక్షణము

బొటనవ్రేలు అనామికవ్రేళ్లపై జపమాల నడుపుచు జపించిన ఉత్తమము. కార్యసఫలములు బొటనవ్రేలు తర్జన వ్రేళ్లతో విద్వేషణ ఉచ్చాటనములకు చేసేది. బొటనవ్రేలు చిటికెనవ్రేలుతో జపించిన గ్రహమారణము భూతప్రేతములు వదలి నశించిపోవును. ప్రతి మంత్రమునకున్నూ సంకల్ప, కరన్యాస, అంగన్యాస, ధ్యానము, గాయిత్రీ, కవచ, దిగ్బంధన, వశ్య, ఉచ్చాటన, ద్వేషణ, మారణ, స్తంభన, ఆకర్షణ, శాంతి, పుష్టి, యివి 16న్నూ మంత్రదశపల్లవములతో కూడి షోడశకళ లుండవలెనని అధర్వణవేదసిద్ధాంతము. 128 శక్తి మంత్రములకున్నూ ఇట్లుండును. విరాట్శక్తివలన యీ యధర్వణవేదము పంచమూర్తులకు బోధింపబడినది. గ్రంథ విస్తరమగునని ముగించితిని.

## మంత్రసిద్ధికి సదుపాయము

శ్లో॥ మంత్రాద్యాపాశబీజంచ మంత్రాంతేం కుశబీజకం మంత్రమధ్యే మహామాయా మంత్రసిద్ధికరం భవేత్ ॥ఆదియందు పాశబీజమును మంత్రమధ్య మాయాబీజము మంత్రాంత్యమున అంకుశబీజమున్నూ చేర్చి జపించిన మంత్రసిద్ధియగును. పంచాక్షరి యందుగాని మరియొకమంత్రమందుగాని మంత్రదశపల్లములు చేర్చి జపించగా సిద్ధిబొందిన భోగమోక్షములు కార్యసాధక

ములు కరతలామలకములుగానుండు. తెంపులేక ప్రవాహరూపముగా చేయుబడిన జపానుష్ఠానములవలన అష్టమూర్తులు సర్వదేవతాదర్శనములై శీఘ్రుదిగ్విజయములు గలుగును. గ్రంథవిస్తరమగునని ముగించితిని. పంచాక్షరిమంత్రము మూడవఖండమున వ్రాయబడును.

## పంచబ్రహ్మ లుత్పత్తి

2 పద్మముల 89 మహాఖర్వములకు సూ॥ మహాతో హంకారః అను సూత్రక్రమంబున విచారించగా పంచాక్షర బీజములవలన అనగా నకారమువలన బ్రహ్మయు, మకారమువలన విష్ణువు, శకారమువలన ఈశ్వరుడున్నూ, వకారమువలన ఇంద్రుడున్నూ, యకారమువలన సూర్యుడున్నూ, యీ పంచబ్రహ్మలు, మాయాశబళిత సగుణమహదహంకారులై తను రహిత ఆత్మస్వరూపులై దేహజీవంబులుగల తనువులను సృష్టించి స్థితి సంహారములతో పోషణ జ్ఞానంబు లిచ్చి జగదభివృద్ధిచేయుటకు వీరు కర్తలై పాలనచేయుచుందురు.

క॥ వీరలె బ్రహ్మయు విష్ణువు। ధీరుడు రుద్రుండు ఇంద్ర దివిమణి యనగా। వీరి నటించెడి దాతలు। కోరికలీడేర్చు దేవకుంజరులు భువిన్.

యీ పంచబ్రహ్మల సహాయము లేక యే జీవులైనను యెవ్వరైనను యే కార్యములు చేయుటకు వీలుపడదు. అజ్ఞానమూఢులు మేమే చేసితిమని సంతోషింతురు. 'శివుని యెరుక లేక చీమైన కుట్టునా' యని వేమన్నగారి నిర్వచనపద్ధతి

వలన అహంకార సాహాయ్యములేక యెవ్వరైనా యే పనియు చేయచాలరు. మానవుని సత్తా త్రిగుణముల బలమేనని తెలియ వలయును. అజ్ఞానజీవుడు యే విధమగు శక్తిలేని దుర్బలుడని తెలియవలె. కాలబలమే బలమని తెలియవలెను.

## పంచబ్రహ్మల వివరము

శ్లో॥ మనురీశ్వరనామాచ మయానాం విష్ణుమాపిచ త్వష్టాచ బ్రహ్మనామాచ శిల్పి మహేంద్రనామాచ విశ్వఘ్నో సూర్యనామాచ పంచబ్రహ్మమయం జగతు॥ మనువను ఈశ్వరుండును మయుడను విష్ణువు త్వష్ట యను బ్రహ్మయు శిల్పి యను ఇంద్రుండును విశ్వఘ్నుడను సూర్యుండును వీరు పంచబ్రహ్మలే పంచమూర్తు లనబడుదురు. జగదుద్భవకారణ కర్తలై యుండిరి.

## పంచబ్రహ్మల కర్మవిధులు

హిరణ్యచ్ఛాయగల బ్రహ్మదేవుండు భూమియందు జీవాదిసృష్టియు నీలమేఘచ్ఛాయగల విష్ణుదేవుండు జలమువలన పోణలున్నా తెలుపు చాయగల ఈశ్వరుండు మారణ శోషణ అగ్నిపాకకర్మలు చేయుటయు మరకతచ్ఛాయగల ఇంద్రుండు వర్షములవలన సస్యవృద్ధియు పంటధాన్యములు సర్వశిల్పసామగ్రులచేత దేహభోగంబుల తృప్తులంజేయుటయు మాణిక్యచ్ఛాయగల దైవజ్ఞుండను సూర్యుండు ఆరోగ్య జ్ఞానతేజస్సు లిచ్చుటయు వీరు బ్రహ్మాండమునకు సర్వకర్తృత్వ కారణాధిపతులైరి. మరియు వీరు,

## చతుర్దిశాధిష్ఠాన దేవతలు

బ్రహ్మోత్పత్తియై 1 పద్మము 55 మహాఖర్వముల నాడు మొదలుగా మేరుపర్వత తూర్పుదిగ్భాగంబున భద్రాశ్వవర్ష హాయగ్రీవ స్వామియున్ను, 1 పద్మము 37 మహా ఖర్వముల కాలమున దక్షిణభాగ భారతవర్ష కూర్మమూర్తియు, 1 పద్మము 24 మహాఖర్వముల కాలమునకు పశ్చిమ కేతుమాలవర్ష ఆదివరాహమూర్తియున్ను, 1 పద్మము 11 మహా ఖర్వముల కాలమున యిలావృతవర్ష మేరుపర్వత బ్రహ్మపట్నమునకు ఉత్తరదిగ్భాగంబున ఈశ్వరుండను మృత్యుంజయుండను వీరు ఆదియందు అధిష్ఠాన దేవతలుగా నవతరించిరి జగంబులం గాపాడుచుందురు. దేహావర్జితులుగా శుద్ధజ్యోతిర్మయాకారులుగా అదృశ్యరూపంబుననుండు జగజ్జాలమును జ్ఞాననేత్రముచేత నిరంతము చూచుచు రక్షణచేయు కర్తలుగా నుందురు. ఇంద్రాది సర్వ దేవతలు వీరిని తపోధ్యానజపాదులతో పర్వదినంబుల సేవించుచు నిత్యసంతోషమున నుందురు.

98 మహాఖర్వముల 18 ఖర్వములనాడు ఇంద్రుండు స్వర్గరాజ్యాధిపత్యమున దేవతలకు అధిష్ఠాపురుషుడై త్రిలోకముల సమంబుగ సౌఖ్యభోగంబుల నిచ్చుచుండు.

85 మహాఖర్వముల 21 ఖర్వములనాడు సూర్యునకు బ్రహ్మదేవుండు తాను సృష్టించబోవు చతుర్దశభువనంబులకు ప్రదక్షిణసంచారము చేయు క్రమంబున బ్రహ్మాదులు విధించిరి.

73 మహాఖర్వముల కాలమున బ్రహ్మదేవుండును

శ్లో॥ పంచబ్రహ్మాపరంబ్రహ్మ। పంచరూపంతు మీశ్వరం।
పంచభూతాత్మకో యాశః। పంచవింశతి తత్వతః॥ యీ పంచ
మూర్తులగు బ్రహ్మ విష్ణు ఈశ్వర ఇంద్ర సూర్యాదులే పంచ
బ్రహ్మలని సిద్ధాంతము. మాయాశబలిత మహదహంకారులగు
యీ పంచబ్రహ్మలవలన అనగా సాత్వికాహంకారసంజనిత సర్వ
కర్మకారణాం. తర్వాత సదాశివునియందు హకారతన్మా
త్రంబును.

రాజసాహంకార గుణ సంకలనవృత్తిచేత స్పర్శకారక
మహేశ్వరుని యందు యకార తన్మాత్రంబును.

ప్రచండరాజసాహంకారగుణ సంకలనవృత్తి చేత రౌద్ర
స్వరూప రుద్రునియందు రకారతన్మాత్రంబును.

సాత్వికాహంకారగుణ సంకలనవృత్తిచేత కర్మకారణాం
తర్యాత రసగుణాక తమోమయ విష్ణువునందు వకార
తన్మాత్రంబును, తామసాహంకార గుణసంకలన వృత్తితో
గంధగుణక కర్మకారణాంతర్యాత బ్రహ్మదేవునియందు లకార
తన్మాత్రమున్నూ యీ పంచతన్మాత్రము లుద్భవించి బీజాత్మకమై
పంచభూతోత్పత్తికి కారణములై యుండు.

పంచభూతోత్పత్తి 64 మహాఖర్వాల 47 ఖర్వాలనాడు
పంచతన్మాత్రేభ్యోః పంచమహాభూతాని పంచతన్మాత్రలవలన
అనగా హకైవారాకారంబగు హకార తన్మాత్రవలన శబ్దగుణ
కాకాశంబును యం షట్కోణాకార యకార తన్మాత్రవలన
శబ్దస్పర్శాత్మక వాయుభూతంబును రం ఊర్ధ్వత్రికోణ శబ్ద స్పర్శ
రూపగుణాత్మక రకారతన్మాత్రంబున అగ్నిభూతంబును.

వ అర్ధచంద్రస్వరూప శబ్ద స్పర్శ రూప రస గుణాత్మక వకార తన్మాత్రంబున జలభూతంబును.

ల చతుష్కోణాకార శబ్ద స్పర్శ రూప రస గంధ గుణాత్మక లకార తన్మాత్రంబున భూతంబునూ యీ పంచభూతములు జగదుత్పత్తికి ఆధారంబులయ్యె ఆకాశ వాయు అగ్ని జల భూములు. వీటియందు– ,

పంచభూతాధిపతులు 56 మహాఖర్వముల 69 ఖర్వములకు.

శ్లో॥ పృథ్వ్యాం బ్రహ్మా జలే విష్ణు స్తథా రుద్ర హుతాశనః ఈశ్వరః పవనో దేవః ఆకాశస్య సదాశివః. ఆకాశమునకు సదాశివుండను సూర్యుండును, వాయువునకు ఈశ్వరుండను ఇంద్రుండును, అగ్నికి మహోగ్రస్వరూపుండగు రుద్రుండును, జలమునకు పరమదయాసముద్రుండగు విష్ణుదేవుండునూ, భూమికి సకలచరాచర సృష్టికర్త యగు బ్రహ్మదేవుండును కర్తలై జగత్సృష్టి గావింపనెంచి.

పంచభూత యోజన విశాలములు 49 మహాఖర్వముల 97 ఖర్వములు.

శ్లో॥ పంచమహాభూతేభ్యో ఖిలంజగత్ అను సూత్రము వలన యీ పంచభూతములతోనే సృష్టిజరిగెనని సిద్ధాంతము యెట్లనగా.

శ్లో॥ ఆకాశా ద్వాయుః వాయో రగ్నే రగ్నే రాపః ఆపో భూమ్యాం భూమ్యాంవోషధ్యః ఓషధ్యో రన్నం అన్నాత్పురుషః॥ అను శృతి వాక్యముల ననుసరించి విమర్శించడ

మైనది. యెట్లనగా: యీ శృతివాక్యార్థములే యీగ్రంథాధార మని తెలిసేది.

2500(యిరువై యైదువందల)కోట్ల యోజన విశాలము గల ఆకాశమువలన 200(యిరువైవందల)కోట్ల యోజనముల విశాలమగు వాయుమండలమున్నూ 1200 (పన్నెండువందల) కోట్లయోజనముల విశాలవాయుమండలమున 1500(పదిహేను వందలకోట్ల) యోజనముల విశాలముగల అగ్నిమండలమున్నూ యీ అగ్ని మండలమున 1000కోట్ల యోజనము విశాల జల మండలమున్నూ పదివందలకోట్ల యోజనవిశాలావరణ జల మండలమున 500 (అయిదువందల) కోట్ల విశాలావరణాంబగు భూమండలం జేర్పరచి యీపంచభూతములతో సృష్టిగలిగెను.

శ్లో॥ బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ ఈశ్వరశ్చ సదాశివః। ఏషాంమ్నాయాంధకారశ్చ తదూర్ధ్వే పంచమూర్తయః॥ యీ పంచమూర్తులు సృష్టి పోషణ మారణ భోగ జ్ఞానము లిచ్చుచు యీ యధికారములచేత అధికదూరస్థులై అదృశ్యరూపముల తోనుండి మానవులకు గోచరముగాక అజ్ఞాన తామస అవి వేకములు మానవులకు కప్పుగాగప్పి ఆపైగా వారు సంచ రించుచు అధికారక్రమముల నడపుచుందురు. సూర్యదేవుడు తప్ప యితరులు కనుపించరు.

సృష్టిక్రమము 42 మహాఖర్వములు 14 ఖర్వములకు 14 చతుర్దశభువనమయంబగు బ్రహ్మాండము 14(పదునాల్గు) కోట్ల 56 లక్షల యోజనముల పొడవున్నూ 12 (పన్నెండు)

క్రోట్లు 85 (యెనభైఅయిదు) లక్షల యోజనముల విశాలము గలిగి నీ లోకసృష్టి చేయుటకు.

శ్లో॥ ఆధారం శక్తిరూపంచ అదేహాహాయం సదాశివః శివశక్తి సమ్మాయుక్తం నిర్మితం బహులోకయోః॥ విరాట్శక్తి యను మూలమాయ స్త్రీరూపమున మాతృవుగాను అహంకారమను ఈశ్వరకళ పురుషుడుగాను, తండ్రిగాను ఏర్పడి జీవసృష్టి యేర్పడెనని సర్వవేదముల సిద్ధాంతము. యిట్లు అనంత దేహాస్రష్టులతో జగత్తు కల్పించి జగద్వినోదార్థము సృష్టిచేయ స్థిరపరచిరి. అనగా స్త్రీపురుషుల సమ్మేళన సంగమక్రమమే జన్మకు కారణము. యీ జీవబ్రహ్మకున్నూ సూర్యదేవునకున్నూ ఉదయాస్తమయములు గలవు.

సృష్టుల భేదములు 84 లక్షల 34 మహాఖర్వముల 37 ఖర్వాలకు బ్రహ్మదేవుండు జంబూద్వీపమున భారతవర్షమను భూమియందు సకలజీవోత్పత్తి కారణముగా భూమియందు పర్వతములున్నూ, జలమువలన నదీసముద్రములున్నూ, అగ్నివలన రత్నధాతుపాషాణలోహములున్నూ, భూజలాగ్నివాయువులతో వృక్షములున్నూ, భూజలాగ్ని వాయువాకాశములచేత జీవాదిసృష్టిన్నీ చేయదలంచిరి.

శ్లో॥ స్థావరో వింశతిర్లక్షా జలజో నవలక్షకం। కూర్మ మత్స్యాది నవకం దశలక్షంతు పక్షిణః। పశూనాం వింశతిర్లక్షా చాతుర్లక్షంతు మానవాః। తతో మనుష్యతాం ప్రాప్య తతః కర్మాణి సాధయేత్.

వృక్షాదులు 20 లక్షలు, మృగాదులు 30 లక్షలు, క్రిమికీటకములు 11 లక్షలు, పశువులు 10 లక్షలు, పక్షులు 10 లక్షలు, కూర్మకర్కటమత్స్యాదులు 9 లక్షలు, మానవులు 4 లక్షలు, జీవజంతువులు మొత్తం 84 లక్షల జీవుల సృష్టికి ప్రారంభించి–

ఈశ్వరుండు శక్తివిద్యాపరీక్ష

1 పద్మము 35 మహాఖర్వములనాటి కాలమున ఈశ్వరుండు విరాట్శక్తి యిచ్చి విద్యలను పరిశీలన చేయ దలంచి బ్రహ్మాండము నాక్రమించి అగ్నిమండలాధీశ్వరుడై విజృంభించి భూనభోంతరంబులు నిండి ప్రబలాట్టహాసుండై యుండగా బ్రహ్మ విష్ణువులు నివారింపలేక నిర్విణ్ణులై చూచుచు నివారింపలేక యుండగా ఆదిమధ్యాంతములు శోధించి చూడుడని గంభీరవాక్కు వినపడగా యీ యాజ్ఞ దప్పక విష్ణుదేవుండు నాభినుండి పాదములవరకు శోధించి రావలెనను యత్నమున ఆదివరాహరూపము ధరించి దంతములలో కుళ్లగించుచు అతలవితలములవరకైనను పోలేక తిరిగి వచ్చి నాభిస్థానమగు భూలోకము చేరియుండె. తదుపరి–

బ్రహ్మదేవుండు హంసవాహనారూఢుండై గగనసంచారగమనమున భూలోక – భువర్లోక – సువర్లోక – మహర్లోకము వరకు పోవుచుండగా భీతిజెంది నిరీక్షించుచుండగా యెంతో కాలమునుండి క్రిందికి దిగజారుచున్న మొగలిపువ్వమును చూచి యెచ్చటనుండి వచ్చుచున్నావని యడుగగా, నేను అంతులేని కాలమునుండి క్రిందికి దిగుచుంటిని. భూస్థానమైనా

కనుపించలేదు. నీవు ఈశ్వర జటాజూటమును చూడలేవు అనిచెప్పగా బ్రహ్మదేవుండు మొగలిపుష్పముతో బయలు దేరి భూమండలమునకు తిరిగి వచ్చుచూ మొగలిపుష్పమును బ్రహ్మదేవుండు ఈశ్వర జటాజూటము చూచినాడని సాక్ష్యము చెప్పుమని సాహాయ్యముకోరగా అట్లేనని వాగ్దత్తమిచ్చెను. యిట్లు వచ్చుచుండగా కామధేనువునున్నూ వాగ్దత్తముకోరగా అట్లేనని వాగ్దత్తమిచ్చి భూస్థానమునకు వచ్చిచేరిరి. తర్వాత ఈశ్వరుని శాంతిపరుప నెవ్వరికి సాధ్యపడకపోగా బ్రహ్మ విష్ణువులను దిశాంతములకు వెళ్లబంపి విరాట్శక్తి మాయాబల వివేకములతో భూమండలమధ్యభాగంబగు కటిప్రదేశమున శీతాకారముగా నావరించి గాఢాలింగనము చేయుగా ఈశ్వర విజృంభణ శాంతిపడి లింగాకారరూపంబున నుండె. పురుషులకు యవ్వనవయసు రాగా ఈశ్వరుని అహంకారము యుద్రేకించు సమయమున ఒక స్త్రీని దెచ్చియిచ్చి తోడుచేయగా ఆకులలో పిందెవలె అణగియుండుట లోకాచారానుభవము.

## కామధేనువును, మొగలిపుష్పమును శపించుట

ఇట్లు ఈశ్వరుండు విజృంభణ శాంతించి మొగలి పుష్పము బ్రహ్మదేవుడు ఈశ్వరజటాజూటమును చూచివచ్చి నాడని తప్పుసాక్ష్యము చెప్పుటచేత దేవతాపూజార్హత లేకుండి స్త్రీలు ధరించుటన్నున్నూ, తెల్లవారికి మెనుపేడవలె దుర్గంధ మగుగాక యని శపించె. కామధేనువు నోట అబద్ధము బలుకుచు తోకతో లేదని సౌజ్ఞచేయుటచేత ఉదయము నిదురలేచిన మానవుడు గోవుముఖదర్శనమున కీడుగలుగునట్లునున్నూ, తోక

సత్యమని సాక్షవేయుటచే లోకచూచిన పుణ్యమని శివరహస్య ఖండమునందు గలదు.

## బ్రహ్మదేవునకు ప్రాయశ్చిత్తము

29 మహాఖర్వముల 18 ఖర్వములకు బ్రహ్మదేవుండు అబద్ధము చెప్పించినందుకు భైరవేశ్వరుని చేతి ఖట్వాంగమువలన బ్రహ్మదేవుని పశ్చిమశిరోభిన్నము చేయగా ఆ శిరము యెగిరి ప్రస్తుతము వర్తమానమున బ్రహ్మకపాలము అనుచోటు పడగా అచట కర్మపిండములు వేయుట లోకప్రసిద్ధము. ప్రస్తుతము బ్రహ్మదేవునకు చతుర్ముఖములనియు చతుర్వేదములనియు ప్రణవవేదమగు అధ్యాత్మవిద్యాఘట్టము త్రోసివేసి జగత్తు వృద్ధి కొరకు కామభోగప్రధానముగా చతుర్వేదములే వ్యాసమహర్షి సిద్ధాంతము.

## విష్ణుమూర్తి ప్రభావము

24 మహాఖర్వములకు విరాట్శక్తి యిచ్చిన విద్యా ప్రభావముచేత యుగయుగంబులకు జగదుద్ధారణ కార్యకలాపంబులు నెరవేర్చుటయు ప్రళయమున మత్స్యావతారమెత్తి వైవస్వతు నుద్ధరించుటయు కూర్మరూపంబున మందరగిరి ధరించి పాలకడలియందు దేవతల కమృతప్రాప్తి గలిగించుటయు, వరాహరూపముధరించి 5 లోకముల క్రిందట రసాతలమున స్థిరమైయున్న భూమిని తన దంష్ట్రములచేత నెత్తి 8-వ లోకముగా 500 (అయిదువందల) కోట్ల యోజనవిస్తీర్ణాయామంబగు ప్రస్తుతము భూలోకమువున్నచోటు భూమిని నిల్పి

స్థిరపరచుటయు, నారసింహరూపమున హిరణ్యకశిపుని వధించి తన విక్రమంబు చూపి జగముల భయభీతులంజేసి భక్తరక్షణ దుష్టశిక్షణ చేయుటయు, వామనావతారమున బలివలన దానముగొని ఇంద్రునకు స్వర్గరాజ్యం బిచ్చుటయు, పరశు రాముడై 21 మార్లు రాజకంఠచ్ఛేదములు చేయుటయు, శ్రీరాముడై పితృవాక్యపరిపాలనంబును వనవాసదుఃఖాను భవమున్నా రావణుని సంహరించి విజయము పొందు టయు బలరాముడై హలాయుధము ధరించి అనేక సాహసకార్యములు చేయుటయు బౌద్ధావతారమున శ్రీజగన్నాథుడై యుండుటయు కలియుగాంత్యమున జగన్మోహినీ యవతారమెత్తుటయు యుగయుగంబునకు లోకసాహ్యము కొరకు 34 అవతారము లెత్తుటయు విష్ణుదేవునకు విరాట్శక్తి వలన దత్తమైయుండె. యిట్టి ప్రభావములున్నా మాయా మోహిని విద్య స్వాధీనమున్నా జగంబుల మోహింపచేయు టయు పోషణ రక్షణలున్నా విష్ణుదేవుని అధికారకర్తవ్యములు. జలనిధిమధ్యమున శేషశాయియై సంకల్పరూపంబున జగత్పో షణరక్షణకృత్యములు కల్పించుచు నిరంతర తపస్సమాధి నిష్ఠుండై యోగనిద్రామయుండై యుండు.

## విష్ణుమూర్తి దశావతారములు

18 మహాఖర్వములు 82 ఖర్వములకు.

శ్లో॥ మత్స్యకూర్మవరాహశ్చ నారసింహశ్చ వామనః। రామోరామశ్చ రామశ్చ బౌద్ధః కలికి రిత్యపి॥ యని సూత్ర

మున్నూ గలదు. వర్తమానమున 28 యుగములకున్నూ 28 యవతారము లెత్తుచున్నట్లు పురాణసిద్ధాంతములు.

## బ్రహ్మావతారములు

13 మహాఖర్వములు 63 ఖర్వములకు తొల్లి యుగంబులందు సృష్టికి ప్రారంభముగా విరాట్శక్తివలన బ్రహ్మదేవుం డవతరించి విరాట్శక్తివల్లనే హరింపబడియె. మరల ఈశ్వరునివలన జన్మోద్ధారకుడై యీ త్రిమూర్తులు మాయా తను రహిత నిర్మలజ్యోతిస్వరూపులై యుండిరి. మరియు విరాట్శక్తివలన గ్రహించిన మాయామోహినీ విద్యవలన మహాప్రభావంబున నుండగా ఈశ్వరుడు విష్ణు మాయాబలంబును పరీక్షచేయదలంచి బలవంతపరచగా విష్ణువు నీవారూపము చూచి జయించలేవని చెప్పగా మూర్ఖించి ప్రోత్సహించగా అప్పుడు విరాట్శక్తి యిచ్చిన మహామోహినీ విద్యాబలమున అమోఘమాయామోహినీ విద్యవలన మోహనీరూపము ధరించగా ఈశ్వరుండు చూచి భ్రమించి మనోవిహ్వలుడై మోహించి కలిసి సంగమించగా గర్భమున వీర్యము పడగా యీ వీర్యమువలన దండిపురుషుడు జన్మించి జగంబుల సృష్టిగావించునని దీవించి ఈశ్వరుండు వెళ్లిపోగా అంతట విష్ణుదేవుండు మోహినీరూపంబు విడచినను విష్ణు నాభికమలమందు ఒక కమలనాళము జనించి ఆ నాళమున సహస్రదళపద్మము జనించి ఆ పద్మమునందు పంచముఖంబులతో బ్రహ్మదేవు డుదయించె. అందువలన పద్మజబ్రహ్మయని ప్రసిద్ధి.

బ్రహ్మదేవుండు నవసర్గసృష్టివివరము 193 కోట్ల సం॥ నాడు బ్రహ్మదేవుండు సృష్టివిషయ వివరణ మెట్లనగా: అకారాద్యక్షరబీజవర్ణాధ్వము 1న్నీ, ముప్పదిరెండువిద్యల పదాధ్వమున్నూ 2, అరువదినాల్గు విద్యల కళాధ్వమున్నూ 3, సప్తకోటి మహామంత్ర బీజమంత్రాధ్వమున్నూ, 4, బ్రహ్మాది జన్మోద్భవభువనాధ్వమున్నూ 5, అధ్యాత్మ మోక్షవిద్యా శాంతి కళాధ్వమున్నూ 6, యీషడధ్వములలో భువనాధ్వసంభూత నవసర్గసృష్టియెట్లనగా, మహత్సర్గము 1, భూతసర్గము 2, త్వగాదీంద్రియ సర్గము 3, స్థావరసర్గము 4, మానవసర్గము 5, దేవతా సర్గము 6, తిర్యక్సర్గము 7, వాక్యర్గము 8, కౌమారసర్గము 9. యీ నవసర్గములు. త్రిలోక సప్తద్వీప చతుర్దశభువనములుగా సృష్టిగావించు శక్తి విరాట్శక్తివలన గ్రహించిరి. యీ మానవాది జీవులు విష్ణుమాయాస్వరూప యోని స్పర్శచే జనించుటచేత మానవులకు పూర్వజ్ఞానము నిలువలేదు. దేవతా జన్మలకు మాయాతనువులు లేనందున జ్ఞానము నశించదు. మానవులు అజ్ఞానమాయకు లొంగి లోబడుదురు. దేవతలు మాయను తిరస్కరింతురు. ఆ శక్తి మానవులకు లేదని వేద ప్రమాణములు గలవు. పూర్వజన్మపుణ్యమువలన కొందరికి ఆ శక్తి కలుగును.

విరాట్పురుషుని వలన త్రిమూర్తులు 8 మహాఖర్వముల
45 ఖర్వములకు విద్యాధికారము పొందుట.

ఆదివిరాడ్బ్రహ్మ పంచముఖములయందు పంచబ్రహ్మలకు ఆజ్ఞయిచ్చుట యెట్లనగా: విరాట్పురుషునకు తూర్పు

దిశను సద్యోజాతముఖంబును, దక్షిణదిశ వామదేవముఖంబును, పశ్చిమదిశ అఘోరముఖంబును, ఉత్తరమున తత్పురుష ముఖంబును, ఊర్ధ్వమున ఈశాన్యముఖంబును గల విరాట్పురుషుడు పంచబ్రహ్మలకు ఖండపరిపాలనా విధానంబును దయాసముద్రుడై బోధించుట యెట్లనగా:

## ఈశ్వరునకు బోధించుట

ఆదివిరాట్పురుషుని తూర్పుదిశ సద్యోజాతముఖము వలన యీశ్వరునకు బోధించుట యెట్లనగా. భరతఖండమున శతకోటియోజనములు భూమండలపరిపాలనమున్నూ శంఖ సంవత్సరములు యేలునట్లు ఏకవింశత్యధర్వవేద రహస్యములున్నూ గాయిత్రీఛందస్సును త్రివృత్తులు రథంతరసామము యజ్ఞములు ఆప్తోర్యామము అనుష్టుప్ ఛందస్సును వైరాజము ఋగ్వేదపారాయణములున్నూ ఉపాసనలు రుద్రరూపమును శక్తిచేత సర్వాశ్రమస్తులకు సృష్టిపాలనమున్నూ ఉద్భవశిశువులకు నాభినాళచ్ఛేదమున్నూ ధర్మార్థకామ్యమోక్షములను చతుర్విధ పురుషార్థపద్ధతులున్నూ సిద్ధిక్రమములున్నూ నాగటికర్రు దండములు నరుకుకత్తిన్నీ నూలువడుకు కదురున్నూ సర్వవస్తువులు, తూచెడుత్రాసున్ను, ధాన్యములు కొలుచు కుంచమున్ను, యంత్రములు లిపులువ్రాయు గంటమున్నూ, యీ 6 యీయారింటితో లోకరక్షణక్రమములు నడుపుట యున్నూ విరాడ్బ్రహ్మవలన ఈశ్వరునకు ఆజ్ఞగల్గెను.

విష్ణువునకు ఆజ్ఞయిచ్చుట

విరాడ్బ్రహ్మ దక్షిణ వామదేవ ముఖమువలన మయ బ్రహ్మ యను విష్ణువుకు ఆజ్ఞఇవ్వబడిన దేమనగా: ఇంద్రచరు ఖండములయందు శతకోటియోజనములు భూమండలపరిపాలన మును శంఖసంవత్సరము లధికారమున్నూ యజుర్వేద పారాయణమున్ను తత్సంబంధకర్మకృత్యములున్నూ హవిస్సు త్రిష్టుప్ చందస్సును పంచదశస్తోమము బృహత్సామము సకల జీవులప్రాణరక్షణలున్నూ దేవతానుకూల సామగ్రులున్నూ అమర్చుటకు విరాట్పురుషునివలన ఆజ్ఞ గల్గెను.

బ్రహ్మదేవున కాజ్ఞయిచ్చుట

విరాట్పురుషుని పశ్చిమ అఘోరముఖమువలన బ్రహ్మ దేవునకు ఆజ్ఞఇచ్చుట యెట్లనగా: గభస్తి నాగఖండములు శతకోటి యోజనములు భూమండలపరిపాలనమున్నూ శంఖ సంవత్సరములు వుద్యోగమున్నూ సామవేదసర్వస్వమున్నూ తథాచారకృత్యములున్నూ జగతీఛందంబును సప్తదశస్తోమ మున్నూ వైరూపమున్నూ తామ్రమసృష్టియు గరువెత్తి రూపము లేర్పరచుటయు మణ్మూతస్థాపనలు విగ్రహారాధనలు యాగ శాలలు కలశావాహనములు ధూపాది యుపకరణములు సర్వ వస్తువులు చేయించుచుండుటకు విరాట్పురుషుడు బ్రహ్మదేవున కాజ్ఞఇచ్చెను.

ఇంద్రున కాజ్ఞఇచ్చుట

విరాట్పురుషుని ఉత్తర తత్పురుషముఖమువలన ఇంద్రున కాజ్ఞఇచ్చినదేమనగా: తామ్రవారుణిఖండముల నివాసం

బును శతకోటియోజనముల విశాలభూమి పరిపాలనమున్నూ శంఖసంవత్సరములధికారమున్నూ ఏకవింశత్యధర్వణములున్నూ ఆప్తోర్యామంబును అనుష్టుప్ ఛందస్సును వైరాజము అధర్వణ వేదపారాయణమున్నూ 32 శిల్పవిద్యలున్నూ షణ్మతస్థాపనలు స్థాపని మొదలగు శతకోటి దేవతాస్థాపనలు నిర్మితోద్ధార ములు వేదమంత్రోచ్చారణలు బీజావాపనములు అష్టాద క్రియలు నూతననిర్మాణములు మోక్షోర్థము బ్రహ్మజ్ఞాన బోధలు షట్కర్మవిధులు యమనియమాది అష్టాంగయోగ ములు సమాధినిష్ఠాక్రమంబులు సాంప్రదాయక అద్వైతనిష్ఠలు సాంఖ్య తారక అమనస్కవిధులు పరమాత్మయందు చేరు మార్గోపదేశ స్థపతి యాచార్యులుగా నుండుట సమస్త మంత్రాంశమువలన సర్వాధార దేవతలను 18 కులములవారు ఆరాధించి మోక్షమును పొందునట్లు చేయుమని ఇంద్రున కాజ్ఞగలైను.

## సూర్యదేవున కాజ్ఞయిచ్చుట

విరాట్పురుషుని ఊర్ధ్వఈశాన్యముఖమువలన విశ్వజ్ఞ బ్రహ్మ యను సూర్యనారాయణకు ఆజ్ఞయిచ్చిన దేమనగా: సౌమ్యగంధర్వ ఖండములయందు శతకోటి యోజనముల విస్తీర్ణక్షేత్రమున్నూ అందు శంఖసంవత్సరము లధికార మున్నూ కలిగి స్నానసంధ్యాది షట్కర్మాచరణలున్నూ, యమనియమాది అష్టాంగయోగములున్నూ, వేదపారాయణ లున్నూ, పంచవేదములున్నూ, 1180 వేదాంతోపనిషత్తు లున్నూ, 28 ఆగమములున్నూ, తంత్రములున్నూ,

లోకప్రజలకు వివాహోపనయనములున్నూ, తన్నిమిత్తశుభ కార్యములకు త్రయస్త్రింశత్కోటి దేవతలకున్నూ, సర్వవర్ణాశ్రమస్థులకున్నూ, ప్రకాశవంతమగు స్వర్ణరత్నాభరణములున్నూ, సృష్టిచేయుటకు 18 వర్ణములవారికి కులాచారంబులంబట్టి వివాహములకు లోబడి కట్టుబాట్లుగల వర్ణాశ్రమస్థులలో దుర్మార్గస్త్రీలవలన ఉత్పత్తికాబడిన అతిలోమ ప్రతిలోమ అంతరాళ కరణ కుండ గోళక మొదలగు వర్ణబీజ నిషిద్ధములు లేకుండా కులపుత్రులంజేయు మాంగల్యముద్రలు చేయించుచుండుమని యాజ్ఞపొంది సమస్తకృత్యములు చేయించుచుండునట్లు విరాట్పురుషుని వలన సదాశివుండును సూర్యదేవుం డాజ్ఞపొంది యిట్లు యీశిష్టములు పంచమూర్తులు గ్రహించినవారైరి.

## వేదాదివిద్యలు

శ్లో॥ లక్షంతు చతురోవేదాః ద్విలక్షం సూపశాస్త్రకం। షోడశం మాలినీశాస్త్రం ద్వాత్రింశం భరతముచ్యతే। అర్బుదం శిల్పశాస్త్రంతు। ఆగమంతు చతుర్దశ। ఆయుర్వేదే త్రిలక్షంతు। చాతుర్లక్షంతు జ్యోతిషం॥ యీసూత్రక్రమంబున ఋగ్వేదం లక్షసూత్రములు యజుర్వేదము లక్షసూత్రములు, సామవేదం లక్షసూత్రములు, అధర్వణవేదం లక్షసూత్రములు, సూపశాస్త్రం 2 లక్షల సూత్రములు, మాలినీశాస్త్రం 6 లక్షల సూత్రములు, భరతశాస్త్రం 32 లక్షల సూత్రములు, శిల్పశాస్త్రం అర్బుదసూత్రములు, ఆగమశాస్త్రం 14 లక్షల సూత్రములు, ఆయుర్వేదం 3 లక్షల

సూత్రములు జ్యోతిషం 4 లక్షల సూత్రములు విరాడ్బ్రహ్మ వలన వేదశాస్త్రాది సూత్రములు పంచబ్రహ్మలకు వాగ్రూప దత్తంబైయ్యుండె.

## యిరువదియెనిమిది ఆగమములు విమర్శ

విరాట్పురుషుని పంచముఖములయందును అనగా ఈశాన్యముఖమున :- కామికము, యోగజము, చింత్యము, కారణము, అజితము, దీప్తము, సూక్ష్మము, జగతి – యీ యెనిమిది అగమములున్నూ.

ఉత్తరతత్పురుషముఖమున సుప్రభేదము, విజయము, విశ్వాసము, స్వాయంభువము, అనలము యీ అయిదున్నూ

పశ్చిమఅఘోరముఖమున, వీరము, రౌరవము, మకుటము, విమలము, చంద్రజ్ఞానము, యీ అయిదున్నూ

దక్షిణవామదేవముఖమున బింబము, ప్రోద్గీథము లలితము, సంతానకము, స్వారోత్తమను యీ అయిదున్నూ

తూర్పుసద్యోజాతముఖమున, పారమేశ్వరము, కిరణము, భేదము, వాతూలము, కారణము యీ అయిదున్నూ కలిశి 28 ఆగమములు విరాట్పురుషునివలన పంచబ్రహ్మల కుపదేశింపబడినవి.

## షట్శాస్త్రములు

శ్లో॥ శిక్షావ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః॥ శిక్ష యను సాముగరిడీశాస్త్రము పాండిత్యము గలిగించు వ్యాకరణ

శాస్త్రము కవిత్వఛందోలక్షణశాస్త్రము, నిరుక్తశాస్త్రము, హేమ్యకాలము నెరిగించు జ్యోతిషము సృష్టినెరిగించు కల్పశాస్త్రమున్నూ యీ 6 శాస్త్రములున్నూ విరాట్పురుషుడు పంచమూర్తులకు బోధించె.

## ఉపనిషత్తులు — అందు అధ్యాత్మవేదోపనిషత్తులు

ఋగ్వేదోపనిషత్తులు 10 న్నీ, శుక్లయజుర్వేదోపనిషత్తులు 19 న్నీ, కృష్ణయజుర్వేదోపనిషత్తులు 32 న్నూ, సామవేదోపనిషత్తులు 10 న్నీ, అథర్వణవేదోపనిషత్తులు 31 న్నీ, ఇవి అధ్యాత్మవేదోపనిషత్తులు — ఇవి ముఖ్యమైనవి. వాటి వివరమెట్లనగా:

## ఋగ్వేదోపనిషత్తుల వివరము

ఐతరేయోపనిషత్తు, కౌషీతకోపనిషత్తు, నాదబిందూపనిషత్తు, ఆత్మబోధోపనిషత్తు, నిర్వాణోపనిషత్తు, ముద్గలోపనిషత్తు, మాలికోపనిషత్తు, త్రిపురాసారోపనిషత్తు, సౌభాగ్యోపనిషత్తు, బహ్వృచోపనిషత్తు, యీ 10 న్నీ ఋగ్వేదోపనిషత్తులు, అధ్యాత్మోపనిషత్తులు — బోధకు ముఖ్యమైనవి.

## శుక్లయజుర్వేదోపనిషత్తులు

ఈశావాస్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు, జాబాలికోపనిషత్తు, హంసకోపనిషత్తు, సుమంత్రికోపనిషత్తు, పరమహంసోపనిషత్తు, నిరాలంబోపనిషత్తు, త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్తు, మండలబ్రాహ్మణోపనిషత్తు, అద్వయోపనిషత్తు, తారకోపనిషత్తు, పైంగలోపనిషత్తు, భిక్షుకోపనిషత్తు,

తురీయాతీతోపనిషత్తు, అధ్యాత్మోపనిషత్తు, తారాసారోపనిషత్తు, యాజ్ఞవల్క్యోపనిషత్తు, శాట్యాయనోపనిషత్తు, ముక్తికోపనిషత్తు యీ 19 న్నీ శుక్లయజుర్వేదమందు ముఖ్యోపనిషత్తులు.

## కృష్ణయజుర్వేదోపనిషత్తులు

తైత్తిరీయోపనిషత్తు, బ్రహ్మకైవల్యోపనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు, గర్భనారాయణోపనిషత్తు. బిందూపనిషత్తు, అమృతోపనిషత్తు, నాదోపనిషత్తు, కాలాంగోపనిషత్తు, రుద్రోపనిషత్తు, క్షురికోపనిషత్తు, సర్వసారోపనిషత్తు, యశోబిందూపనిషత్తు, ధ్యానబిందూపనిషత్తు, బ్రహ్మవిద్యోపనిషత్తు, యోగతత్త్వోపనిషత్తు, ఏకాక్షరోపనిషత్తు, అక్ష్యోపనిషత్తు, అవధూతకోపనిషత్తు, యోగకుండలినోపనిషత్తు, పంచబ్రహ్మోపనిషత్తు, ప్రాణోపనిషత్తు, అగ్నిహోత్రోపనిషత్తు, సారస్వతోపనిషత్తు, రహస్యోపనిషత్తు యీ 32 న్నూ కృష్ణయజుర్వేదమందు ముఖ్యములు.

## సామవేదోపనిషత్తులు

త్రాయణోపనిషత్తు, మైత్రేయోపనిషత్తు, వజ్రసూచికోపనిషత్తు, చూడామణికోపనిషత్తు, వాసుదేవకోపనిషత్తు, మహోపనిషత్తు, సన్న్యాసోపనిషత్తు, అవ్యక్తోపనిషత్తు, కుండికోపనిషత్తు, దర్శనోపనిషత్తు, జాబాలికోపనిషత్తు యీ 11 న్నూ సామవేదమున ముఖ్యములు – బోధనావసరములు.

## అధర్వణ వేదోపనిషత్తులు

ప్రశ్నకోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు, అధర్వశిఖోపనిషత్తు, అధర్వణశిరోపనిషత్తు, బృహజ్జాబాలికోపనిషత్తు, నృశింహ తాపినికోపనిషత్తు, నారదోపనిషత్తు, పరివ్రాజకోపనిషత్తు, శీతోపనిషత్తు, శరభోపనిషత్తు, మహానారాయణోపనిషత్తు, రామరహస్యోపనిషత్తు, రామతాపినికోపనిషత్తు, శాండిల్యోపనిషత్తు, పరమహంసోపనిషత్తు, అన్నపూర్ణోపనిషత్తు, సూర్యోపనిషత్తు, ఆత్మబోధోపనిషత్తు, పాశుపతోపనిషత్తు, పరబ్రహ్మోపనిషత్తు, త్రిపురాతాడనోపనిషత్తు, దేవీభావనోపనిషత్తు, భస్మజాబాలకోపనిషత్తు, గణపత్యోపనిషత్తు, మహావాక్యోపనిషత్తు, గోపాలతాపినికోపనిషత్తు, కృష్ణోపనిషత్తు, హయగ్రీవోపనిషత్తు, దత్తాత్రేయోపనిషత్తు, గారుడోపనిషత్తు యీ 31 న్నీ అధర్వణ వేదమందు ముఖ్యమగు బోధోపనిషత్తులు.

మాండూక్యోపనిషత్తు గురుముఖమున చదివినవాడు తడలేని మోక్షము పొందునని శ్రీరాము డాంజనేయునకు బోధించెను. యీ యుపనిషత్తులన్నియు దేహాజీవతత్వములను దెలిసి మోక్షమును పొందుమార్గమును బోధించును. సాత్వికపురుషులగు భక్తులు, తత్వవేత్తలు యీమార్గము వెదకుదురు గాని పూర్వజన్మసుకృతమునగాని లభింపదు. ప్రారబ్ధకర్మబద్ధులకు సంసారమే స్వర్గము. తామసరాజసగుణ ప్రవర్తనులగుటచేత నిజమోక్షము నందలేరు.

## 32 విద్యలు

శ్లో॥ అంగాని వేదాశ్చత్వారః మీమాంసా న్యాయ విస్తరః। పురాణం ధర్మశాస్త్రంచ। విద్యాహ్యేతాచ్చతుర్దశా। ఆయుర్వేదో। ధనుర్వేదో। నితిశాస్త్రార్థశాస్త్రయోః వేదాం గంచచతేదానీం। దద్యాహ్యష్టాదశా ఇమే॥ ఋగ్వేద - యజుర్వేద- సామవేద అథర్వణవేదములు- 4-శిక్ష, వ్యాకరణము, చందశ్శాస్త్రము, నిరుక్తము, జ్యోతిషము, కల్పశాస్త్రము యీ 6శాస్త్రములును ధర్మశాస్త్రము, ధనుర్వేదము, ఆయుర్వేదము, న్యాయశాస్త్రము యీ 4న్నూ పురాణములు 18న్ని కలిసి 32 విద్యలని ప్రమాణములు గలవు. యివి యన్నియు విరాడ్బ్రహ్మదత్తములని తెలిశేది.

## 18 పురాణములు

శ్లో॥ బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ। శైవం భాగవతం తథా తథాన్యం నారదీయంచ। మార్కండేయంచ సత్తమం ఆగ్నేయ మష్టమంచైవ। భవిష్యన్నవమం స్మృతం దశమం బ్రహ్మకైవర్తం, లైంగ మేకాదశం స్మృతం। వారాహం ద్వాదశంచైవా స్కాందంచాత్ర త్రయోదశ చతుర్దశం। వామనంచ కౌర్మం పంచదశస్తథా మాత్స్యం। గారుండంచైవా బ్రహ్మాండంచ తతఃపరం॥ దేవతలవలన ఋషులవల్లను రచింపబడినవి. ధర్మాధర్మమార్గములను దెలిపి వివేకవంతులం జేయును. పంచబ్రహ్మాల మహాత్వములున్నూ దెలియును.

## 64 విద్యలు

శ్లో॥ ఇతిహాసాగమం చైవా కావ్యాలంకార నాటకం।
గాయత్వంచ కవిత్వంచ కామశాస్త్రం దురోదరం। దేశభాషాలిపి జ్ఞానం లిపికర్మచ వాకచం। సర్వాణిచావధానాని సర్వశాస్త్రంచ శాకునం। సాముద్రికం రత్నశాస్త్రం రథాశ్వగజకౌశలం మల్లశాస్త్రం। సూదకర్మం భూరుహాణాంచ దోహదం గంధవాదా ధాతువాదా ఖనివాదో రసస్యచ జాలవాదోగ్నిసంస్తంభో। ఖడ్గస్తంభో జలస్యచ వాచస్తంభో మరుస్తంభో వశ్యాకర్షణ మోహనం। విద్వేషణోచ్చాటనంచ మారణం కాలవంచనం। పరకాయప్రవేశశ్చ పాదుకాసిద్ధిరేవచ। వాక్సిద్ధిఘుటికాసిద్ధిరైంద్ర జాలిక మేవచ। అంజనం పరద్రుష్టేస్తు వంచనం స్వరంవంచనం మణిమంత్రౌషధాదీనాం శిద్ధయా శ్చోరకర్మచ చిత్రలోహాశ్మ మృద్దారు వేణు చర్మాంబరక్రియాః। అదృశ్యకరణాదండం కరణాం మృగయావిధిః। వాణిజ్యం పాశుపాల్యంచ కృషీరాసవకర్మచ లావకకుక్కుటమేషాది యుద్ధకారక కౌశలం చతుష్షష్టికళాస్త్వేతో కళావిద్భి ప్రకీర్తితాః॥ యీ 64 విద్యాకళలు ప్రపంచమానవు లకు జీవనవృత్తులుగా నుండును. యీవృత్తులు చేయక భుక్తి ముక్తులు జరుగవు. అందరు విమర్శించబోరు. బుద్ధిమంతులు విమర్శ చేసుకోగలరు. గ్రంథవిస్తరభయమున అర్థము వ్రాయ లేదు.

### ఖండప్రమాణ నిర్ణయం

శ్లో॥ ముష్టిర్ముష్టి భవేహస్తం హస్తంచత్వారికో ధనుః।
త్రిసహస్రం ధనుక్రోశం క్రోశం చత్వారియోజనం సహస్రయో

జనం దేశం। దేశంచత్వారిమండలం సహస్రమండలం ఖండం నవ ఖండం తు మేదినీ ॥ ఆరు పిడికెళ్లో హస్తం, 4 హస్తము లొక ధనస్సు 3000 (మూడు వేల)ధనస్సు లొక క్రోశము, 4 క్రోశము లొక యోజనము. యిదే ఆమడయందురు. కొన్ని దేశములలో 6 క్రోశములు ఆమడయందురు. 1000(వెయ్యి) యోజనము లొక దేశము. 4 దేశము లొక మండలము. వెయ్యిమండలములు ఒకఖండము 9 ఖండము లొక మేదిని యని విశ్వకర్మ సిద్ధాంతము.

నవఖండములు :— దేవతలకు 5 మహాఖర్వముల 86 ఖర్వములకు భూమండలమున భరతఖండమును, ఇంద్రఖండ మును చరుఖండమును గభస్తిఖండమును నాగఖండమును తామ్రఖండమును వారుణిఖండమున్నూ సౌమ్యఖండమున్నూ గంధర్వఖండమున్నూ యీ నవఖండములయందు పంచమూర్తులు నివాసములుగానుండి పరిపాలన జరుపుచుందురు.

## జీవాది సృష్టిభంగము

బ్రహ్మదేవుండు జంబూద్వీపాదిగా సప్తద్వీపములును నవఖండములును యేర్పరచి జంబూద్వీపమునందు భూమి యందు పర్వతములను జలమువలన నదీసముద్రములున్నూ అగ్ని వలన నవరత్న ధాతు పాషాణ లోహములున్నూ వాయువు వలన వృక్షాదులున్ను ఆకాశాదిపంచభూతములచే జీవసృష్టిన్నీ చేయదలంచె. యెట్లనగా బ్రహ్మదేవుండు ప్రథమంబున సృష్టికి ప్రారంభించి —

మూఢజన సృష్టి 3 మహాఖర్వముల 27 ఖర్వాలకు సృష్టి కాబడు జీవులకు సకలపదార్థలోపంబు గాకుండునట్లు ఆలోచించి జీవసృష్టికి ప్రారంభించి పంచభూతభాగములను చేర్చుటలో శ్రద్ధ లేక పరీక్షార్థముగా అప్పటికి వూహాదోచినవరకు భూతభాగ ములు చేర్చగా ఆసృష్టిలో యేర్పడిన జీవులు, ముగ్ధులు, మూఢులు, చపలులు, చంచలులు, క్రూరబుద్ధులు, ఉగ్రకోపి ష్ఠులు,తిరుగుబోతులు తిండిపోతులు, శుద్ధమూఢులుగా జనించి నందున చూచుచుండగా వకరికి వకరికి సంబంధములేక కొందరు పరుల బెదరించుట తిరస్కరించుట దండించుట కలహములాడుట ఇత్యాది నిష్ప్రయోజకులనుచూచి మార్పుచేయదలంచి.

జీవాది 84 లక్షల జీవులసృష్టి 195కోట్ల సం॥నాడు.

శ్లో॥ స్థావరో వింశతిర్లక్షా జలజో నవలక్షకం కూర్మ మత్స్యాది నవకం దశలక్షంతు పక్షిణః। పశూనాం వింశతిర్లక్షా చాతుర్లక్షంతు మానవాః। తతోమనుష్యతాం ప్రాప్య తతః కర్మాణి సాధయేత్ । ఏతేషు భ్రమణంకృత్వా ద్విజత్వముపజా యతే। సర్వయోనిం పరిత్యజ్య బ్రహ్మయోనిం తతోభ్యగాత్॥ అను సూత్రప్రమాణవచనమువలన యిట్లు నిర్ణయము దెలియు చున్నది. యెట్లనగా.

84 లక్షల జీవుల వివరము. 194 కోట్ల సం. నాడు.

వృక్షములు 20 లక్షలు, మృగాదులు 30 లక్షలు, క్రిమి కీటకములు 11 లక్షలు, పశువులు 10లక్షలు, పక్షులు 10లక్షలు, కూర్మ మకర కర్కట మత్స్యాదులు 9 లక్షలు, మానవులు

4 లక్షలు జీవులుగా విభజించె. మరియు కొందరి నడవిమను ష్యులుగాను, నదీసముద్రములలో నీటిసాపలు తూగలనియు నీటిమనుష్యులుగా నుందురట. పసిబిడ్డలు యేడ్చినట్లు యేడ్చు నట. యివి వ్రాదితే మనుష్యులకు కండ్లుపోవునట. పట్టుపట్లా వాండ్లు ఇవి వలలోబడినప్పుడు పసుపుకుంకుమలతో పూజించి సముద్రమున విడిచిన వాళ్ళకు మేలుగలుగునట. వాటినిచంపిన కీడుగల్గునట.

## వృక్షోత్పత్తి

శ్లో॥ పృథ్వీ సహస్రాంశయో రోషధీవనస్పతయః అను సూత్రమువలన విచారించగా (500)అయిదువందలకోట్ల యోజన విశాలావరణ భూమండలప్రాంతమున 25 లక్షల యోజన ములు అరణ్యపర్వతస్థానములుగాను, జలప్రాంతముగాను స్థానము లేర్పరచి ఆ స్థానమునందు 20 లక్షలమూలికాది గణంబుల సృష్టించి సకలకార్యసాధ కోపయోగంబులుగా నుండునట్లనుగ్రహించె.

## వృక్షరాజాది గుణములు.

భూతత్వమున జనించునవి బలముగలవి మధురరుచిగలవి. జలతత్వమున తెలుపువన్నెయు నుప్పురుచిన్ని అర్ధచంద్రాకార ముగ నల్లుకొనునవిన్ని, అగ్నితత్వమున కారపురుచిన్ని రక్త వర్ణము తీవ్రవేడిమి పొట్టిపొదలు ముండ్లు ఆకులు పెళుసుగలిగి యుండు. వాయుతత్వమున జనించునవి పులుసురుచిగలవి శాఖ లుగా నెదుగునవిన్ని ఆకుపచ్చవన్నెయు గలిగియుండు. ఆకాశ

తత్వమున చేదు రుచిన్ని నలుపువర్ణము గలిగియుండును. త్రైవా రాకారము గలిగియుండును. భూమి నాధారము లేక చెట్లపై తీగల్లుచు ఆప్రాంతమున గడ్డివేసికాల్చిన కాలనిచోటు గుర్తు బట్టి త్రవ్వితే గడ్డలు తేలును. ఇవి భక్షించినవారము దినములు ఆకలిస్తంభించియుండును. అరణ్యస్థానసిద్ధులు సాధువులు గోసా యిలు చిరంజీవులై చలనరహితులై స్థాయిగానుందురు. అనేక యుపయోగములుగా నుండునట్లు తెలియుటచేత కొన్ని కరణు లిచట లిఖించబడును.

## వృక్షమూలికాదికరణులు

అమృతకరణులు ఆయుష్కరణులు ఆరోగ్యకరణులు అంజనకరణులు ఆకర్షణకరణులు అదృశ్యకరణులు అగ్నికరణులు అగ్నిస్తంభనకరణులు ఇంద్రజాలకరణులు ఉచ్చాటనకరణులు ఆవేశకరణులు కనకకరణులు కామకరణులు గర్భధారకరణులు గర్భవిచ్ఛిన్నకరణులు జలకరణులు జలస్తంభకరణులు జ్ఞానకర ణులు చరకరణులు ఇంద్రియకరణులు ధనకరణులు ద్రవకరణులు పుష్టికరణులు బలకరణులు భోగకరణులు ప్రాణకరణులు ప్రాణ హారకరణులు ద్వేషకరణులు మదకరణులు మహత్కరణులు మారణకరణులు యోగకరణులు లక్ష్మీకరణులు వశ్యకరణులు విద్యాకరణులు విషకరణులు వాయుస్తంభనకరణులు శాంతికర ణులు శుష్కకరణులు సంజీవికరణులు సంతోషకరణులు సంప త్కరణులు సువర్ణకరణులు స్థూలకరణులు సంమోహనకర ణులు హిమకరణులు హోమకరణులు క్షేమకరణులు ఇత్యాది కరణులు అనంతముగాగలవు. యీమూలికలు 1-3-5-7-9

15-20-25-30 అంగుళములు యెత్తుయెదుగు మూలికలున్ను 1-2--3-5-7-10 గజముల యెత్తుయెదుగు మూలికలున్ను కాండములు పనికిరాని మధ్యవృక్షములు తెలుపు యెరుపు నలుపు ఆకుపచ్చ పసుపువన్నె వృక్షములున్ను శ్రీశైలాద పర్వతస్థానములయందు గలవు. పర్వతారణ్యజలస్థానముల యందు వేళ్లు గడ్డలు చక్కలు చిగుళ్లు కాయలు పువ్వులు పిందెలు పండ్లు పనికివచ్చేవిన్ని తీపి వుప్పు కారము పులుసు వగరు చేదు - యీ షడ్రసవస్తువులున్ను సర్వజీవులకున్ను భక్షణాది సర్వోపయోగములుగా నుండునట్లు సృష్టించె. షడ్రసపదార్థములచేత రస రక్త మాంస నాళాస్థి అస్థి మేధో మజ్జా శుక్ర ధాతువులచేత సర్వజీవులకు దేహసంతుష్టి తేజస్సు ఓజస్సుగలిగి బలవర్ధనులై యుండుటకు మరియు.

## జీవజన్మకారణములు

శ్లో॥ ఓషధ్యోరన్నం అన్నాన్మేధోజాయతే॥ మేధోన్మాంసః మాంసాద్రక్తః రక్తాద్రాతః రేతసోమోహః॥ యీసూత్రక్రమంబున ఓషధీ కందమూలాది పత్రభక్షణలచేత అన్నాదుల వలన రసధాతువృద్ధిన్నీ, రసధాతువువలన రక్తధాతువృద్ధిన్నీ, రక్తధాతువువలన మాంసవృద్ధిన్నీ, మాంసధాతువుచేత నరములున్ను, నరములవలన శల్యములున్ను, శల్యములవలన మూలగలున్ను, మూలగలవలన కొవ్వు, కొవ్వువలన మెదడు వృద్ధిబొంది యీ మెదడువలన శుక్రము వృద్ధిబొంది యీశుక్రమువలన మోహము జనించి నేత్రములకావరించి మదాంధుడై స్త్రీవాంఛచలిగి స్త్రీల నాలింగన చుంబన కుచమర్దనాది సుర

తోపచారకుశలుండై యోని శిశ్నముల గాఢరతిచేత శిశ్న రంధ్రము వికసించి స్త్రీగర్భనాళమందుగల చలువగల ఆవిరి కపాలకుహరమునపోయి అగ్నితుల్యమగు శుక్రము చంద్రకిరణ స్పర్శచేత చంద్రకాంతమణి ద్రవించు విధమున శుక్రముప్పొంగి శిరోనేత్రహృదయవస్తిమార్గముల ద్రవించి జారి శిశ్నరంధ్రము నుండి స్త్రీగర్భమునందు బడి 9 మాసములకు 12 అంగుళముల పిండమై యోనిద్వారమునుండి భూపతనమగుటె జన్మించుట. జననభేదంబులు 108 విధములుగ నుండును.

## గర్భపిండవిషయము.

శ్లో॥ శుక్లశోణితాదావర్తతే గర్భః స్త్రీరేతోఽతిరిక్తా స్త్రీయోభవతి పురుషరేతోఽతిరిక్తాత్పురుషోభవతి। ఉభయోర్బీజ తుల్యాన్నపుంసకో భవతి। వ్యాకులితమనాః ఖంజాః। కుబ్జాః వామనాదిరూపోభవతి।ఏకరాత్రేణ స్ఖలితంభవతి, పంచరాత్రేణ బుద్బుదంభవతి। స్త్రీగర్భమున గర్భకమలమునమూడావర్త మునశుక్రముబడి యా శుక్రమధికమైన పురుషజన్మంబునూ స్త్రీ యొక్క శోణితమధికమైన స్త్రీజన్మంబునూ రజశ్శుక్లములు సమముగనుండిన, నపుంసకజన్మంబును స్త్రీకి మనోవ్యాకులము గలిగినప్పుడు గర్భమందు బీజముపడిన కుంటివాడు గ్రుడ్డివాడు పొట్టివాడు మరుగుజ్జువాడు జనించును. యేకరాత్రి సంగమించ గా స్త్రీగర్భకమలమందు పడినబీజము పెరుగును. చింతపండును గలిపిన విధమున సుడిదిరుగుచు 3దినములు గడచువరకు 5దిన ములకు నీటిబుడగవలెనగుచు నిలచి 10దినములకు శుక్లశోణి

తము లేకమై 15దినములకు కుక్కుటాండమువలె 20దినములకు మాంసఖండమై 25దినములకు పిండాకారం బేర్పడును.

పిండమున ఆకారము లేర్పడుట.

శ్లో॥ మాసేన శిరసి। మాసద్వయేన కరపాదా భవతి। త్రిమాసా దవయంగ। చాతుర్థః కర్ణజిహ్వ। పంచమే నవరంధ్ర రోమాణి, షష్ఠి అంగ్రీయుచక్షుషి సప్తమేమాసి భవోజీవో భవతి. ఒకమాసమునకు పంచభూతములుకూడి శిరస్సుయేర్పడును. మెదడు వృద్ధిబొందును. 2వమాసమున ఎముకలు కాళ్లుచేతులు వ్రేళ్లు యేర్పడును. 3వ నెల అవయవములు, నాసికము, 4వ నెల చెవులు నాలుక, 5వ నెల రోమములు, నవ రంధ్రములు, 6వ నెల పాదములు, నేత్రములు గోళ్లు కంఠము ఉదరము శల్యములు యేర్పడి 7వ నెల దేహమందు జీవుడు ప్రవేశపెట్టబడును.

పిండమందు జీవ ప్రవేశము

తల్లి గర్భమున నేర్పడుపిండమునందు తల్లితండ్రుల ప్రాణవాయువు అనుసరించి యుండుటచేత తద్వారా ఏ జీవుని సంకల్ప వికల్పభ్రమలచేత చేయబడిన కర్మరూపమగు ఆగామి, సంచిత ప్రారబ్ధములచేత యెచ్చట జన్మించవలయునో ఆజీవునికి తగిన కర్మసంబంధజన్మమును బ్రహ్మదేవుని విధిక్రమమున ఆజ్ఞ దాట లేక అశక్తుడై చింతింపుచు మాతృగర్భనరకము ననుభవింప లేనని మొరబెట్టుచు పరితపించుచు నుండగ.

అగ్ని దేవుండువచ్చి దర్శనమిచ్చి నే నగ్ని దేవుండను. నేను నీనేత్రములయందుండి సర్వలోకపదార్థములను చిత్రవిచిత్ర

ములను చూచునట్లు పంచరంగులు వర్ణముల గ్రహించు నట్లును బలమిచ్చెదను. నీకు భృత్యుడనై యుండి నీవాక్యర్థన మున నిల్చి ఉత్తమ మధ్యమ అధమ నీచ రోషాదిప్రసంగవా క్యములకు బలమిచ్చెదననియు సంభాషణశక్తి యిత్తుననియు నాభిస్థానమందుండి జఠరాగ్నిరూపంబున నీవు భక్షించు పదా ర్థముల జీర్ణింపచేసెదననియు నీకు తనుబలమును నేత్రబలము నిద్రాసౌఖ్యము నిచ్చెదను. నీకు కొరతలేకుండునట్లు చేసెదను. నీవు అకృత్యములు చేయకుమని వాగ్దానమిచ్చి నీవు లోకము నకు పౌమ్యు, జ్ఞానసంపన్నుడవగుదువు. మోక్షము పొందుటకు సహాయుడ నయ్యెదను. నీవు ప్రారబ్ధ కర్మవశమున నీవీజన్మ మెత్తవలెను. విధిని దాటశక్యము కాదు. అని సమాధానపరచి అంతర్ధానుండగును.

సూర్యదేవుండు వచ్చి జీవుని చింతమాన్పుటకై ప్రత్యక్షంబై నేను సూర్యుండను, నీకీప్రపంచమంతయు గ్రాహ్య మగునట్లు చేసెదను. జ్ఞానమునకు కారణభూతుండనై మోక్షము సాధించుటకు సహాయుడ నయ్యెదను. నీవు ఈశ్వరస్వరూ పుండవగు మహాత్ముండవు, నీవుచేసిన కర్మప్రారబ్ధవశంబున జన్మ మెత్తవలసెను. వేరొక ప్రంచమునకురమ్ము నిన్ను నీ వెరుగవు. కర్మచేతనిట్లైతివి అని ధైర్యముచెప్పి అంతర్ధానుండగును—తర్వాత.

చంద్రుండువచ్చి నీమనస్సునందుండెదను నీపంచప్రాణము లకు బలమిచ్చెదనని బోధించి జన్మకు వెళ్లుమని ఆజ్ఞయిచ్చి అంత ర్ధానుం డగును.

వరుణదేవుండు వచ్చి నీజిహ్వాయందుండి షడ్రసపదార్థములతో సంతుష్టిపొందునట్లును నీగుహ్యేంద్రియమందుండి సుఖమిచ్చెదను. నీవు జన్మకు వెళ్లుమని బోధించి అంతర్ధానుండగును.

రుద్రుండువచ్చి నేనహంకారాధి దేవతనగుటచేత సర్వకార్యసమర్థతాబలమిచ్చి నీకు సాహాయ్యముగనుందును. పెరువక జన్మకు వెళ్లుము అని బోధించి అంతర్ధానుండగును

విష్ణుదేవుండు నీపాదములయందుండి బ్రహ్మనిష్టాగరిష్టులగువారియొద్దకు పోవునట్లుచేసి మోక్షసాధకమునకు సహాయుడనగుదునని బోధించి అంతర్ధానుండగును

బృహస్పతి నీబుద్ధియందుండి మోక్షమార్గ మిప్పించెదననియు యీ దేవతలందరు వాక్సహాయ్యములిచ్చి సమాధానపరచగా-

మృత్యుదేవత వచ్చి నీగుదస్థానమందుండి మల జల విసర్జనాదికార్యములకు సాహాయ్యముగా నుండెదను. నీకాధారమై కాపాడుచుందును. నీవధర్మమునకు పాల్పడిననాడు నిన్ను చంపెదను. అని బోధించి సమాధానపరచి మృత్యుదేవత అంతర్ధానమగును. మాతృగర్భమున గల జడతనువునందు 7,8 మాసములు రాగా-

ప్రారబ్ధకర్మ జీవుని బ్రహ్మదేవుండు మాతృగర్భపిండమందు ఉచ్ఛ్వాసనిచ్ఛ్వాసవాయువులద్వారా బ్రహ్మరంధ్రమార్గమున జీవుని ప్రవేశపెట్టి ప్రతిష్టించి వెళ్లును.

తదాదిగా జ్ఞానమారంభమై పూర్వము చేసిన కర్మవశమున యీజన్మబంధకం బేర్పడెనని చింతింపుచు యేగతియుం

దోచక మాతృగర్భనరకమందుపడి కర్మదోషములు నశించు టకు మనస్సు శాంతిజెంది.

శ్లో॥ అకారేణబహిర్వ్యాపి సకారో విశ్వతః పునః హంసహం సేతి యన్మంత్రం జీవో జపతిసర్వదా॥ అను సూత్రార్ధముగా 19 లక్షల 44వేల జపము ముగియువరకు తొమ్మిదవమాసాంతము నకుచేయగా యీ జపబలముచేత జీవునకు విజ్ఞానతేజస్సుగలిగి కాఠిన్యబంధకంబగు మాతృగర్భనరకము దాటి రావలెనని యత్నమున పరితపించుచుండగా 9వమాసాంతంబున మాతృ గర్భనాళము అవిచ్ఛిన్నమై యోనిమధ్యద్వారమున కఠిన స్పర్శచేత శ్రమగలిగి పరమాత్మా యీశ్రమ కోర్చలేను. నా కీబంధకము తప్పించి నీవాడను నన్ను రక్షింపుమని శరణమని తపించుచుండగా భూపతనమై జనించును. ఇట్లు తారకమంత్ర బలముచేత ఘోరకష్టములైనను జయించవచ్చును. శుద్ధసాత్విక పురుషులి రహస్యము గ్రహింతురు.

శ్లో॥ జ్ఞానాంతే తేజసంప్రాప్తి యోనిర్మధ్యశ్చ గచ్ఛతి। యోనిస్పర్శమాత్రేణ పూర్వజ్ఞానం వినశ్యతి॥ అనుక్రమమున యోనిస్పర్శచేత జనించుటవలన అజ్ఞానమావరించి మతిగతిచెడి జ్ఞానము నశించి మరుగుపడి మధుపానబద్ధునివలె మరుపుగలిగి క్వాం క్వాం క్వాం యని యేడ్చుచు మలమూత్రములలో మునుగుచు క్రమాభివృద్ధియగుచు నిత్యదుఃఖములలో తల నొప్పితో ఆగ్రహము బొందుచు లోకమాయకు వశుడై కాలము గడుపుచు లోకచిత్రములకు మరిగి ఆశ్చర్యపడుచు బాల్యయవ్వనకౌమార వార్ధక్యములు గడుపుచు అత్యంత

కష్టములకోర్చుచూ కర్మ లనుభవించుచూ భగవదాజ్ఞాప్రేరితమగు మృత్యువశమున చచ్చుచు పుట్టుచు మతిగతిచెడి అజ్ఞానమ్లున మునిగియుండును.

## సంతతిభేదములు

స్త్రీ బహిష్టయైన దినమున సంగమించిన ఆ బీజమువ్ల జనించుశిశువు వారముదినములు జీవించి నశించును. రెండవ దినమున బీజముపడిన పిండము మధ్యనే యూడిపడును. 3–వ దినమున పడిన బీజమువలన అతిచోరుడై జనించును. 4–వ దినమున బీజము పడుటవలన పాపాత్ముడు అల్పాయుస్సుగల వాడగును, సామాన్యుడున్నూ అగును. సరి రాత్రులలో మొగశిశువున్నూ బేసిరాత్రులలో స్త్రీ శిశువున్నూ బుట్టును. శుక్లమతిశయమైన పురుషుడున్నూ శోణితమతిశయమైన స్త్రీ జన్మమున్నూ సంగమమయిన వెంటనే స్త్రీ కుడివైపు పరుండిన పురుషజన్మంబును, యెడమవైపు శయనించిన స్త్రీ జన్మమున్ను గల్గును. 5–వ దినమున బీజముపడిన సంతానవతియు బుద్ధి వంతురాలున్నూ బుట్టును. 6–వ దినమున పడిన బీజమువలన మూర్ఖుడు సామాన్యుడు బుట్టును. 7–వ దినమున పడిన బీజమువలన దయగల బుద్ధిగలదియు సంతానవతియు, ధర్మము తప్పనిదియు బుట్టును. 8 – వ దినమున పడినబీజమువలన ఉత్తమ గుణములుగవాడు ధీరవాడు అంత్యదశయందు సౌఖ్యమను భవించువాడున్నూ బుట్టును. 9 – వ దినమున బీజముపడిన పతివ్రతయు ధైర్యముగలదియు బుట్టును. 10–వ దినమున పడిన బీజమువలన ఉత్తమగుణములు గల

వాడున్నూ బుట్టును. శ్రేష్ఠుడగును. 11–వ నాడు గర్భమందు బీజముపడిన అధర్మకర్మురాలు బుట్టును. 12–వ నాడు గర్భమందు బీజముపడిన శ్రేష్టుడు ఉత్తమగుణములు గలవాడున్నూ బుట్టును. 13–వ నాడు గర్భమందు బీజముపడిన శ్రేష్ఠురాలు బుట్టును. 14–వ నాడు గర్భమందు పడినబీజమువలన ఉత్తమ గుణములు గలవాడు శ్రేష్ఠుడున్నూ బుట్టును. జ్ఞానాసక్తుడున్నూ అగును. 15–వ దినమున బీజముపడిన పిండము రాజభార్యగా జనించును. 16–వ దినమున గర్భమందుపడిన బీజమువలన జ్ఞానాసక్తుడు పండితుడున్నూ ఉత్తమగుణములు గలవాడున్నూ బుట్టును. 17–వ దినము మొదలు గర్భకమలము ముకుళించును. గనుక పూర్వము ఋషులు 16–వ దినమువరకు సంపర్కము చేసి తర్వాత వెంటనే నిష్ఠలోదిగి స్త్రీలను నమ్మలేక మరల బహిష్ఠయై పరిశుద్ధస్నానమయ్యే పర్యంతము స్త్రీల నంటక కాలముగడిపెదరు. స్త్రీలు పరపురుష స్పర్శవలన రుగ్మతలు గలుగునని దూరస్థులగుదురు. ఇట్టి తామస-రాజస-కామతంత్రమువలన జన్మించు మానవభేదములు 4 లక్షలు యీ విధమున జన్మించుచుందురు. మానవులకు 120 సంవత్సరములు ఆయుర్దాయ మిచ్చినను అజ్ఞాన కృత్యదోషముల చేత 25 సంవత్సరములవరకు దెచ్చుకొనిరి. అజ్ఞానకర్మదోషములే క్రూరజన్మలకు కారణము.

శ్లో॥ ఊర్ధ్వే సాత్వికమిత్యాహు ర్మధ్యే రాజసముచ్యతే అధోగతం తామసంచ। గుణత్రయమితీరితం॥ అను సూత్ర క్రమమున ఊర్ధ్వాకాశగోళమందు శుద్ధసాత్విక దేవతాంశసంత

తినీ్న। మధ్యలోకంబగు భూలోకంబున మానవసంతతిన్ని అధో భాగమున తామసగుణప్రదులగు ఉరగ రాక్షస క్రిమికీటక। పశుమృగాది క్రూరదుర్గుణ జారచోర నీచజనంబులున్నూ త్రిలోకములయందు - మూడుమూళ్లు తొమ్మిది విధములుగా నవసర్గసృష్టికి యత్నించి ఇప్పటికి 195 కోట్ల సంవత్సరముల కిందటినాడు సృష్టియత్నమున॥

సృష్టిప్రారంభము బ్రహ్మాపట్టణము 185 కోట్లకు

శ్లో॥ పంచాశత్కోటి విస్తీర్ణం కేవలం కల్పితో మహా॥

యను బ్రహ్మసిద్ధాంతసూత్రక్రమమున (500) అయిదువందల కోట్ల యోజనముల విస్తీర్ణముగల భూమండలమును శ్వేత వరాహ కల్పప్రారంభమున రసాతలమునందుగల భూమిని ఆదివరాహమూర్తి చేత ప్రస్తుత వర్తమాన భూలోకమును-చోటు పాతాళము మొదలు యెనిమిదవ లోకముగా నిల్పి స్థిరపరచి అట్టి 500కోట్ల యోజనపరిమితముగల భూమండలస్థానమందు భువనాభివృద్ధికొరకై బ్రహ్మదేవుండు మనోద్యోగపరుండై సృష్టియత్నమున బ్రహ్మాండమునకు 14 కోట్ల 56 లక్షల యోజనముల యెత్తున్నూ, 12 కోట్ల 85 లక్షల యోజనముల వెడల్పున్నూ ఆవరణం బేర్పరచి ఆమధ్య జంబూద్వీప మధ్యను ఇలావృతమధ్యభాగమున మేరుపర్వతము లక్షయోజనముల యెత్తున 86 వేలయోజనముల విశాలచదరంబు పర్వతాగ్ర ఊర్ధ్వనడిమిదళంబున 32 వేల యోజనముల చదరమునందు 16 వేల యోజనముల విశాలమున బ్రహ్మదేవుని నివాస యోగ్యంబగు బ్రహ్మపురంబు తేజరిల్లుచుండు. తన్మధ్యంబున

4 వేల యోజనముల చదరముగల బ్రహ్మదేవుని మణిమయ కనకగృహంబులున్నూ వర్ణించుట కలవిగాని అష్టదిక్కుల నుండుశాలలు సభాస్థానంబులు విశ్రమ స్థానంబులగు రచ్చ తిన్నెలు బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుల యొక్కయు లక్ష్మీ, సరస్వతి, పార్వతులయొక్క అష్టదిక్పాలకులయొక్క బ్రహ్మ ఋషులు దేవగణముల నివాసశాలలున్నూ బంగారుసోపానం బులుగల పద్మసరస్సులున్నూ, చరులు, గుహాలు, బిలంబులు, సానువులు చతుర్దిశలగల పర్వత శిఖరమధ్యస్తమార్గములు, కల్ప తరువులు మూడవ అంతరువున అష్టనగంబులు బ్రహ్మ పురంబునకు 4 దిశలయందు తూర్పున మందరాచలంబును దక్షిణమున హిమవంత కైలాసాదులున్నూ పశ్చిమమున నిషధపర్వతంబును ఉత్తరమున శృంగవంతపర్వతములున్నూ మేరుగిరికి చతుర్దిశలయందు గలవు. మరికొంతదూరంబున.

ఇంద్రపర్వతంబును, మాల్యవంతంబును, పారి యాత్రంబును, నీలపర్వతంబును, శ్వేతపర్వతంబును, శృంగ వంతపర్వతమున్నూ మొదలగు పర్వతములున్నూ మేరుగిరికి ప్రదక్షిణాకారములుగా నుండు మరికొంతదూర విశాలప్రదేశ మున తూర్పున గంధమాదనమున జంబూవృక్షములు యేనుగ లావు పండ్లు పండి ఆ ఫలరసములచేత తడిసిన ఆ ప్రాంతభూమి యంతయు సువర్ణమయమైయుండు. యీ రసప్రవాహముచేత మేరుపర్వతము చుట్టూవ్యాపించి సువర్ణమయంబై యుండు. ఇందువలన జంబూద్వీపమని ప్రఖ్యాతిగాంచె. యీ ద్వీపము లక్ష యోజనములు విశాలముగలదై యుండు. యీ మేరువు

చుట్టూ ప్రదక్షిణాకారంబుగా సప్తకులపర్వతములుండు. మరియు ఏవనగా:- హిమవంతము, నిషధపర్వతము, ఐంద్రపర్వతము, మాల్యవంతము, పారియాత్రము, గంధమాదనము, హేమకూటము యీ పర్వతములు దక్షిణోత్తరములు తగ్గి తూర్పు పడమరలు ఒక్కొక వర్షమున్నూ, మధ్యప్రదేశమున ఇలావృత వర్షంబై500కోట్లయోజనవిశాలావరణంబగు భూమండలమునకు నడిమికందంబై జంబూద్వీపముకంటె తక్కిన ద్వీపము లొక దానికంటె నొకటి రెట్టింపులుకలవై తక్కిన ఆరుద్వీపము లున్నూ, లవణాదిసముద్రపరివృతంబులై జంబూద్వీపము లక్ష యోజనములలో హేమకూటాదిపర్వతములకు మరికొంతదూరమున తూర్పున ఇంద్రునినందనవనంబును, దక్షిణమున యముని సర్వతోభంద్రబునూ, పశ్చిమమున వరుణదేవుని వైభ్రాజకంబును, ఉత్తరమున కుబేరుని చైత్రరథమును 4దిశల యందును మహాదరణ్యంబులం బోలిన దేవతోద్యాన వనంబులు గలవు. సంచారయోగ్యంబై యీ యుద్యాన వనములకు మరికొంతదూరమున మేరువు 4దిశల యందును చతుస్తంభములవలె చూత, మామిడి, జంబూక, నేరేడు, కదంబ, కడిమి, న్యగ్రోధ, మర్రివృక్షములు 11వేలయోజనముల వ్యవధిగలిగి యుండును. యీ వృక్షరాజముల సరిహద్దులకు మరికొంతదూరమున 1 మహాఖర్వం 67 ఖర్వములకు.

### అష్టదిక్పాలక పట్నములు

బ్రహ్మపురమునకు 4వేల యోజనముల దూరమున తూర్పున ఇంద్రుని అమరావతీపురంబును, అగ్నిదిశయందు

4వేల యోజనములదూరమున అగ్ని దేవుని తేజోవతీపురంబును, దక్షిణదిశయందు 4 వేల యోజనముల దూరమున యమధర్ముని సంయమినీపురంబును, నైఋతిదిశను 4 వేలయోజనముల దూరంబున నైఋతి కృష్ణాంగాపట్టణంబును పశ్చిమంబున 4 వేల యోజనముల దూరంబున, వరుణ దేవుని శ్రద్ధావతీ పురంబును వాయువ్యదిశను 4 వేల యోజనముల దూరంబున వాయు దేవుని గంధవతీపురంబును ఉత్తరదిశను 4 వేల యోజనముల దూరమున కుబేరుని అలకావతి పురంబును, ఈశాన్య దిగ్భాగంబున 4 వేల యోజనముల దూరమున ఈశ్వరుని యశోవతీపురంబును యీ యష్ట దిక్కుల పురస్థాపనములుచేసి స్థిర నివాసంబులు చేయుచు లోక పరిపాలనాదికృత్యములు జేయ నుద్యమించి మరియు.

చతుర్దిశాధిష్ఠాన దేవతలు యీ బ్రహ్మాండమునకు అధిష్ఠాన దేవతలుగా 4 దిశలయందును అనగా తూర్పుదిగ్భాగంబున భద్రాశ్వవర్షహయగ్రీవుని దక్షిణదిగ్భాగంబున భారతవర్ష కూర్మావతారుని పశ్చిమదిశను కేతుమాలవర్షమున వరాహరూపుండును ఉత్తరమున ఇలావృతవర్షమున మృత్యుంజయుండను ఈశ్వరుండును యీ చతుర్దిశలయందు వీరు బ్రహ్మాండమునకు ఆదిదేవతలుగా అధిదేవతలై చతుర్దశ భువనంబులం గాపాడ తల్లితండ్రులవలె జగత్పరిపాలకులై లోకజన రక్షణలు చేయు అధిష్ఠాన దేవతలైరి.

## పంచభూత సృష్టులు

పంచమూర్తులగు బ్రహ్మ విష్ణు ఈశ్వర ఇంద్ర సూర్యాదులు ఆకాశగోళ ఊర్ధ్వభాగంబున దేవతాంశసృష్టియు మధ్య వాయుమండలమున సర్వజీవాదిసృష్టిన్ని, అగ్నిమండలమున పర్వతాదిస్థానములందు ధాతు రత్న లోహ పాషాణాది సృష్టిన్ని జలభూతభాగంబున మత్స్యాది జీవసృష్టిన్ని భూమియందు 84 లక్షల జీవజంగమస్థావరసృష్టులున్నూ, త్రిగుణ విభాగరూపంబుల నవసర్గసృష్టి చేయనెంచి సాత్విక, రాజస తామసగుణక్రమంబులుగా దేవమానవ తిర్యగ్జంతువులుగా సృష్టియత్నమున తొలుత దేవతాసృష్టికి యత్నించి దేవతా సర్గమునకు ఆహారపానంబులు కొరతలేకుండునట్లు సృష్టించె యెట్లనగా.

## దేవతలకు ఆహారపానంబులు

మందరపర్వతము చివరప్రదేశమున మామిడిపండ్ల రసప్రవాహంబునూ యెర్రని కాంతులతో మధురసుగంధములతో అమృతతుల్యముగా యీ ప్రవాహము మందరాచల ప్రాంతము దడుపుచు ఇలావృతవర్షము చుట్టూ మహాతరంగములతో ప్రవహింప సృష్టించె. స్నానపానోపయోగమగునట్లు అనుగ్రహించె.

సుపార్శ్వపర్వతంబున పంచశాఖలుగా బారి ధారా ప్రవాహంబులై ప్రదక్షిణముగా బారి యిలావృత పశ్చిమ భాగంబు దడుపుచు ప్రవహించు మకరందప్రవాహంబుగలను,

ఆకలిదప్పులు దీర్చ సమర్థవంతమై యుండు మహాసుగంధ రుచులుం గలిగియుండు.

కుముదపర్వతశిఖరములయందు పుట్టిన మహాప్రకాశమాన వటవృక్షముల శాఖలయందు పుట్టిన క్షీరపానంబులు, ఘృతపానంబులు, దధిపానంబులును, మధురపదార్థములున్నూ, విశిష్టాన్నంబులు, వస్త్రములు అష్టవిధభోగములకు తగువస్తుపదార్థములు, శయనములు, ఆసనంబులు, ఆభరణములు, సర్వాభీష్టపదార్థములున్నూ నిత్యభోగంబులు జరుగునట్లు క్షీరపానంబులు, చెరుకురసపానంబులు, సురాపానంబులు, మృష్టజలంబులుం గలిగి శతయోజన విశాలసరస్సులుం గలిగి సకలదేవతాతండములకు ఆహారపానసుఖయోగ్యములుగా నుండునట్లు సర్వకాలములందు సాహాయ్యముగా నుండునట్లు కామధేను కల్పవృక్షముల పగిదిగా బ్రహ్మదేవుండు సృష్టిరచన కల్పించె.

యిలావృతవర్షముపైగా రమ్యకవర్షమందు వటఫలరసప్రవాహము స్నాన పానోపయోగముగా నుండునట్లున్నూ, హిరణ్మయ వర్షమున స్వర్ణతామరపుష్పంబులు భక్షణార్థంబుగా నుండునట్లున్నూ, కింపురుష వర్షంబున జువ్వి పండ్లాహారంబుగా పానంబుచేయుచూ సుఖానందులై యుందురు. హరివర్షంబున చెరుకురసపానంబుచేత వయఃకామంబుగలిగి ఆయురారోగ్యంబులుం గలిగియుండునట్లున్నూ ఇట్లు పలువిధముల స్నానపానసుఖానందముల కాకరమై యేకొరతలు లేకుండునట్లు యేర్పరచె, మరియు.

## పర్వతములు

మేరువు నాశ్రయించియుండు పర్వతములు అనగా మేరుపర్వతములచుట్టూ ప్రదక్షిణములుగా నుండుపర్వతములు వైఢూర్యపర్వతము, నారదపర్వతము, కురంగపర్వతము, కురరపర్వతము, కుసుంభపర్వతము, వైకంకతపర్వతము, త్రికూటపర్వతము, శిశిరపర్వతము, పతంగపర్వతము, ఋచకపర్వతము, నిషధపర్వతము, శితివారపర్వతము, కపిలపర్వతము, శంఖాదులను పర్వతములు- యీా పర్వతములు మేరువుకు కర్ణికకేసరంబులై పరివేష్టించియుండు.

యీా మేరుపర్వతమునకు తూర్పున జఠరపర్వతమును, దేవకూటపర్వతమును, పశ్చిమదిశను పవనపర్వతమున్నూ, పారియాత్రపర్వతమునూ, యీా 4 పర్వతములున్నూ, ఒక్కొక పర్వతమునకు దక్షిణోత్తరముల దిశలయందు 18 వేలయోజనములు విశాలములుగలిగి పూర్వపశ్చిమముల 2 వేల యోజనములు వెడల్పున్నూ గలిగి అగ్నిపురుషునకు ప్రస్తరములుగతి అష్టనగంబులుండు యీా మేరువునందే కాక మరియు పర్వతములుగలవు, అవి యేవి యనగా: మలయపర్వతము, మంగళప్రస్థము, మైనాకపర్వతము, త్రికూటపర్వతము, కోల్లపర్వతము, సహ్యాపర్వతము, వేదిగిరి, ఋశ్యమూకపర్వతము, శ్రీశైలపర్వతము, వేంకటాద్రియు, మహేంద్రపర్వతము, పారిధరపర్వతము, వింధ్యపర్వతము, శుక్తిమత్పర్వతము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణపర్వతము, చిత్రకూటము,

గోవర్ధనాద్రియు, రైవతకపర్వతము, కుసుంభపర్వతము
నీలగిరియు, కాకముఖపర్వతము, నింద్రకీలము, రామగిరి ఆదిగాగల పుణ్యపర్వతములు, అనేకములుగలవు. యీపర్వతముల యందు పర్వతపుత్రికలగు నదులుగలవు. అవియేవి యనగా.

## పర్వతపుత్రికలగు మహానదులు. 193 కోట్లను.

చంద్రపటయు, తామ్రపర్ణియు, కృతమాలయు, వైహాయసియు, కావేరి, కృష్ణవేణి, పయస్వినియు, పయోదము, శర్కరావర్తయు తుంగభద్రయు, భీమరథియు, వేణియు, గోదావరియు నిర్వింధయు, పయోష్ణియు, తాపినియు, రేవానదియు, శిలానదియు సురసానదియు, జర్మణ్వతియు, వేదస్మృతియు. ఋషికుల్యయు త్రిసమయు, కౌశికియు, మందాకినియు, యమునానదియు, సరస్వతియు, దృషద్వతియు, గోమతియు, సరయూ నదియు, భోగవతియు, సుషమయు, శతద్రువు, చంద్రభాగయు, మదుగ్వధయు, నందయు, యమునయు, నర్మదయు, బ్రహ్మపుత్రయు, రుక్మదయు, మానసయు, సువాహినియు, పితృకుల్యయు, ఋషికుల్యయు, వితస్తయు, నసిక్నియు, విశ్వసయు, శంఖావతియు, చక్షుశ్యామ, భీమరథి, సింధువు, శోణనది, యివియన్నియు పురుషనదులనియు సింధువు, శోణనదములు స్త్రీనదములనియు యీనదీప్రవాహములు వేలకువేలు గలవు, యీ నదీనదములు సృష్టించి పుణ్యతీర్థములు జేసె.

## ఆకాశగంగోత్పత్తి. 198 కోట్ల సం॥ క్రిందట.

ఇలావృతవర్ష మేరుపర్వతాగ్రమందు బ్రహ్మపట్న మధ్యస్థమున ఆదియందు విష్ణుదేవుండు విజృంభించి విరాడ్రూపంబు ధరించి ఆకాశోర్ధ్వభాగంబున దివ్యగంగాప్రవాహమును సంకల్పించి పాదనఖములచే బ్రయ్యబడి ఆకాశగంగ ధారాప్రవాహంబై హరిపాదప్రథమస్పర్శచేత విష్ణుపాదోద్భవి యనుపేరట చనుదెంచి సకలలోకదురితహరముగా హరి పాదోద్భవ యనబరగి దీర్ఘకాలంబు దేవతాసర్గనివాసియై ప్రవహించుచున్న గంగను బ్రహ్మకుమారులగు సప్తర్షులు మొదలు సకలదేవతాగణంబును అనంతమహిమతో పవిత్రులగుటవలన సకలభువనంబులయందు ప్రవహించునట్లు చంద్రమండలాధోభాగమున మేరుశిఖర అగ్రభాగంబున బ్రహ్మపట్నమున చతుర్ద్వారములవెడలి ప్రవహించుచు శీత యను నదీప్రవాహము కేసరావలయంబు దడుపుచు గంధమాదనాద్రిపై బారి భద్రాశ్వవర్షంబు పావనంబుచేయుచు తూర్పు సముద్రమునం గలిసె.

పశ్చిమంబున చక్షువను పేరం బరగి దీర్ఘప్రవాహంబై పశ్చిమద్వారంబువెడలి మాల్యవంతము నుత్తరించి కేతుమాలవర్షముపై బారి పవిత్రముచేయుచు పశ్చిమ లవణసముద్రమును గలిసె.

## గంగాప్రవాహములు

ఉత్తరద్వారంబున భద్ర యను మహాప్రవాహంబు వెడలి కుముద, శ్వేత, నీల పర్వతంబులు గడచి ప్రవహింపుచు శృంగనగమానసోత్తరపర్వతంబులు గడచి ప్రవహింపుచు ఉత్తరకురుభూములం దడువుచు పవిత్రముసేయుచు ఉత్తర లవణసాగరాంతంబుగా చేరుచుండు.

దక్షిణదిశ బ్రహ్మపురద్వారంబు వెడలి అలకనంద యను పేర ప్రసిద్ధినొంది ప్రవహింపుచూ అతిదుర్గమభూధరములు గడచి హేమకూట వామకూటనగరముల నుత్తరించి అతిదీర్ఘవేగంబుగా బారి దక్షిణదిశ జంబూద్వీపమున భారతవర్షంబు పవిత్రముచేయుచు దక్షిణసముద్రమున గలిసె. భగీరథుఁడు పితృదేవతలఁపవిత్రముసేయు నిమిత్తము ఈశ్వర జటాజూటమున స్తంభించియుండు అలకనంద యను గంగ ఈశ్వరానుగ్రహమున భగీరథునిచే భూలోకమునకు తెబడినది.

## దేవతాసృష్టి ప్రారంభము. 185 కోట్ల సం॥ నాడు.

బ్రహ్మదేవుండు (17064000 కోటిడెబ్బదిలక్షల అరువదినాల్గువేల సంవత్సరములు సృష్టికారణాంతర తపోధ్యాన విడంబనకాలానంతరము సత్యలోకమున దేవతాసృష్టి ప్రారంభించుటకు ప్రథమంబున తన కధికారస్థానంబగు భూమండలమున సృష్టిప్రారంభించి చేయుగా అవ్యక్తమూర్తులు ౬౦ వేల మంది జనించగా వారిని వృక్ష మృగ క్రిమి కీటక సర్ప వృశ్చి

కాదులుగా జగంబున 84 లక్షల జీవంబుల సృష్టించె. ఇందు వలన సృష్టికి విఘ్నంబు జరిగె. తర్వాత.

తాను సృష్టించు జీవులను శుద్ధసాత్వికాంశమున జనించు వారిని స్వర్గస్థానమందును, రాజసులను భూలోకమునందును, తామసులను అధోలోకమునందును త్రివిధములుగా భాగించి నవసర్గసృష్టింజేసె. తపోబలముపల్లను ఆత్మపరిచితి బలమువల్లను ఊర్ధ్వలోకమున దేవతాహంశ పురుషుల సృష్టించనెంచి పూర్వము ప్రథమంబున విరాట్శక్తివల్లను విరాట్టువల్లను మానసబ్రహ్మరూపంబుగా నేర్పడుటవలన ఆ మానస బ్రహ్మమందు ప్రాణవాయువును జేర్చి ఆహుతి గావించగా సకలనదీప్రవాహములున్నూ పవిత్రులగు మహాఋషులను వాయుప్రభృతులగు దేవతలును జనించగా వారిని సంతుష్టులం జేసె.

సర్వదృగ్గోచరాధీనంబగు చాక్షుపబ్రహ్మాంశంబున ఉదానవాయువునందు ప్రాణమానసాగ్నులంజేర్చి ఆహుతి గావించగా అన్నాదులవలన భవుడు, నందికేశ్వరుడు, పార్వతి- మనస్సు – ప్రాణసమూహము నవబ్రహ్మలు జనించగా వారిని సంతుష్టులం జేసె.

సత్యాసత్యప్రధానవాచక బ్రహ్మాంశమున సమాన వాయువునందు మానసాగ్నులంజేర్చి ఆహుతి గావించగా అన్నము అశ్వినీదేవతలు, మరుద్గణంబును, విష్ణువును, వరుణ దేవుండును, యముండును, ప్రజాపతియు, కుబేరప్రభృతి దేవతలు జనించగా వారిని సంతుష్టులం జేసె.

సర్వవిషయ శ్రవణ గ్రాహ్య శ్రావణ బ్రహ్మాంశంబున వ్యానవాయువునందు మానసాగ్నుల ప్రయోగించి ఆహుతి గావించగా అన్నబలంబును, నక్షత్రగణంబును, సప్తద్వీపములున్నూ, చతుర్దశభువనంబులున్నూ, భూమండలమున్నూ, సకలభూతసహిత బ్రహ్మాండమున్నూ యక్షోరగ రాక్షసప్రభృతులు జనించగా వారిని సంతుష్టులం జేసె.

సత్యాసత్య విమర్శనాశీలముగల యా సత్యబ్రహ్మాంశంబున అపానవాయువునందు మానసాగ్నులంజేర్చి ఆహుతి గావించగా జనపాలకర్మవిస్తారులు, కర్మఠులు, దుర్మార్గులు, నీచవర్తనులు, కుటిలచంచలాత్ములు జనించగా వారిని సంతుష్టులంజేసె. తామసగుణనరకాధికారుల విషయము వైవస్వతమనువు పాలనగల కలికాలధర్మమందు విశదమగును.

## జీవవిరాట్టు వివరము

ప్రణవవిరాడ్బ్రహ్మయందు పంచాకారాంశముల చేత జనించిన పంచాక్షరి. ఈ పంచాక్షరియందు పంచబ్రహ్మలు యీబ్రహ్మలందు పంచతన్మాత్రలున్నూ జనించె. యీతన్మాత్రలందు శబ్దగుణాకావకాశమున స్పర్శగుణక వేగంబును, రూపగుణక తేజస్సును, రసగుణక సత్వమున్నూ, గంధగుణక బలంబున్నూ, క్రమభాగంబులంజేర్చి యీ పంచతన్మాత్రాంశల చేత సూక్ష్మదేహంబుల నేర్పరుప బ్రహ్మదేవుండు సృష్టికిప్రారంభించి జీవతేజో బింబస్వరూపులను సృజింపదలచి ఆధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహుతి విశుద్ధ ఆజ్ఞేయ సహస్రారస్థాన

ములుగా తేజఃపుంజ కళామాత్రసూక్ష్మతనువు లేర్పరచి ఆ తనువులందు శిరంబున పరమాత్మకళయు, త్రిగుణాత్మక - బ్రహ్మ- విష్ణు- ఈశ్వరకళలునూ భ్రూమధ్యంబున మాయ యను ముక్తికాంతాసహిత సదాశివుండను గురుస్వరూపంబును, సుషుమ్నయందు మోక్షమార్గంబును, నేత్రస్థానంబున పంచా కాశములంజూచు శక్తియు, సూర్యచంద్రాగ్నిమండలస్థానంబు లున్నూ శ్రోత్రములయందు దశదిక్శబ్దము లాలకించు శక్తియు, నాసికను సుగంధ దుర్గంధమిశ్రగంధముల గ్రహించు ఆకర్షణ శక్తియు, అశ్వినీదేవతాధిష్ఠానమున్నూ జిహ్వయందు షడ్రస పదార్థముల నాకర్షించు అగ్నియు, కంఠమందు జీవ మహేశ్వ రాధిష్ఠిత వాక్యసంభాషణాది బలంబును, హృదయమున శివశక్త్యాత్మకమై ప్రాణినివాసంబును, నాభియందు విష్ణు దేవుండు పదార్థసంతుష్టిసేయుటయు, వస్తిలింగములయందు బ్రహ్మదేవుండు సృష్టింపచేయు శక్తియు, వీర్యమాత్రవిసర్జన ములున్నూ, గుదస్థానంబున మలవిసర్జనయు, మృత్యునివా సంబును ఇట్టి సర్వదేవతామయంబగు ప్రణవపంజరంబులను సూక్ష్మతనువుల సృజించి తదధిష్ఠాతలగు దేవతాస్థానకల్పిత ఆకారరూపంబుల నేర్పరచి హస్తములకు నింద్రుడు, పాదము లకు విష్ణువు, సర్వకార్యములకు రాకడపోకడలు గలిగించు శక్తియు, కార్యసాఫల్యములు చేయుటయు ఇట్టి సూక్ష్మ దేహంబుల నేర్పరచి కర్మవశకాలబలంబులచేత జన్మకారణంబు లుగా సృష్టించె. మరియు.

## యక్షాదిదేవతాసృష్టి ప్రారంభము

195 కోట్ల సం॥ నాడు యిట్టి జీవబ్రహ్మతత్వమువలన అనేకులను అనేకభువనంబులు సృష్టిచేయదలంచి సృష్టికి ప్రారంభించి చీకటియు అంధతమిస్రంబును తమమును మోహమును మహామోహమును పంచవిధమోహరూపాత్మక అవిద్యయు ఇవి క్రమభాగంబుల విచారించక సామాన్యముగా మొత్తముచేసి భాగక్రమంబుల విచారించక కూర్చగా తమోమయదేహంబై విజృంభించిన బ్రహ్మదేవుండు భయభీతులంజెంది ఆసృష్టివిడిచె. యీసృష్టి వృథాపోక ఆకలిదప్పులుగలిగి ఆశపాత్రులగు యక్షులు జనించి తండ్రియగు బ్రహ్మదేవుని శరీరభక్షణ సేయుట కుద్యమించగా అప్పుడు జక్షతరక్షత యను మంత్రములు పఠించుచు ఆతనువు విడచె. అప్పుడు రాత్రి కాలంబయ్యె. మంత్రజపబలముచేత రక్షులోకతెగగా బుట్టి వచ్చి యక్షులను ఆతురతమాన్పి మన కాధారుడగు తండ్రిని భక్షించగా మనలను రక్షించిపోషించువారెవరని బోధించగా మాకు తెలియక ఆయత్నము చేసితిమని బుద్ధులు మార్చుకొని సమభావంబున సమాధానపడి బ్రహ్మదేవునకు విధేయులై యుండిరి. బ్రహ్మదేవుని యభిమానముచేత అభివృద్ధి యగుచుండిరి.

## దేవతోత్పత్తి

యక్షులకు వెరచి భయపడి తనువువిడచి మరియొక దివ్యదేహము ధరించి ఆ తనువునందు తేజఃపుంజకళామాత్రము

లుగా సూక్ష్మదేహములచేత దేవతుల బుట్టించి ఆ దేహము విడువగా యహోరాత్రంబయ్యె.

## బ్రహ్మదేవుని ప్రథమావతారము

1 పద్మము 55 మహాఖర్వములనాడు బ్రహ్మదేవుండు కుమారవయస్సుగలిగి కౌమారాజ్యసర్గంబువహించి బ్రహ్మణ్యుండై కఠినబ్రహ్మచర్యంబు వహించె. యిది బ్రహ్మదేవుని ప్రథమావతారము. యీ యవతారమున మహాతపోవృత్తి నవలంబించి అప్పుడు తమోమయదేహుండై తన కాలి పిక్కలను మధించగా తామసగుణకామోద్రేకులగు రాక్షసులు బుట్టి వారు అజ్ఞానమూర్ఖులై కామోద్రేకులై ఆవేశమున మేఢ్రములు విజృంభించుకొని తండ్రియగు బ్రహ్మదేవునిపైబడి నానావిధమూఢప్రసంగములతో దూషింపుచు నుండ జూచి బ్రహ్మదేవుం డదరి విష్ణుదేవునికడకు పోగా నీ తనువు నింద నీయమైనది. అది విడువుమని సెలవివ్వగా బ్రహ్మదేవుఁడు ఆ తనువు విడువుమనగా ఆ తనువు విడచె. అంతట సంధ్యా కాలంబయ్యె. బ్రహ్మదేవుండు మరియొక తనువుదాల్చె. తాను విడచిన తనువునందు తామసబలముతో నొక స్త్రీ రూపంబు జనించి రాక్షసులపాలి కరుగగా ఆ సంధ్య యను స్త్రీయందు అధికమూర్ఖగర్వులై మదాంధకారమున సురత సుఖానందులై కాలము గడుపుచుండిరి. ఆ స్త్రీ యేలాటి అడ్డుచెప్పక ప్రతిసంభాషణాదికృత్యములు లేక యుండగా మాయకు లోబడి కామాంధకారమున వెర్రులై యుండుట జూచి ఆ భ్రమలో బడిపోయిరని బ్రహ్మదేవుండు సంతసించె.

## బ్రహ్మదేవుండు రాక్షసుల శపించుట

రాక్షసులు మదాంధకారులై నిర్భయులై సర్వులను తృణీకరించుటయు జ్ఞానహీనులై దుర్మార్గవృత్తులతో నుండుట దురాచారులగుటయు చూచి జారచోరులై నీచులై నిరంతర కఠినకష్టములతో నిత్యదుఃఖములతో కలహా కష్టములతో దరిద్రరోగకఠినాపదలతో అన్నపానములకాపన్నులై గ్రామ పురంబులకు దూరస్థులై కష్టజీవనులై యుందురని బ్రహ్మదేవుండు కఠినముగా శపించె. యీ కులమందు కొంతకాలము నకు తమకులము బడు కఠినాపదలుచూచి యొక సాత్వికుడు కొంతకాలముచూచి యోర్చలేక సాధువులు సజ్జనులు జ్ఞానవంతులు వీరి తెగల నాశ్రయించి మాకులముగతి యిట్లాయెనని మొరబెట్టగా నొక పుణ్యాత్ముండు నీకులము బ్రహ్మదేవున కపకారముచేసి బ్రహ్మఋషులను బాధించి బ్రహ్మచే శాపము బొందిరి గనుక వారిగతి అట్లుంచి నీగతి నీవు విచారించు కొనుమని చెప్పగా విని పరమభక్తుల చెంతచేరి భక్తిమార్గం బవలంబించి భగవదారాధనపరుండై మూడు సంవత్సరములు చేయుచుండగా కష్టములుతీరి నిష్ఠాచారములు వదలక చేయుచు కులమునకు దూరస్థుడై పరిశుభ్రముతో నుండగా, తమకులము వారు కొంతమందిచేరి తమకష్టములు చెప్పుకోగా సాత్వికులైన వాళ్లను కొంతమందిని నిల్పుకొని తమ కట్టుబాట్లతో నడిపించుకొను చుండగా కొందరు వచ్చి తమ కష్టములు చెప్పుకొనగా విని సహించలేక తదేకధ్యానపరుడై యుండి 12సంవత్సరములు చేయగా విష్ణువు ప్రత్యక్షముకాగా నా కులమునకు

యెప్పటికి కష్టములు తీరునని ప్రార్థించగా కలికాలనీచత్వము వచ్చినకాని నీకులమునకు మేలుకలుగదని వాగ్దత్తమిచ్చెను. అప్పుడు భక్తుడు కలి కాలధర్మము విమర్శచేయుమని ప్రార్థించగా కలికాలధర్మమును విమర్శచేసెను. యెట్లనగా.

## కలికాల ధర్మము.

శ్లో॥ ప్రాప్తం కలియుగం ఘోరం। ధర్మమార్గ వివర్జితం। పాషండాచారనిరతం। మ్లేచ్ఛస్వజనసంకులం॥ అవికాజినకార్పా సమయశాణ మయూనిచ। వస్త్రాణిచ కలౌప్రాప్తేన కౌశేయా నితు కృచిత్। లడ్డుమోదుక మండాది। పైష్టవం భక్ష్యం భవిష్యతి। అధర్మనిరతాక్రూరాః। చాన్యోన్యం కలహేరతాః। వృత్తిహేతో సదాధర్మ భార్యా పుత్రాది విక్రయాన్। కుర్వంతి వర్ణధర్మోవా। భవిష్యతి కలౌనహి॥ అను వచన క్రమమున.

తల్లితండ్రుల ఆజ్ఞదప్పుట, సోదరతిరస్కారములు, స్వజన వితండవాదములు, బంధువులతో పంతములాడుట, వైరములు బెట్టుకొనుట, సాధుసజ్జనులతో కలహించుట, కులతిరస్కారము, నీచసహవాసములు, జారత్వము చోరత్వము, జూదము లాడుట, కులహీన స్నేహములుచేయుట, సంకరులలో చేరుట ఆచారము విడుచుట, మృగములవలె పరులగర్జనచేయుట, పట్టుదలవదలక పంతములు బెట్టుకొనుట, పరుల దూషించుట, కొట్టుట తిట్టుట, అధర్మముగా లోబడుట, కృత్రిమములు చేయుట, కపటవృత్తులతో నుండుట, స్వకులాపకారము

చేయుట, అధర్మముగా భార్యబిడ్డల నమ్ముకొనుట, క్రూర బుద్ధులతోనుండుట, తురకలు పరకులస్త్రీలను చెరచుట, సంకరవృత్తులు మెండగుట, కలహములు ఘనముగా జూచుకొనుట, పౌరుషేయులగుట, మాయపట్టువస్త్రము లధికమగుట, శనగపిండిపదార్థము లధికముగ దినుట, మేహ వాత రోగులై, చింతించుట, శెగజాడ్యసవామేహము లధికమగుట, సంకరబుద్ధులగుట, చపలము లధికమగుట, కాఫీగింజల గంజినీళ్లు త్రాగుట, మందాగ్ని మేహదోషములతో నేత్రదృష్టి నశించుట, గుండె దుర్బలమగుట, అల్పాయుష్కులగుట, ప్రదరవ్యాధు లెక్కువగుట, బుద్ధిమాంద్యము, నోపికలేక పనులుచేయలేక దురాశతో లాభములు కోరుకొనుట, పరుల మోసము చేయుట, లంచములు దీసుకొనుట, నీళ్లు పాలు సమానముగ నమ్ముట, వ్యభిచార స్త్రీలవలన డబ్బుదీసి సుఖజీవనము చేయుట, పరులబిడ్డలను స్త్రీలను పరదేశమున అమ్ముకొనుట, వస్తువుల మార్పుచేసి లాభమున కమ్ముకొనుట, మోసగించుట, దొంగతనములు చేయుట, టగాకోరులై జేబులు గొట్టుటయు పూర్వము బలవంతుల శరీరమునందుండు ధనంజయవాయువు ప్రేతరూపములుగా నుండిన యీ ప్రాణులున్నూ ప్రస్తుతము జనవృద్ధియగుటచే అరణ్యములు నరి మృగముల జంపుటచేత ఆ మృగప్రాణులును పైనవ్రాసిన ప్రేతములున్నూ పూర్వము పరులపీడించు గుణములు పోక జారచోరులై దురాశదుర్బుద్ధులతో దొంగలు మోసకారులై పుట్టి కలికాలమున ప్రచారము జరుపుచుండిరి.

ఇట్టి దుర్గుణములుగల కలికాలమున మీా కులము సుఖించునని భక్తునకు సెలవిచ్చి వెళ్లిపోయెను. యీా భక్తుడు చూచుచుండగా కాలక్రమంబున యుగధర్మము మారి పై దుష్టవర్తనలు ప్రబలినం జూచుచుండగ దార్లుగొట్టుట, అడవులు, కొండలు, వనములు, యెడారులలో హత్యలుచేయుట, జారచోరత్వములు, జూదములు, చీట్లాటలు, పందెములు, మోసములు, జేబులుగొట్టుట, షావుకార్లవలె వేషములు వేసి గిల్టువస్తువులతో మోసగించుట, స్నేహమున అప్పుదీసుకొని కలహములు బెట్టుకొనుట చూచి వ్యాజ్యములాడుట, కత్తిరించుట. ఇట్టి దుర్మార్గముల వలన ప్రజ్వరిల్లగా భక్తుడు మంచికాలము వచ్చుచున్నదని సంతోషించెను. కులమును బాగుచేసినను అతనిపద్ధతిని మాని పరమతముపాలైరి. అతని కష్టములు నిష్ఫలము లాయెను.

గంధర్వాప్సరోత్పత్తి

బ్రహ్మదేవుండు రాక్షసుల సృష్టించిన తనువువదలి మరల దివ్యదేహము ధరించి సుగంధస్వరూపుండై తన హస్తముల నాఘ్రాణించి మనోధ్యానమున నుండగా అప్సరసలు గంధర్వులు జనించిన వారలు త్రిలోకసంచారులుగా నిత్యభోగులుగా నుండునట్లు ఆజ్ఞాపించి అప్పుడు తన తనువును విడువ వెన్నెలకాలంబయ్యె.

పిశాచోత్పత్తి

బ్రహ్మదేవుండు రోగమయ తంద్రోన్మాదరూపంబగు తనువు ధరించి ఆవులింతలతో నిద్రమత్తుగల శరీరము ధరించిన

ఆ తనువునందు పిశాచులు గుహ్యకులు సిద్ధగణములు బుట్టిరి. వారలంజూచిన దిగంబరులు ముక్తకేశులు కాగా వారలం జూచుటకు సహించక నేత్రంబులు ముకుళించుకొని శరీరము విడచె. ఆశరీరమును పిశాచులు గ్రహించి భక్షించిరి. అది మొదలు పిశాచులకు శవభక్షణచేయుట మొదలుగా ప్రాణి పోయినచోటున 2-ఘడియలకంటె శవమును వుంచిన పిశాచులు శవముపై వ్రాలగా ఆఇంటివారికి సకలారిష్టములు గల్గును. రోగములు, కష్టములు వచ్చునని శవమును చోటు దప్పింతురు. యిది లోకానుభవము.

## జీవుల కన్నప్రాప్తి

బ్రహ్మదేవుండు మరియొక తనువుదాల్చి పిశాచులు శవభక్షణకారణమున అన్నమును తృప్తిచేయుదలంచి అన్నవంతునిగా ధ్యానముచేయగా అన్నాదిపదార్థము లుత్పత్తి యయ్యె. యీ యన్నభక్షణ మరిగి అది కారణముగా రోగారిష్టములు వచ్చిన సమయమున భూతప్రేతపిశాచులు మానవుల నావేశించి బలులు బెట్టించుకొని వదలిపోవుచుందురు. అంతట ఆరోగ్యము గలుగుచుండును.

## పితృదేవతా సాధ్యగణోత్పత్తి

బ్రహ్మదేవుండు పిశాచగణసృష్టి యనంతరము తనువు విడచి పరిశుద్ధదేహము ధరించి అన్నాదుల సృష్టించి తదుపరి అదృశ్యదేహుండై స్థూలతనువులు లేని, సూక్ష్మదేహులై

మానవుల కదృశ్యశరీరులై కనుపించకుండునట్లు పితృదేవతలను సాధ్యగణములను సృష్టించె. అట్టి సూక్ష్మదేహులకు బలులు దానంబులు సేయుటకు ఆధారముగా కర్మకాండమును సృష్టించె. ఆకర్మకాండ చట్టప్రకారము జరుగనిచోట్ల వ్యాపించి బలిదానంబులు దీసుకొని భూతములు సంతోషించునట్లు అజ్ఞ గలిగె. ఇవె శ్రాద్ధబలిదానములు దేవతలకు యజ్ఞజపపూజా క్రమంబులు జరుగునట్లు విధించె. ఇట్లు దేవతాదులకు హవ్య కావ్యముల నిచ్చిన మానవులకు క్షేమకరము గలుగునట్లు ఆజ్ఞనిచ్చె.

## నర విబుధ కిన్నరోత్పత్తి

బ్రహ్మదేవుండు అదృశ్యతనువుచేతనే పితృసాధ్యగణ సృష్టియైన తదుపరి ఆదేహముతోడనే నరులను, విబుధులను, సిద్ధులను, కిన్నరులను, సృష్టించి వారికి అదృశ్యశరీరముల నిచ్చె. యీకిన్నరకింపురుషగణములకు 2–శరీరములు రెండే కాళ్లున్నూ గలవు. వీరు మహాబలవంతులు. వీరు బ్రహ్మదేవుని ప్రతిబింబశరీరముల బుట్టుటచేత బ్రహ్మదేవునిపేరట నిత్య గీతములు బాడుచూ గానము చేతురట. యీ గణదేవతలకు మంత్రములు గలవు. యీ మంత్రములు జపించినవారికి పై ప్రకారము 2–శరీరములు రెండేకాళ్ళు బలమగు ఆకారము లతో దరిశెనము లిచ్చియుండుటచేతను వారు నృత్యాదులు సల్పుటయు ఇవి సత్యము.

## మునిఋషిగణోత్పత్తి

బ్రహ్మదేవుండు తదుపరి సంతతి వృద్ధిబొందలేదని సంశయించి శయనించి ఆలోచించుచూ మనోచింతనపూర్వకముగ ధ్యానపరుడై కరచరణంబులు కదలింపుచు నుండగా కాలి పిక్కలయందుండు రోమంబులు రాలి ఉగ్రసర్పాకారములవలె తీవ్రముగా చరించుచుండ వాటింజూచి కృతకృత్యుండనైతినని ఆత్మదృష్టితో నాలోచించి మనంబున నూహాచేసుకొని ఆరోమములను జగత్పావనులను బ్రహ్మఋషులను త్రిలోక పావనులను అధిపతులను సృజించి వారికి తగిన పురుష రూపంబులగు దేహంబుల నిచ్చిన యింతకుముందు జనించిన వారందరు చేరి యేకమనస్కులై భేదంబులేక బ్రహ్మదేవుని చే నేర్పరచిన విస్తారసుకృతములుగా ఆశ్చర్యముగా నుండు యజ్ఞకాండ మవలంబించి విధేయులై చేయుచు యీసర్గము సృజింప అందరికి హవిర్భాగంబులు పంచియిప్పించుచుండగా వీరందరు బ్రహ్మదేవుని కొనియాడుచు పరమానందమున నుండగా బ్రహ్మదేవుండు సంతసించె.

## మునులు మహాత్ములు సృష్టి

బ్రహ్మదేవుండు తపోయోగవిద్యాసమాధి యుక్తంబగు చర్యనుండి సృష్టిచేయగా ఋషివేషధారులు హృషీకాత్ములు మహామునులు ఋషిగణంబులు యీ గణంబుల సృష్టించగా వారు నిత్యసమాధియోగైశ్వర్య తపోయోగవిద్యావిరక్తంబైన ఆత్మీయశరీరముల వారికిచ్చిన వారు ఒక్కొకనికి

బ్రహ్మైక్యంబు చేయు మార్గంబున కాజ్ఞగలె. అందు నాలుగు పదవులు గలవు. అవి యేవియనగా— సాలోక్యము, సామీ ప్యము, సారూప్యము, సాయుజ్య పదవులు నాల్గింటికి తామస భక్తి, రాజసభక్తి, సాత్వికభక్తి, అనన్యభక్తి, యోగముతే కారణములు. అట్టి మహాత్ములు యితరకర్మాపేక్షలు లేక సర్వకర్మలుమాని నిజమనోరథఫలదాయకములగు దినాక్యం తిక భక్తియోగంబున నుండు త్రిగుణరహితులగు మహాత్ములు మత్సమానాకారులు అగుదురని బ్రహ్మదేవుం డాజ్ఞయొసంగె.

## దేవతావ్రత నియామకములు

ఇట్లవతరించబడిన చతుర్దిశాధిదేవతలు అనగా తూర్పున భద్రాశ్వవర్ష హాయగ్రీవస్వామిని దక్షిణదిశ భారతవర్ష కూర్మా వతారుని పశ్చిమదిశ కేతుమాలవర్ష వరాహరూపుని ఉత్తర దిశ యిలావృతవర్ష మృత్యుంజయస్వామిని యీ అధిష్టాన దేవతలను పూజించి జపించి ధ్యానించి పర్వతిథులయందు హోమయజ్ఞములచేత అర్చనాదివిధులు, వ్రతదీక్షలు, సమా రాధనములు జరుపుచు నిత్యనియామకములతో జరుగునట్లు విధించి యీ అధిదేవతలను నిత్యార్చనలు చేయుటకు నవ బ్రహ్మలు, బ్రహ్మఋషులు, మహామునులు, సప్తవాయుప్రభృతి దేవతలు, సప్తఋషులు, సరస్వతి, లక్ష్మి, పార్వతులు మొద లగు స్త్రీ దేవతలు బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, ఇంద్ర, సూర్యా దులు యక్ష, రక్ష, రాక్షస, గంధర్వ, అప్సరోగణంబులు శివుడు, నందికేశ్వరుడు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు,

సూర్యచంద్రాగ్ని, యమ, నైరుతి, వరుణ, వాయు, కుబేర, ఈశాన్యులు, అశ్వినీదేవతలు, శచి, స్వాహా, శ్యామలా, దీక్షా, కాళికా, అంజనీ, చిత్రరేఖాది స్త్రీదేవతాతండములు గుహ్యాక పిశాచ సిద్ధగణంబులు పితృసాధ్యగణములు కిన్నర కింపురుష గణంబులు నర విబుధగణంబులు మహాత్ములు ఋషులు మునులు బ్రహ్మైక్యసంధానపరులు సర్వలోకస్థులు స్నాన, సంధ్య, జప, తప, హోమ, సమారాధనలు, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధి అష్టాంగయోగములు విధివిధానములు త్రికాలముల యందును జరుగుట విధించి మేరుమందర కులాచలముల యందును తూర్పుదిశ ఇంద్రుని నందనవనమందును దక్షిణ మున యముని సర్వతోభద్రమందును పశ్చిమమున వరుణుని వైభ్రాజికమునందును ఉత్తరమున కుబేరుని చైత్రరథమందును యీవనములందు తపోవంతులై సాధించినవారి కష్టసిద్ధులు పొందుటకున్ను సాంఖ్య, తారక, అమనస్క, యోగులును మేరుపర్వతాగ్రచతుర్ద్వార తూర్పుశీతనదీ దక్షిణ అలకనంద పశ్చిమ ద్వారచక్షునదీ ఉత్తర భద్రానదీ ప్రవాహముల స్నానాదిపరిశుద్ధులగుటకు వసతులు నిర్ణయించె మరియు.

## దేవతావిహారములు–ఆహార పానములు

మందరాచలమున మామిడిపండ్లరసప్రవాహమున్నూ అందు స్నానపానంబులు చేయువారలకు నిరంతరజరామరణం బులులేక చిరంజీవులగునట్లున్నూ గంధమాదనపర్వతంబున

జంబూఫలరసప్రవాహమున అనగా గజప్రమాణఫలములు గలిగి తద్రసంబు ప్రవాహంబుగా బారుచుండు. యీఫలరస స్నానంబులచేత బంగారుచ్ఛాయగల శరీరములు గలిగి ముదిమి లేక చిరంజీవులుగా 10వేల యేండ్లు జీవించగల శక్తియు దేవత్వము వచ్చుటయు యీ రసస్పర్శచేత మేరుపర్వతమం తయు సువర్ణమయమై యుండు.

కింపురుషవర్షమున జువ్విపండ్లరసంబున స్నానపానం బులు చేయగా చిరంజీవత్వము ఆయురారోగ్యములు 10వేల సంవత్సరము లాయుర్దాయములతో బలారోగ్యంబులుగలిగి సుఖభోగంబులతో నుందురు. పరమేశ్వరధ్యానంబున గీతా గానంబుల నోలలాడుచుందురు.

హరివర్షంబున చెరుకురసపానంబుచే ఆయురారోగ్య తేజస్సులు గలిగి యుండును. సుపార్శ్వపర్వతంబున మకరంద పానంబుచేత ఆహారపానంబులవలన ఆయురారోగ్య తేజోబలం బులు గలిగి యుండు సిద్ధత్వమున్నా గల్గును.

కుముదపర్వతమునందు వటవృక్షములయందు శాఖల వలన దధిపానంబును క్షీరపానంబును మధుపానంబును మక రందపానంబును ఘృతపానంబును గుడవిశిష్టపానంబులు విశిష్టా న్నంబులు వలన సంతుష్టులగుచు శయన, ఆసన, వస్త్ర, ఆభరణ, సర్వాభీష్టపదార్థములు కల్పించి సకలేష్టార్థములు జరుగునట్లు సృష్టించె.

వారణ్యాయవర్షమున స్వర్ణతామర పుష్పంబులు భక్షణచేయువారికి ఆయురారోగ్య తేజోబలవయఃకామంబులు గలిగి శరీరపరిమళసుగంధములతో దేవతాహంశగలిగి పదివేల వత్సరములు ఆయుర్దాయంబుగలిగి అష్టవిధభోగంబులు సాధించుకొనుటకు తనివిదీర అనుభవించుటకు సుఖించు పరమానందంబున నోలలాడుచు కాలముగడపుచు పవిత్రమగు దేవతారాధనలతో నిత్యసంతర్పణాములతో దేవతావరంబులతో నిత్యసుఖభోగంబుల ప్రకాశింపుచుందురు. వారనుభవించు యోగభోగంబు లనుభవించి చేసినపుణ్యము నశించిన తర్వాత శ్లో॥ క్షీణేపుణ్యే మర్త్యలోకే విశంతి యను సూత్రము వలన నవవర్షములయందు దేవతాసంఘములున్నా పుణ్యము నశించి పిమ్మట క్రమంబులువిడచి అక్రమంబులకులోనై సుఖభోగంబులకాశించి భారతవర్షమున జనించి లోకమోహితులగుచుందురు. బ్రహ్మ విష్ణు ఈశ్వరులు యుగయుగంబునకు అవతారమూర్తులై షట్కర్మలు అష్టాంగయోగములు మంత్రలయ హఠయోగంబులు సాంఖ్యతారక అమనస్కంబులు సమాధినిష్ఠాక్రమంబులు బోధింపుచు కడతేర్చుచుందురు.

ఈశ్వరుండు అఖిల బ్రహ్మాండ స్వర్గ, మర్త్య, పాతాళ నవవర్ష సప్తద్వీపచతుర్దశభువనమధ్యస్థ ఇలావృతవర్ష మధ్యస్థ బ్రహ్మపట్నాధీశ్వరుండై పరమశివుండు శివశక్తిమయాత్మకుండై బ్రహ్మదేవుండు మొదలు జీవాదిపిపీలికాపర్యంతము సకలజీవులు తానై 'మహాత్మా సర్వభూతాత్మా' యను సూత్రమున సర్వము తానై సర్వజీవస్వరూపములచేత అర్చింప

బడుచు సర్వలోకపూజ్యుండై స్థిరనివాసంబునందుండి నిత్య పూజావిధానంబులు గడిపించుకొనుచుండు.

## పార్వతీశాపము

పార్వతీదేవి అచ్చట నొకకాసారమందు స్త్రీజనసహస్రాదృంద ములతో స్నానపానములుచేయుచు పూజాక్రమంబులు నడుపుకొనుచు ఆకాసారప్రాంతమునకు యెవరైనా పురుషులు వచ్చి స్నానముచేసినయెడల స్త్రీలై పోదురని శపించగా యీ విషయము దెలియక చంద్రుండచటికిపోయి స్నానము చేయగా స్త్రీయై అచట తిరుగుచుండగా విష్ణుమూర్తి అస్త్రీని కామించి రమించగా హరిశ్చంద్రుడు బుట్టె. అంతట కాసారమున స్నానముచేసి పొమ్మని శెలవిచ్చి విష్ణుమూర్తి వెళ్ళిపోయెను. ఆకాసారమున స్త్రీలు స్నానముచేసిన పురుషులుగాను పురుషులు స్నానముచేసిన స్త్రీలగు కారణమున ఆ స్త్రీ స్నానము చేసి యప్పటివలె చంద్రుడై యథాస్థానమునకు చేరెను. ఆ ప్రాంతమున తిరుగుచుండు త్రిశంఖుడు ఆ చిన్నవానిని హరిశ్చంద్ర నామమున బిలుచుచు పెంచుచుండె. ఆకొలనులో స్నానముచేయుచు పరమశివుని పూజించుచు జపధ్యానముల చేత భక్తిపరవశుడై పరమానందంబున నోలలాడుచుందురు. ఆపరమేశ్వరానుగ్రహమున సకలాభీష్టసిద్ధులతో సుఖభోగం బులం దనియుచుందురు. అని శివపురాణ మార్కండేయ పురాణ బ్రహ్మాండ బ్రహ్మపురాణ భాగవతప్రమాణములతో ఇత్యాది విమర్శలుగల దేవతాసర్గ సృష్టివివరణము ఇది ప్రాకృత సృష్టివివరణ సంపూర్ణము.

శ్రీ సద్గురుదేవార్పణమస్తు॥

# సాంఖ్యసూత్రవివరణము

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మా। తస్మై శ్రీగురవే నమః
శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తయేన చరాచరం।
తత్పదం దర్శితంయోగం తస్మై శ్రీగురవే నమః॥

## వైకృత మానవాది జీవసృష్టిక్రమము

నిరామయ నిరంజన నిర్గుణ పరబ్రహ్మమే పరమాత్మ యీ పరమాత్మయందు మాయ ఆవరించుటవలన నిర్గుణ బ్రహ్మము సగుణమాయాశబలిత విరాడ్బ్రహ్మంబయ్యె. ఆ విరాట్టునందు పంచాక్షరి బుట్టె యీపంచాక్షరివలన బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, ఇంద్ర, సూర్యాదులు, బుట్టె యీ పంచ మూర్తులవలన పంచతన్మాత్రలు జనించె. హ, య, ర, వ, ల, యను పంచతన్మాత్రలవలన హకారమున ఆకాశము, యకార మున వాయువు, రకారమున, అగ్నియు వకారమున జలము లకారమున భూమియు యీ పంచభూతములు యేర్పడి యీ భూతములతో భూమియందు కొండలు వృక్షములు జలము వలన నదీసముద్రములు అగ్నియందు నవరత్నలోహపాషాణ ఖనిజాదులు వాయువువలన వృక్షాదులు జడజీవులు ఆకాశ మున సర్వవిజ్ఞానజీవులుగా సృష్టినిగల్పించె. జీవాది సృష్టివివ రము యీ పంచకృత పంచీకరణమువలన వరుసగా దెలియును. యీపంచీకరణ యీక్రింద వివరింపనగును. అదిచూచిన సర్వ

గ్రాహ్యమగును. పంచభూత తత్వముల వివరము యెట్లనగా బ్రహ్మసృష్టిరహస్యవిధానమంతయు చర్మాచరూపము.

## సూక్ష్మపంచీకరణ పద్ధతి

అధోపంచాకారములు=(ం)-(౧)-(౧)-(/)-(ు)-(ంౢ) శక్తి
ఊర్ధ్వపంచాకారములు=(౧)-( )-(ు)-(ు)-(ం)-(ఓం) శివుడు
పంచాక్షరి=((య))-వ-శి-మ్ర-న పంచాక్షరి భూతాకారములు
పంచబ్రహ్మలు=(సూ)-(ఇం)-(ఈ)-(లి)-(బ) అధికారస్థానములు
పంచతన్మాత్రలు (శ)-(స్ప)-(రూ)-(ర)-(గం) జగద్బీజములు
పంచభూతములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశం | ఆకాశార్థం జ్ఞానజీవుడు ను 1 | ఆకాశంలో వాయువు మనస్సు చంద్రుడు | ఆకాశంలో అగ్ని — బుద్ధి బ్రహ్మ | ఆకాశంలో జలం—చిత్తం విష్ణువు | ఆకాశంలో భూమి అహంకారం శివుడు |
| వాయువు | వాయువులో ఆకాశం సమాన వాయువు | వాయువర్థం వ్యానం ను 2 | వాయువులో అగ్ని ఉదానం | వాయువులో జలంప్రాణం జీవనివాసం | వాయువులో భూమి అపానం |
| అగ్ని | అగ్నిలో ఆకాశం — శ్రోత్రం 8—దిక్కులు । | అగ్నిలో వాయువు చర్మం 5 వాయువులు. | అగ్ని అర్థభాగం నేత్రం ను3 సూర్య | అగ్నిలో జలం జిహ్వ 6 రుచులు, వరుణుడు | అగ్నిలో భూమి ఆఘ్రాణం జీవసంచారం |
| జలం | జలంలో ఆకాశం — శబ్దం 10 విధంలు | జలంలో వాయువు స్పర్శంలు 3_ | జలంలో అగ్ని 6 రుచులు 5 — రూపంలు | జలార్థంరసం ను 4 | జలంలో భూమి గంధం 3 విధంలు। |
| భూమి | భూమిలో ఆకాశం — వాక్కు వచనంలు | భూమిలో వాయువు పాణి । సర్వ కర్మలు । | భూమిలో అగ్ని । పాదం గమనం। | భూమిలో జలం — వుపస్థ—సంగమం | ।పృధివ్యార్థం గుదం విసర్జన ను 5 |

## పంచీకరణమునందు పంచతత్వ విమర్శలు

### ఆకాశతత్వమునందు–జీవుడు–అంతఃకరణము

ఆకాశార్ధభాగము జీవుడై తక్కిన అర్ధభాగము 4 భాగములై 1 భాగము వాయువుతోగలసి మనస్సుగాను, ఒక భాగము అగ్నితోగలసి బుద్ధిగాను, ఒక భాగము జలముతో గలసి చిత్తముగాను ఒక భాగము భూమిలోగలసి అహంకారముగాను యీ 4నుం గలసి అంతఃకరణమై జీవునకు సాహాయ్యభటులవలె సకలకర్మల చేయించ సమర్థుడనిపించి యీజీవుని మాయయనియు యెరుకయనియు జ్ఞానమనియు జ్ఞాతయనియు నామములు గలిగి, యీజీవుడు మనస్సుతోచేరి కోరికలం కోరుకొనుటయు బుద్ధితో చేరి ఆలోచన స్థిరపరచుటయు చిత్తముతో చేరి చింతించుటయు అహంకారముతోచేరి సాహసకర్మలు చేయుటయు ననుధర్మకర్మలు చేయుచుండును.

### వాయుభూతమున పంచప్రాణములు

వాయుభూతమున ఒకభాగము వ్యానవాయువై రెండవ భాగము 4 భాగములై యొకభాగము ఆకాశభాగమునగలసి సమానవాయువుగాను, యొకభాగము అగ్నితోగలసి యుదానవాయువుగాను, యొకభాగము జలభాగమునగలసి ప్రాణవాయువుగాను, నొకభాగము భూమినిగలసి అపానవాయువు గాను యేర్పడి యీపంచప్రాణములు జీవునకు సాహాయ్యముగా నుండి కాలకర్మధర్మములు నడుపుచుందురు. జీవునకు సుఖ

దుఃఖములకు కారణము గల్పించ కర్తలై యుందురు. కర్మ ఫలితార్థము లనుభవింపజేసి ముగించుచుందురు. యీ పంచ ప్రాణములు బలోద్రేకమునకు సాహసులై యుందురు.

## అగ్నిభూతమున జ్ఞానేంద్రియములు

అగ్నిభూతము అర్ధభాగము నేత్రమై తక్కిన అర్ధభాగము 4 భాగములై యొకభాగము ఆకాశభాగమునగలసి శ్రోత్రముగాను, యొకభాగము వాయుభాగమునగలసి త్వక్కుగాను, నొకభాగము జలభాగమునగలసి జిహ్వగాను, ఒకభాగము భూమిని గలిసి నాసికముగాను యేర్పడి జ్ఞానేంద్రియ పంచకంబయ్యె. యీజ్ఞానేంద్రియముల ద్వారా చెవులతో వినుట సుశబ్దాపశబ్దము లాలకించుట చర్మము ద్వారా ఆలింగనాది ఉష్ణశీతల మృదుస్పర్శల దెలియుటయు నేత్రములతో పంచ రంగులు దెలియుటయు జిహ్వతో మృదుకఠినసంభాషణలు షడ్రసములు గ్రహించుటయు నాసికమువలన గంధములం దెలియుట ననుధర్మకర్మములతో కాలము గడుపుచుండు.

## జలభూతమువలన పంచతన్మాత్రలు

జలభూతము రెండుభాగములై యొకభాగము రసమై రెండవభాగము 4 భాగములై యొకభాగమాకాశమున గలసి శబ్దముగాను, నొకభాగము వాయువునుగలిసి స్పర్శముగాను, నొకభాగము అగ్నినిగలిసి రూపముగాను, నొకభాగము భూమిని గలిసి గంధముగాను యీపంచతన్మాత్రలు జ్ఞానేంద్రియమునకు విషయంబులుగా నుండి కర్మజన్యకారణముగా నుండు.

## భూభూతము-కర్మేంద్రియములు

భూభూతము రెండుభాగములై యొకభాగము గుద స్థానమై తక్కినఅర్ధభాగము 4 భాగములై యొకభాగము ఆకాశమున గలిసి వాక్కుగాను, యొకభాగము వాయువును గలసి హస్తముగాను, యొకభాగము అగ్నిభాగమునుగలసి పాదముగాను. యొకభాగముజలభాగమును గలసి యుపస్తగాను, కర్మేంద్రియ పంచకం బేర్పడి వాక్కుతో ప్రసంగించుట, చేతులతో సర్వమైనపనులు చేయుట, పాదములతో సంచారము చేయుట, వుపస్థతో సంగమించుట-మూత్రవిసర్జనచేయుట, గుదస్థానమున మలవిసర్జనచేయుట, సర్వమైనచోట్ల కూర్చుని యుంచుట ననుకర్మధర్మములు చేయుచుండును.

## 24 తత్వముల వివరము

ఆకాశతత్వమువలన జీవుడు అంతఃకరణమున్నూ వాయువువలన పంచప్రాణములున్నూ అగ్నివలన జ్ఞానేంద్రియ పంచకమున్నూ జలమువలన పంచతన్మాత్రలు భూమివలన కర్మేంద్రియములున్నూ 24 తత్వములతో కూడిన జీవుని ధర్మ కర్మప్రచారం బెట్లనగా.

## జీవుని ధర్మకర్మ ప్రచారములు

యీజీవుడే మనోరూపుడై సమానవాయువుతో చేరి శ్రోత్రేంద్రియము ద్వారా శబ్దముయెరిగి వాక్కువలన వచింపు చుండు యీజీవుడే మనోరూపుడై, వ్యానవాయువుతో చేరి,

త్వగింద్రియముద్వారా స్పర్శదెలిశి పాణి అనగా హస్తముల వలన యిచ్చిపుచ్చుకొనుచుండును. యీజీవుడే బుద్ధిరూపుడై ఉదానవాయువుతోచేరి నేత్రమువలన పంచరంగులవర్ణములం దెలిశి పాదమువలన గమనాగమనము చేయుచుండు యీ జీవుడే చిత్తరూపుడై ప్రాణవాయువుతోచేరి జిహ్వేంద్రియము ద్వారా రసమునుగుర్తెరిగి వుపస్థవలన ఆనందము చెందును, సంగమించును. యీజీవుడే అహంకారమునచేరి అపాన వాయువుద్వారా ఘ్రాణేంద్రియము వలన సుగంధదుర్గంధముల నెరిగి గుదమువలన మలమూత్ర విసర్జనలు చేయుచు ఇవి స్థూలదేహజీవుని ధర్మకర్మములు. సంకల్పవికల్పధర్మకర్మల వలన జీవునకు ప్రారబ్ధివశమున జన్మ లేర్పడును.

## 96 తత్వముల వివరణము

శ్లో॥ పంచైతాని, దశేంద్రియాణి, విషయాప్రాణాది, షట్సుక్రమాత్ । రాగాద్యాః కరణాష్టడశ్చవిషయాన్ । సప్తాద్య మిధాతవః। నాడీమండల మీషణాత్రయగుణా। వస్త్రాశ్చ తాపత్ర యాన్। కోశాః పంచతనుశ్చషణ్ణవతికం తత్వాని జీవాత్మనః॥ జీవబ్రహ్మ సంకల్పరూపసిద్ధిగల ప్రారబ్ధికర్మసంభూత। జీవునకు స్థూలతనువు. 1 సూక్ష్మతనువు తాను యీ 2 కలిసి తనువులు 2 స్థూలతనువునందు 96 తత్వములని ప్రసిద్ధి. యీ జీవునకు సాహ్యప్రచారములగు మనస్సు బుద్ధిచిత్తము, అహంకారము లను అంతఃకరణములు 4 న్నూ యీజీవునకు స్వేచ్ఛాసంచార స్థానములగు అపాన-ప్రాణ-ఉదాన-వ్యాన-సమానము 5 న్నూ

కర్మవ్యాపారాధారములగు శ్రోత్ర-త్వక్-చక్షుర్జిహ్వా, ఘ్రాణం బులగు జ్ఞానేంద్రియములు 5న్నూ కర్మవిజృంభసాహాయులగు ఉపవాయువులు అనగా– నాగ, కూర్మ, కృకర, దేవదత్త ధనుంజయము లనునవి 5న్నూ, తన్వాధారములగు ఆకాశ, వాయు, అగ్ని, జల, భూములు అను పంచభూతములు 5న్నూ, కర్మజన్యసంభూతమగు వాక్కు, పాణి, పాదము, ఉపస్థ, వాయువు అనుకర్మేంద్రియములు 5న్నూ, ఇంద్రియ విషయములగుచుండు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లను తన్మాత్రలు 5న్నూ, జీవునకు సంతోషమునిచ్చు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను పంచకోశములు 5న్నూ, అధిదేవతలగు ఆధారమున గణపతి స్వాధిష్టమున బ్రహ్మ, మణిపూరమున విష్ణువు, అనాహాతమున ఈశ్వరుడు, విశుద్ధమున మహేశ్వరుడు, ఆగ్నేయమున సదా-శివుడు, సహస్రారమున విరాట్పురుషుడగు పరమాత్మ, యీసప్తస్థానములయందు స్థిరులై యుందురు. సహస్రారము గాక షట్చక్రములని ప్రతీతిగ జెప్పుచుందురు. ఇవి 6న్నూ

సప్తధాతువులు శరీర ఆద్యంత ధాతువులు రసము, రక్తము, మాంసము, నరములు, శల్యములు, మజ్జ యను మూలగలు, మేధస్సను క్రొవ్వు, శుక్రము యీ 7న్నూ.

దశనాళములు 10 ఇడ యెడమ చంద్రనాడి పింగళ 1 కుడిసూర్యనాడి, 2 సుషుమ్న, 3 గాంధారి, 4 హస్తిని, 5 పూషా, 6 పయస్విని, 7 అలంబస, 8 శంఖిని, 9 కుహూ, 10 శినివాలి నాడులు 10 న్నీ, పంచమలములు 5 అంతఃకరణ మాలిన్యములగు ఆణవ, కార్మిక, మాయిక, మాయేయ, తిరోధానములు, మనోబుద్ధులయందు కలుగు వ్యత్యాసగుణ ములు ఇవి జ్ఞానభంగములు 5న్నూ.

పంచావస్థలు జాగ్రత్, స్వప్న, సుషుప్తి, మూర్ఛ, మరణము, యీజీవునకు ప్రధాన ధర్మములు 5న్నూ.

రాగాదులు 8- కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, దర్పము, డంబము యీ 8 అజ్ఞానవికారములు.

త్రిగుణములు 3- సాత్వికము, రాజసము, తామసము, ఇవి జన్మలకు స్వాభావికగుణములు 3న్నూ.

మండలత్రయములు 3- మోక్ష, స్వర్గ, నరకమార్గ ములు, అగ్నిమండలము మోక్షము, సూర్యమండలము స్వర్గము, చంద్రమండలము నరకము, ఇవి 3న్నూ.

రోగములు 3- వాతరోగము. పైత్యరోగము, కఫ రోగము, ఇవి సంవత్సరమునకు యీ 3 దోషములు మాన

వులను అజ్ఞానదోష, కాలదోష, పదార్థదోషముల సాహాయ్య
మున వేధించుచుందురు ఇవి 3న్నూ.

తాపత్రయములు–అధ్యాత్మిక తాపమనగా–వాతపిత్తకఫ
రోగములచేత వేధింపబడుట. అధిభౌతికమనగా క్రిమికీటక
మృగాదులవలన గలిగిన బాధయు అధిదైవిక తాపమనగా
వానగాలి పిడుగులు. మొదలగు వాటివలన గలిగిన బాధలు
ఇవి 3న్నూ తాపత్రయములు.

ఈషణాత్రయ మనగా ధనేషణ ధనమందాశ, పుత్రేషణ
పుత్రులయందాశ, దారేషణ భార్యలు, స్త్రీలయందాశ. ఇవి
3న్నూ ఈషణాత్రయబంధకములు 3న్నూ కలిసి 96 తత్త్వము
లని ప్రసిద్ధి.

## స్థూలపంచీకరణము

స్థూలశరీరమున గల 63 తత్త్వములతో పంచభూతముల
వలన నేర్పడిన 36 తత్త్వములని కొందరు, 24 తత్త్వములని
కొందరు విభజించియున్నారు. యీ తత్త్వములు తమను
తాము తెలియలేవు. ఇవి జడములు. వీటిని తెలియు వొరు
కయే జీవుడు. యీ స్థూల శరీరికి కలుగు లక్షణములు.

## స్థూలదేహతత్వములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశము అహంకారము | పరుగెత్తుట | ఆకలి | మజ్జ | పృథివి అర్ధభాగము అస్థి గు 5 | పృథివి |
| సిగ్గు | వుండుట | దప్పి | మూత్రము జలార్ధము గు 4 | మాంసము | జలము |
| భయము | ముడుచుట | అగ్నిఅర్ధము నిద్ర గు 3 | చెమట | చర్మము | అగ్ని |
| లజ్జ | నడుచుట వాయువర్ధము గు 2 | మైధునము | రక్తము | నరములు | వాయువు |
| మోహము ఆకాశార్ధము గు 1 | నిలుచుట | ఆలస్యము | శుక్లము | రోమములు | ఆకాశము |

## స్థూలదేహజీవుని ధర్మకర్మములు

స్థూలదేహమునందుండు తత్వములు, జడములు. జీవుడను ప్రభువు పృథ్వీతత్వము ననుసరించి సంచరించునపుడు సప్తద్వీపచతుర్దశభువన జంబూద్వీప భరతఖండమున 56 దేశక్షేత్ర సంచారాభిమానము, ఆయాలోక చరిత్రాభిమానము గలుగును. యీ జీవుడు జలతత్వమునందు సంచ

రించునపుడు గంగాది పుణ్యనదీస్నానములయందు కోర్కెలు గల్గును. యీ జీవుడు అగ్నితత్వసంచారము చేయునపుడు పంచాగ్నుల ప్రభావములు వినుటయు హోమాదికార్యము లకు వెళ్లుట తటస్థించును. యీ జీవుడు వాయుతత్వమునందు సంచరించునపుడు ప్రాణులయందభిమానము వాయుసంబంధ విషయవిచారణయు గల్గును. జీవు డాకాశతత్వమున సంచరించు నపుడు అద్వైతవిద్యావిషయములున్నూ మోక్షమార్గము దెలియువిమర్శలున్నూ ఇవి జీవుని అధ్యాసనములు.

ఇంద్రియముల ఉనికిస్థానములు, వాని ధర్మకర్మములు గుదస్థానము దేహకాధారముగానుండుటయు అపానవాయువు నకు స్థానమై సంచారబలమిచ్చుటయు, హృదయమున ప్రాణ వాయువుకు స్థానమై ఘ్రాణేంద్రియముద్వారా సంచార మున్నూ, త్రివిధగంధముల గ్రహించు నాభియందు సమాన వాయుబలముచేత సకలపదార్థ సంతుష్టియు కంఠమందు ఉదానవాయువు సర్వవైఖరిశబ్దములు బలికించు శక్తియు వ్యానవాయువు సర్వశరీరమునకు బలమిచ్చుటయు స్పర్శ గ్రహించుటయు మనస్సు సకలసంకల్పములున్నూ కంఠమం దుండి పరిభ్రమింపచేయుచుండు నేత్రమందు బుద్ధి సత్యాసత్య ములు స్థిరపరచుచుండు. నాభియందు చిత్తము సకలవిషయక మైన చింతలుగల్గించు హృదయమందహంకారము ధైర్యము మూర్ఖము నిచ్చుచుండు. యీ జీవుడు చెవియందుచేరి 10 దిశల శబ్దము లాలకించును. నేత్రమందుచేరి పంచరంగులు సర్వ రూపంబులం దెలియు. జిహ్వయందుచేరి షడ్రసపదార్థములం

దెలియుచుండు. నాసికయందుచేరి సుగంధ దుర్గంధములం దెలియుచుండు. చర్మమునందు చేరి సకలస్పర్శంబులం దెలియు. వాక్కునందు చేరి సర్వకార్యముల కాజ్ఞ ఇచ్చుచుండు. మనస్సునకు లజ్జయు బుద్ధికి భయమున్నూ, చిత్తమువలన సిగ్గున్నూ, అహంకారమున ఆశయున్నూ, కలిగి 24 ఇంద్రియముల కధికారిగానుండి సకలకర్మవ్యాపారంబుల జేయుచుండు.

శివశక్త్యాత్మక జీవవిరాట్టునకు ప్రణవపంజరంబను తనువునందు చతుర్దశాధిపత్యములుగా నధిష్ఠాన దేవతలు త్రిగుణమాయావిభాగములుగా ప్రకాశమానుండై యీ యాత్మ మనస్సు చంద్రరూపముగాను నేత్రముల సూర్య రూపముగాను, వాక్కునం దగ్నిరూపముగాను, జిహ్వయందు వరుణరూపముగాను, హస్తముల ఇంద్రరూపముగా, పాదముల విష్ణురూపముగాను, బుద్ధిగుహ్యములయందు బ్రహ్మరూపము గాను, అహంకారము రుద్రరూపుడుగాను, చిత్తను జీవ రూపముగాను, చర్మమున వాయురూపముగాను శ్రవణముల 10 దిగ్రూపంబులుగాను, నాసికను అశ్వినీదేవతారూపములు గాను, గుదమున మృత్యుదేవతారూపముగాను, తత్వ, గుణ, స్థాన భేదాంతరస్థితివలన ఆత్మప్రతిరూపంబుల ప్రతిఫలించి పంచభూత సంకలన వ్యవకలనభాగములచేత, తనువుల సృష్టి గావించె. బ్రహ్మాండమధ్య మేరుపర్వతములకు సమస్థితి ప్రచు రముగా దేహముల సృజించె. ఇది స్థూలదేహము. స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ దేహముల విమర్శనము అధ్యాత్మికఖండమున విపులముగా దెలియును.

## బ్రహ్మాండ పంచకరణము

| వర్ణములు | సృష్టి | భూతములు | తన్మాత్రలు | మహదహంకారములు | మహత్తులు | అవ్యక్తము | సహస్రారము |
|---|---|---|---|---|---|---|---|
| నీలము | పైకిలేపుట | ఆకాశము | శబ్దము | పరాశక్తి | హం | సదాశివుడు | ఆగ్నేయము |
| ఆకుపచ్చ | వ్యాపించుట | వాయువు | స్పర్శము | ఆదిశక్తి | యం | మహేశ్వరుడు | విశుద్ధము |
| యెరుపు | మార్పుచేయుట | అగ్ని | రూపము | జ్ఞానం | రం | రుద్రుడు | అనాహతము |
| తెలుపు | పోషించుట | జలము | రసము | ఇచ్ఛాశక్తి | వం | విష్ణువు | మణిపూరకము |
| పసుపు | పుట్టించుట | భూమి | గంధము | క్రియాశక్తి | లం | బ్రహ్మ | స్వాధిష్ఠానము |
| మాయావరణ ప్రతిబింబ సూక్ష్మము | శక్తిరూపము | స్థూలము | ఇంద్రియములు | జీవుడు | ప్రాణం | ఆత్మ | ఆధారము |
| | | సూక్ష్మశరీరము | స్థూలము | కారణశరీరము | మహాకారణము | 4 శరీరములు | |
| | | జాగ్రత | స్వప్నావస్థ | సుషుప్తి అవస్థ | తుర్యాతీతము | అవస్థలు | |

ఎరుకపుట్టుకస్థానము

బ్రహ్మాండవరణపథకము విరాట్టు

నిరామయ నిరంజన నిర్గుణపరబ్రహ్మమందు జనించిన అవ్యక్తమాయవలన పంచకారోత్పత్తియై ప్రణవవిరాడ్బ్రహ్మ యేర్పడి త్రిగుణవిభాగముల చేత మహదహంకారస్వరూపులగు మాయాశబళిత సగుణపంచబ్రహ్మాత్మకముగా బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, ఇంద్ర, సూర్యులును, మహాపురుషులుగా సదాశివ, మహేశ్వర, ఈశ్వర, విష్ణు, బ్రహ్మ, ఆత్మ, మహాకారణ తుర్యాతీతములేర్పడి సహస్రార ఆజ్ఞేయ, విశుద్ధ, అనాహత మణిపూరకాస్వాధిష్ట ఆధారములుగా మొదలగు 4 శరీరములయందును అవస్థలతోకూడి వీరివలన మహద్బీజములగు హాం, యం, రం, వం, లం, ప్రాణ, కారణ, శరీర, సుషుప్త్యవస్థలతోచేరి పరాశక్తి, ఆదిశక్తి, జ్ఞానశక్తి, యిచ్ఛాశక్తి, క్రియాశక్తులు, జీవుడు స్థూలశరీరము స్వప్నావస్థలతో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములతో ఇంద్రియస్థూలశరీర స్వప్నావస్థలతో ఆకాశ, వాయు, అగ్ని, జల, భూమి, స్థూలశరీర జాగ్రదవస్థలతో పైకిలేపుట వ్యాపించుట, మార్పుచేయుట, పోషించుట, పుట్టించుట, యను కర్మలంగలిగి నీలం, ఆకుపచ్చ, యెరుపు, తెలుపు, పసుపు, వర్ణంబులుగలిగి చేదు, వగరు, పులుసు, కారము, వుప్పు, తీపి, యను షడ్రసములు గలిగించు కారణమై మాయావరణప్రతిబింబ స్థూలసూక్ష్మరూపంబు లేర్పరచ కర్తయై.

ఆకాశభేదములు నిరాకారపరిపూర్ణ పరబ్రహ్మమందు మాయాశబళిత జ్యోతిర్మయ బిందుస్వరూప అవ్యక్తమొకటి

శక్తులైననియు ఇట్టి అవ్యక్తములో మహత్తును హిరణ్మయ వర్ణా వర్ణములు గల దహరాకాశ మొకటికలైను. ఆకాశమువలన మహదహంకార సాత్విక రాజస తామస త్రిగుణప్రకాశము లని యెడి తత్వాకాశముకలైను. యీ యాకాశమువలన ఆత్మ 'నాకాశసంభూతా' అను న్యాయమున ఆకాశమువలన వాయువు, వాయువునలన అగ్నియు, అగ్నివలన జలము, జలమువలన పృథివియు బుట్టె.

## అవ్యక్త లక్షణము

ఆత్మ దేవతలు మహాత్తుయొక్క లక్షణం బీజములు, ప్రాణములు మహదహంకారలక్షణము శక్తులు జీవుడు, పంచతన్మాత్రలు ఇంద్రియములు, పంచభూతములు స్థూలము, ఆకాశముయొక్క సూక్ష్మాతిసూక్ష్మములు సదాశివుడు సదాశివుని స్థూలాతిస్థూలములు ఆకాశము వాయువుయొక్క సూక్ష్మాతి సూక్ష్మములు ఈశ్వరుడు ఈశ్వరునియొక్క స్థూలాతిస్థూలములు వాయువు అగ్నియొక్క సూక్ష్మాతిసూక్ష్మ ములు బ్రహ్మ బ్రహ్మయొక్క స్థూలాతిస్థూలములు పృథివియని తెలియనగును.

పంచభూతములు ఈశ్వరునకు స్థూలము ఇంద్రియములు జీవుడు, ఈశ్వరజీవులు కలిసిన సూక్ష్మశరీరము, పంచబీజ ములు, ఈశ్వరునకు ప్రాణము లేక హంస అదే కారణ శరీరము పంచదేవతలు ఈశ్వరునకాత్మ. ఆత్మయే కారణశరీరము స్థూలశరీరము జాగ్రదవస్థ. సూక్ష్మశరీరము స్వప్నావస్థ.

కారణశరీరము సుషుప్త్యవస్థ. మహాకారణ శరీరము తుర్యావస్థ.

## ఎరుక పుట్టుక స్థానములు

ఈశ్వరునకు స్వప్నావస్థలో ఎరుక కల్గెను. అనగా సూక్ష్మశరీరధారియై ఇంద్రియములు జీవుడున్నూ కలిసి, ఇంద్రియము లనగా పంచతన్మాత్రలు జీవుడనగా పంచశక్తులు. అనగా మహదహంకారమున్నూ ఏకీభవించి, ఉద్భవించి, సృష్టియందు అనగా ఓషధులందు ప్రవేశించి, వర్ణము లేర్పడి పుట్టుచుండె. ఇదే సృష్టి పృథివికి పుట్టించు గుణము, జలమునకు పోషించుగుణము, అగ్నికి మార్పుచేయుగుణము, వాయువుకు విస్తరింపజేయుగుణము, ఆకాశమునకు పైకి లేపుగుణము గలదు.

వర్ణములు: పృథివి పసుపువర్ణము, జలము తెలుపు వర్ణము, అగ్ని యెరుపువర్ణము, వాయువు ఆకుపచ్చవర్ణము ఆకాశము నీలవర్ణము యీవర్ణములేర్పడి యెను. మాయావరణ ప్రతిబింబ సూక్ష్మరూపమైన ఈశ్వరరూపముదాల్చి బిందువై జననీజనకుల సంయోగముచేత పిండరూపమై యేర్పడి, నవ మాసములకు 12 అంగుళములు పిండరూపమై, భూపతనమై, అంతఃకరణావరణ ప్రతిబింబముయొక్క సూక్ష్మము జీవుడై ఈ శరీరము లాయెను. ఇది స్థూలశరీరమాయెను.

## యీ జీవుడు

యిట్టి స్థూలశరీరియై 84 లక్షల జీవభేదంబులుగా లోకమున ప్రవర్తింపుచు 4 లక్షల మానవ భేదంబులుగా

నుండు జగత్సృష్టికి ప్రారంభమై యిప్పటికి 195 కోట్ల సంవత్స రములనాడు సృష్టి ప్రారంభించగా సృష్టివిఘ్నములు గలిగి 191 సంవత్సరములకు సృష్టికి ప్రారంభించి యక్షులు, రక్షులు, రాక్షసులు, గంధర్వులు, అప్సరసలు, పితృదేవతలు, దేవతులు, పిశాచులు, సాధ్యులు, సిద్ధులు యీ గణములున్నూ విభు ధులు, నరులు, కిన్నరులు, దేవఋషులు, మునులు, సప్తర్షులు, దిక్పాలకులు, ఇంద్రుడు, మనువులు చంద్రసూర్యాధికారములు ద్వాదశాదిత్యులు ఆకాశగంగయు, వీరిని సృష్టించి, దేవతా సర్గమును నిర్మించి యీ దేవతాసర్గమువ మహత్సర్గంబును రెండవభూతసర్గమున త్వగాదీంద్రియసర్గమును సృష్టించి యీ మూడుసర్గముల అనంతరము సంతతి వృద్ధిబొందలేదని స్వాయం భువు మనంబున నాలోచించి తన తపోయోగబలమున జగ త్పావనులను మునులు, ఋషులు, త్రిలోకపూజ్యులు, అధి పతులు, చక్రవర్తులు, మంత్రపీఠాధిపతులను, విబుధులను, నరులను, సృష్టించి తదుపరి స్వాయంభువు మన్వు 196 కాల మున మర్త్య మానవలోకంబున వైకృతమానవాది సృష్టికి ప్రారంభించి జనోలోకమున తపస్సిద్ధిబొంది శాంతవివేకమతి యగు నొక మహాపురుషుని మానవసృష్టిచేయుటకు నియమించి గృహస్థాశ్రమధర్మక్రమంబున శతరూప యను భార్యను నియ మించి స్వాయంభువ మనువునకు జతగూర్చి ఆదివీర దంపతు లుగా నియమించి కల్యాణోత్సవముచేయించి, తదుపరి కొలది కాలంబున బ్రహ్మావర్తారణ్య పర్వతదేశములయందు హిమా లయప్రాంత దక్షిణభాగ ఆర్యావర్త సింధూనదీతీరమున లోక

జనసృష్టిచేయుటకు బ్రహ్మదేవునిచే నాజ్ఞబొంది యీ బ్రహ్మ వర్తమున స్వాయంభువు ప్రవేశించి కృతయుగ ప్రారంభముగా ఆ సింధునదీతీరంబున పరిశుద్ధాభివృద్ధిగల ప్రదేశంబున స్థాన నిశ్చయముచేసి వసతిగృహములకు వేర్వేరస్థానంబుల నేర్పరచి పందిళ్ళు, పర్ణశాలలు, పూరిగృహములు, ఏకశాలద్విశాల, త్రిశాల, చతుశ్శాలలు, మొదలగు గృహములు, మిద్దెలు, మేడలు, చంద్రశాలలు, అష్టవిధగృహములు, సర్వతోభద్ర ములు, హారిపదము జయంతికల్యాణము, శశిపదము. కమలా కరము, పుండరీకము, శ్రీనిలయము, గృహశేఖరము, విశ్వతో ముఖము, స్వస్తికవర్ధమానములు, సంధ్యావర్తము, పుష్క రము, ధనపదము, ఇంద్రపదము, వరుణపదము, చక్రాఖ్యము గృహరాట్టను శ్రేష్టగృహములున్నూ, కచేరిసావళ్లు, ఉద్యాన వనములు, తటాకములు, కోనేర్లు, కూపములు, జలాశయ ములు, నిర్మించి, వేదికలు, ప్రాకారములు, మంటపములు, గోపురములు, ధ్వజస్తంభయజ్ఞవేదికలు, రథశాలలు, రథ ములు, చతుర్దిశమార్గములు, దేవతాలయంబులు, చతుర్దిశ మార్గములు గల గ్రామ, పుర, పట్టణ, నిర్మాణంబులు, ద్వాత్రింశద్వాస్తువిధానములచే గ్రామమధ్యస్థ క్షుద్రశాక్తే యాది శీతలి మొదలగు దేవతాస్థాపనములు, గ్రామక్షేమ నిమిత్తములగు బొడ్డురాళ్లు, రచ్చబండలు, మొదలగు శిలా స్థాపనములు, లక్ష్మి, పార్వతీ, సరస్వతి, గణపతి, ఆంజనేయ, భైరవ, పోతురాజుల కాలయస్థానంబులు.

బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, ఆలయప్రతిష్ఠలు పక్షోత్స వాదులు పూజలు, ఆరాధనలు, జపములు, యజ్ఞములు, హోమవిధానములు, బలులు, సమారాధనలు, పురాణ కాలక్షేపములు, పండితసభలు, శాస్త్రవిచారణలు, పురాణ చర్చలు, దేవతావ్రతదీక్షలు, షట్కర్మవిధులు అష్టాంగ యోగవిధానములు, సాంఖ్య తారక అమనస్క విధివిధాన చర్చలు, పరబ్రహ్మైక్య సంధానవిధానములవరకు సమగ్రముగ నిచ్చి చేయించుచు.

గృహస్థాశ్రమ ధర్మపద్ధతులను నిత్యనైమిత్తిక, స్నాన, సంధ్యా, జప, హోమయజ్ఞ, విధానములు వేదాచారశిష్ట ములు సర్వోపనిషత్సూత్రాధార అర్థవిమర్శలు 32 విద్యలు, 64 కళామర్మములు, 118 ముఖ్యోపనిషత్తులు, సకలవిద్యా మర్మములు, సకలవిద్యోపాయములు, సకలాగమ హోమ యజ్ఞవిధానములు, వృక్షదోహదక్రియలు, ఫలవృక్షదోహద ములు, 18 విధములగు ధాన్యములు పంటలు క్రమములో పాకశాస్త్రవిధిక్రమంబులు, బాల్యయవ్వన, కౌమార వార్ధక్య పదార్థక్రమవిధానంబులు, ఆయుర్వేదరహస్యములు, విషాప హార రహస్యములు, ప్రాణిబలోద్ధారణ రసాయనములు, అమృతకరణ పదార్థములు, వీర్యవర్ధనకరంబులు ఆయురారోగ్య కరములు. రసాయనములు ఏకదోష, ద్విదోష, త్రిదోష, ద్వంద్వ, ఆగంతుకాదిదోషములకు ఔషధవిధానములున్నూ పదార్థదోష, అజ్ఞానదోష, నివారణోపాయములున్నూ, వృక్షసమూహాపట్టులు, వేళ్ళు, పత్రములు, పుష్పములు,

పిందెలు, ఫలములు, కలాటువులు, పారుటాకులు, కార్పా
సాది వస్త్రములు, మృగచర్మములు, ఇత్యాది ఆచ్ఛాదన
ములున్నూ, యీసర్వోపయోగసూత్ర విధివిధానంబులనిచ్చి
బ్రహ్మదేవుండు స్వాయంభువమనువును సింధునదీ ప్రాంతం
బున నివశింపజేసెను. అచ్చట నివసించి సకలవిధ కార్యముల
యందు జాగ్రతగలవాడై స్వేచ్ఛావిహారంబున కార్యక్రమం
బులు నడుపుచు శతరూప యను భార్యతో సకల విధోల్లాసంబు
లతో మఱికొంత ఋషిజనసాహ్యాంబులతో పరిచారికలతో
నివాసంబుచేయుచు సకలకార్యములు చేయించుచు సకల
వస్తువులు కొరతలేకుండునట్లు కాలముగడుపుచుండగ కొలది
దినంబులకు స్వాయంభువునకు శతరూపవలన ప్రియవ్రతుండను
నొక కుమారుడుదయించె. ఆకుమారునకు షోడశకర్మాదిశుభ
ములు నడపించుచు క్రమాభివృద్ధియగుచుండ విద్యావంతునిం
జేసె. సకల విధివిధానంబులునేర్పి కల్యాణాది శుభంబులు
జరుపగా ప్రియవ్రతునకు కాలక్రమంబున 10 మంది కుమారు
లుదయించిరి. స్వాయంభువునకు ఉత్తానపాదుండను నొక
కుమారుండు గలిగె.

## స్వాయంభువ సంతతి

యీ ప్రియవ్రతుని సంతతి యభివృద్ధికి వచ్చుచుండగా
ప్రియవ్రతుండు బ్రహ్మానుమతంబున పట్టాభిషిక్తుండయ్యె.
అర్బుదసంవత్సరములు రాజ్యమేలె. తన కుమారులు అగ్నీం
ద్రుడు జంబూద్వీపమునకు మేధాతిప్లక్షద్వీపమునకును వుపమ్మం

క్షుడు శాల్మలీద్వీపమునకును, జ్యోతిష్మంతుడు కుశద్వీపము నకును, ద్యుతిమంతుడు క్రౌంచద్వీపమునకును, భవ్యుడు శాక ద్వీపమునకును, సవనుడు పుష్కరద్వీపమునకును, రాజ్యాభి షిక్తులైరి. తదాదిగా నొకద్వీపముననే పెక్కుదేశములుగా ఖండములుగా వర్షములుగా చేసిరి. అధిష్ఠానపురములు నిర్మిం చుకొని అధిపతులపేర్లతో దేశములకు నామములు గల్గె. రాజ్యపాలనచేయుచుండిరి.

ప్రియవ్రతుని కుమారుడగు అగ్నీంధ్రుడు జంబూద్వీప మును తన కుమారులకు 9 మందికి వర్షములుగా మార్చి యిచ్చెను. నాభివర్షమును, కింపురుషవర్షమును, హరివర్షమును, ఇలావృతవర్షమును, రమ్యకవర్షమును, హిరణ్యకవర్షమును, కురువర్షము, భద్రాశ్వవర్షము, కేతుమాలవర్షము, అను వర్ష ములను, వారి నామములతోగలిగిన స్థానముల నేలించిరి. అగ్నీంధ్రుని కుమారుడు వృషభునకు భరతుడు జనించగా వానికి రాజ్యపాలనకు పట్టాభిషిక్తుని చేసిరి. తదాదిగా భారత వర్షంబని ప్రసిద్ధిగలిగె. అది మొదలు క్రమాభివృద్ధికలిగి సకల విజ్ఞానములతో నుండి జ్ఞానమార్గమున మోక్షాభిలాషులై పుణ్యా మూర్తులుగానుండిరి.

తక్కిన ద్వీపవాసులు జరామృత్యుభయంబులులేక ధర్మాధర్మవిచారణలున్నూ, ఉత్తమ మధ్యమ అధమ భేదం బులులేక కృతయుగాది చతుర్యుగాది ధర్మములున్నూ లేక షడృతువుల కాలవ్యత్యాసములున్నూ, లేక కాలధర్మము లున్నూ, వారికిలేక వారికే సకల సిద్ధులు కలిగియుండువారికే

పుణ్యములు నశించినవెనుక దివమునుండి దిగివచ్చి భారత వర్షమున జన్మలెత్తి సౌఖ్యభోగముల ననుభవింపుచూ, భూమిని స్వర్గముగా దలంచి స్వేచ్ఛతో విహరింపుచుందురు. ఇచ్చట పరమేశ్వరుండు యుగయుగంబులయం దవతరించి గుర్వాంశతో మానవులను జ్ఞానవంతులంజేసి, భక్తిమార్గంబున భుక్తిముక్తులంజూపుచు కడతేర్చుచుందురు. బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులకు నిరంతరము ఇదే వ్యాపారము అని తెలిశేది.

తక్కినవర్షములవారు 120సంవత్సరము లాయుర్దాయము గలిగి యేనుగులవంటి బలముగలిగి దేవతాసమానులై, వజ్ర దేహులై, అధికసంతోషులై మాంద్యమత్తతలులేక చురుకు గల బుద్ధిమంతులై, పుణ్యాత్ములై, కపటకృత్యపరద్రోహం బులులేక సురతసుఖానందులై, మోక్షంబుగానక సంతాన వాంఛయు త్రేతాయుగ ధర్మంబునుగలిగి ప్రవర్తింపుచు దేహాంతంబున భారతవర్షమున జనింతురు. యీ భారతవర్షము నందు ముహూర్తమాత్రమూ సర్వసంఘపరిత్యాగంబున వైరాగ్యముగలిగి, తదేకనిష్టతో ఆత్మధ్యానము చేయు పుణ్యాత్మునకు పరమభక్తులకు భగవత్ప్రసాదప్రాప్తి అతిసులభంబుగా నుండును. యీ జంబూద్వీప భారతవర్షంబున బదరికాశ్రమం బున బదరీనారాయణుండు నారదాదులకు సాంఖ్యయోగం బుపదేశించగా అచ్చటివారందరు నారాయదేవునిం గొలుతురు. యీ భారతవర్షమున పరమభక్తులు పరమేశ్వరుని ధ్యాననిష్టా పరవశంబున దేవతాకథాలాపములు, భజనలు, పూజలు, జప ములు, దేవతోపాసనలు, దేవతోత్సవములు, యీ వర్షమున

గలిగియుండు. ఇతర వర్షములయందు భగవద్ధ్యానంబులేక చేయు యజ్ఞంబులు, తపోదానంబులు, చేసినను నిష్ఫలంబులై పశుమృగాదులవలె జననమరణంబులు దప్పవు. భగవద్భక్తులు పరమేశ్వర కథాలాపములు యెచ్చటలేకుండునో అది అమర లోకంబైనను, అజ్ఞానమృగమండలంబైయుండు. జ్ఞానానుష్టానం బులచేత మనుష్యజన్మంబెత్తినను తపంబున సిద్ధిబొందకుండెనేని మృగంబులవలె తమకుతామే బంధకంబులం బొందువారగు దురు. శ్రద్ధాభక్తియుక్తంబుగా ననుష్టింపబడిన యజ్ఞములయందు వేల్వబడిన హవిస్సులు పెక్కునామంబులచేత చేయించబడిన పరమేశ్వరుండు తనమీాది భక్తిని యధికపరచి భారతవర్ష ప్రజలను కరుణించి, ఇహాపరసౌఖ్యములనిచ్చి, రక్షింపుచుండు. యీా భారతవర్ష మహిమ, వర్ణించుటకు అనంతముగానుండును. ఇదిగాక ఆరుద్వీపములు గలవు. వాటి విశేషములెట్లనగా.

జంబూద్వీపము 182 కోట్ల సం॥

500 కోట్ల యోజనముల విశాలంబగు జంబూద్వీపము చుట్టూ, లక్ష యోజనముల వెడల్పు, లవణ సముద్రము గలదు. స్వాయంభువమనువు, ప్రియవ్రత ఉత్తానపాదులను కుమారులతో సరస్వతీనది, దృషద్వతీనది, ప్రవాహముల మధ్య, యమునానదివరకు నాక్రమించి, యేలుచుండి, కురు మహారాజు మొదలు కురుదేశములుత్పత్తియాయె. స్వాయం భువ మనువుకు ఆకూతి, దేవహూతి, ప్రసూతి, యను కుమా ర్తెలు గలిగిరి. ఋచి యను ప్రజాపతి ఆకూతియందు యజ్ఞ పురుషుడను విష్ణువు జనించి, దక్షిణ యను కన్యకను స్వాయం

భువు వీరిరువురను పెంచి, దంపతులంజేసె. స్వాయంభువు జ్యేష్టపుత్రుండగు ప్రియవ్రతుండు తండ్రి సింహాసన మధిష్టించి, యేలుచుండెను. తర్వాత ప్రియవ్రతుని కుమారుడు అగ్నీంధ్రుడు యేలెను. అగ్నీంధ్రుని కుమారుడు అభి యను వాడు యేలెను. యీ యభి కుమారుడు వృషభుడు యేలెను. యీ వృషభుని కుమారుడు భరతుడు యేలుటచేత భరతఖండమని ప్రసిద్ధియై పేరువహించె.

స్వాయంభువ మనువు కుమారుడు ప్రియవ్రతుడు ప్రభువై యేలెను. యీ ప్రియవ్రతుడే నియతధర్ముడై వైవస్వతుడాయెను. యీ ప్రియవ్రతునిది ఇక్ష్వాకు వంశము. గంగాసరయూనదుల మధ్య సాకేత పట్టణము నేలెను. అదియందు యీ ప్రియవ్రతుడు విరక్తిచెంది, రాజ్యభారంబు మాని, వైరాగ్యమున దైవచింతనచే నుండగా బ్రహ్మదేవుండు వచ్చి, రాజ్యము చేయుట యత్యావశ్యకమని బోధించి, రాజ్యభారము వహింపచేసెను. అప్పుడు తండ్రిచే పట్టాభిషిక్తుడై 11 అర్బుదములు, సంవత్సరములు రాజ్యపాలనముచేసెను. యీయన కాలమున సప్తద్వీపములుగా భూమి విభజింపబడియె. యీ ప్రియవ్రతుడు రథారూఢుడై 7 సార్లు భూప్రదక్షిణములు చేయుగా నారథనేమిమార్గములు సప్త సముద్రములాయెను. ఆ మార్గముల మధ్యస్థానములు సప్తద్వీపములుగా లోకములాయెను. తపోమహిమచే గగనసంచారులై దేవతాది లోకములకు పోయివచ్చు దేవఋషులచేత విని, లోకప్రమాణములు పురాణములయందు లిఖించిరి.

## ద్వీపసముద్రములు

ప్రియవ్రతుడు సప్తద్వీపములుగా యేర్పరచగా మొదటి కృతయుగాంతమాయెను. విష్ణువు, మత్స్య, కూర్మ, వరాహ, నారసింహరూపములు ధరించి యుండె. అంతట త్రేతాయుగ ప్రారంభమాయెను. యీ యుగ ప్రారంభమున రధభారములచేత శృంగి, లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, శుద్ధోదక సముద్రములు పూర్ణంబులయ్యె. మరియు, జంబూద్వీప, ప్లక్షద్వీప, శాల్మలిద్వీప, కుశద్వీప, క్రౌంచద్వీప, శాకద్వీప, పుష్కరద్వీపములు ఏర్పడియె. భూమి పద్మముగా నుండి మేరుపర్వతము పద్మకర్ణికగా నుండె.

ద్వీపసముద్రములుగా నిర్ణయింపబడి అగ్నీంద్రుడు జంబూద్వీపమున్నూ, మేధాతి ప్లక్షద్వీపమున్నూ, వపుష్మంతుడు శాకద్వీపమును జ్యోతిష్మంతుడు కుశద్వీపమున్నూ, ద్యుతివంతుడు క్రాంచదీపమున్నూ, హావ్యుడు శాకద్వీపమున్నూ, సవనుడు పుష్కరద్వీపమును, యేలునట్లు పంచియిచ్చి, పట్టాభిషిక్తులంజేసి యేలించిరి.

ప్రియవ్రతునికుమారుడు అగ్నింధ్వుడు 9 మంది కుమారులకు వారి నామములచేత వర్షములుగా పంచియిచ్చెను. యీ వర్షములనగా నాభి వర్షం 1 కింపురుష వర్షం 2 హరి వర్షం 3 ఇలావృత వర్షం 4 రమ్యక వర్షం 5 హిరణ్మయ వర్షం 6 కురు వర్షం 7 భద్రాశ్వ వర్షం 8 కేతుమాల వర్షం 9 ఇవి నవ వర్షములు. తర్వాత మను సంధులు, యుగసంధులు వలన

అనేక ప్రళయములుగలిగి, నకారణమున యీ వర్షఖండము లనేక మార్పులు చెందినవి. యీ భరతఖండము 14 మనువుల పర్యంతము కాలమువరకు నిల్చియుండునని బ్రహ్మాండ మార్కండేయ పురాణముల సిద్ధాంతములైయున్నవి. అగ్నీంధ్రుని కుమారుడు జ్యేష్టుడగుటచేత నాభికి యీ అజనాభి వర్షము నిచ్చెను. యీ నాభికి విష్ణువు జనించె. విష్ణువునకు వృషభుడు జనించె. యీ వృషభునకు జ్యేష్టకుమారుడు భరతుడుగా జనించె. యీ భరతునకు రాజ్యమిచ్చిన కాలమున పెక్కుపట్టణములు, ఆశ్రమములు, ధర్మస్థాపనలు, యేర్పడుట వలన అజనాభివర్షమని ప్రసిద్ధిగల్గినది. ఆపేరు విడచి భారత వర్షమని పేరు నిల్చినది. హిమవత్పర్వతము మొదలు దక్షిణ సముద్రమువరకునుండు యిప్పటి హిందూదేశము భారతవర్షమున 1 భాగము కర్మభూమియని ప్రసిద్ధి. యుగభేదములచేత ప్రవర్తనలు మార్పులు చెందుచున్నవి. ఇచ్చటివారికి స్వర్గ నరకములు కరతలామలకములుగా నుంచును.

## ప్రియవ్రత సంతతి

దేవ, యసుర, పితృ, మనుష్య సర్గములు సృజించుటకు స్వాయంభువ మనువుయొక్క పుత్రులయొక్క పుత్రికల యొక్కయు పితృలయొక్కయు సంతతులవలన వృద్ధిబొందినవని తెలియవలెను. సౌందర్యముకొరకు మానసవృద్ధియగు వివేకముకొరకు సర్వులు పాటుపడుచుందురు. మానసవృద్ధియే జ్ఞానము. యీ జ్ఞానముకొరకే సకలజనులు తోడుపడుచుందురు.

సప్తఋషులవలన అనగా కశ్యపుడు, అత్రి భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వశిష్ఠుడు వీరు చతుర్వేదవేత్తలు. షట్శాస్త్రవిధులు వీరికి మించినబోధ కావలసినపుడు విష్ణుదేవుం డవతారమెత్తివచ్చి గురురూపంబున శిష్యులకు బోధింపుచుండును. భ్రష్టులక నవసరము.

స్వాయంభువమనువుకాలమున విష్ణువు 3- మూడవతారములెత్తి మొదట స్వాయంభువమనువు కుమార్తెలగు ఆకూతికి విష్ణువు యజ్ఞపురుషుడుగా బుట్టి ఋషులకు యోగశాస్త్రము బోధించెను. రెండవసారి దేవహూతికి కపిలుడుగా బుట్టి, మహాఋషియై తల్లికి సాంఖ్యయోగోపదేశమునుబోధించె. లోకవ్యాప్తముగా మూడవతూరి స్వాయంభువు మనుమడగు నాభికి వృషభుడుగాబుట్టి, భాగవతధర్మములు బోధించె. స్వాయంభువు కుమార్లు కుమార్తెల సంతతులే జగదభివృద్ధికి కారణమయ్యెను. యీ భారతవర్షమున సకలసిద్ధులున్నూ, తపస్సులున్నూ, ఇది కర్మభూమి స్వాయంభువ మనువుగడచిన వెంటనే మన్వంతరసంధిలో 120428 సంవత్సరములలో సృష్టి నిలిచి భూమికి నిద్రగలిగి, క్రియాశూన్యమై ప్రతికల్పమునందిట్లు మన్వంతరములయందు ఇట్లు జరుగును.

ప్రతి మన్వంతరమునకున్నూ, రాబోవు మన్వంతరమునకు అధిపతియగు మనువు, జంతుజాలములు, క్రిమికీటకములు, వృక్షబీజములు, సర్వవస్తువులు, వశముజేసుకొని వాటి వృద్ధికై కాలహేమ్యము దెలిసిపాటుబడిరాబోవుమన్వంతరమున కాధారముగా దీసికొని యీగోళమునందుండక బీజరూప వస్తువులు, సహా

మరియొక గోళమునకుచేర్చి నిర్మాణ ప్రదేశముచేరి పనులు చేయుచు కాలక్రమము గడుపుచుండును. రాబోవు మన్వంతర మున కార్యవిధానమునకు అనుసరణముగా మన్వంతరగోళ మునుబట్టి వృద్ధిచేయును. యిట్లు చేయువాడు మనువనిపించు కొనును. ప్రతి మన్వంతరమునం దిట్లే జరుగును. యీ స్వాయం భువ మనువు తొలిమనువు, యీ మన్వంతరమున ప్రారంభ మున ప్రధానపురుషుడై తొలి ప్రయత్నము చేసినవాడు మూలమనువు. మూలమనువను స్వాయంభువుకాలమందు సూర్యుడు తూర్పు సంచారమున కొంతకాలము దక్షిణో దయము కొంతకాలము, పడమర ఉదయము కొంతకాలము, ఉత్తర ఉదయము కొంతకాలము, జరుపుచూ సంచారము చేయుచుండు ప్రస్తుతము ఇప్పటికి యీ కల్పమున ఆరు మన్వంతరములు జరిగి యేడవ మన్వంతరము జరుగుచున్న వర్తమానమగు కాలమునకు అనగా 195 కోట్ల సంవత్సరముల కాలమున ఉత్తరదిశ ఉదయసంచారమున నున్నాడని రాబోవు మన్వంతరములున్నూ యీ భూగోళమునుబట్టి భరతఖండ మందుండి ప్రజాసర్గమును పరిపాలించుచున్నట్లు తెలియు చున్నది. ఇది బ్రహ్మాండ పురాణ సిద్ధాంతము.

## 20-వ ప్లక్షద్వీపము

లవణసముద్రము తూర్పుతటము మొదలుగా లక్ష యోజనముల విశాలము మొదలు 2 లక్షల యోజనములు, విశాలముగల ప్లక్షద్వీపము జంబూద్వీపంబ్లాహారముగా నుండును.

10 వేలవర్షము లాయుర్దాయము గలిగియుండును. వారికి అగ్నిదేవుండు ఆదిదేవతగా నుండును. ప్రథమంబున ప్రియవ్రతుని పుత్రుండగు మేధాతి రాజ్యభారంబు వహించియుండెను. పిమ్మట 7 వర్షములుగా భాగించి, యీ వర్షనామధారులుగానుండు పుత్రులను రాజ్యపట్టాభిషిక్తులంజేసె. అనగా శివ, యశస్వి, సుభద్ర, శాంత, క్షేమ, అభయం, అమృత అను నేడ్గురనావర్షముల పట్టాభిషిక్తులంజేసి యేలింపుచుండెను. యీ ద్వీపమందుండు జనులు కపటరహితులు. వీరికి కృత్రిమగుణములు లేవు. రోషములు లేవు. దుర్గుణములు లేవు. మృదుసంభాషణలు ప్లక్ష జువ్విచెట్ల అరణ్యములుండుటచేత ప్లక్షద్వీపమని పేరుగలిగె. నొకవైపు వుప్పునీళ్ళసముద్రము నొకవైపు చెరుకురస సముద్రమున్నూ గలదు. యిచ్చటివారు నిర్మలస్వరులు. చిరంజీవులై ముసలితనములేక జీవింతురు. ఇచ్చట గోమోదకాచలము, నారదగిరి, దుందుభిపర్వతము, సోమకపర్వతము, సుమనోపర్వతములున్నవి. పూర్వము సుమనోపర్వతమున హిరణ్యాక్షుడు తపస్సుచేసెను. శ్రీహరి వరాహరూపమున వానిని చంపెను. ఇచ్చట మణికూటము, వజ్రకూటము, ఇంద్రశేనము, జ్యోతిష్మతి, ధూమ్రవర్ణ, హిరణ్యగ్రీవ, మేఘమాలలను నామములుగల కులపర్వతములయందు తెంపులు గలుగునట్లు పుణ్యనదులు అనగా నరుణ, స్వమణ, ఆంగీరస, సావిత్రి, సుప్రభాస, ఋతంబర, సత్యంభర, యను నదీ ప్రవాహంబులు గలవు. యీ జలములయందు స్నానము చేయు పుణ్యపురుషులకు పాపములు హరించి, ముక్తులగుదురు.

హంస, పతంగ, ఊర్ధ్వాయన, సత్యాంగ. నామములు గల చాతుర్వర్ణంబులు సహస్రవర్ష జీవనులై అచ్చటి పురుషులు దేవతాసములుగా నుందురు. దృష్టిమాత్రంబున క్లమ శ్వేదాది రహితులు నపణోస్సత్పాదనంబులు గలవారగుదురు. వేదత్ర యాత్మకుండును స్వర్గద్వారభూతుండును భగవత్స్వరూపియు యగు సూర్యుని వేదమంత్రములతో నారాధింతురు. ప్లక్షద్వీపంబాదిగా యిచట ద్వీపపంచకములయందలి పురుషులకు నాయురింద్రియ పటుత్వంబులు ఓజోబలమును జన్మతోడనే జన్మించుచుందురు. యే కొరతలు లేకుందురు. యీ ప్లక్షద్వీపముచుట్టూ చెరుకురస సముద్రము 4 లక్షల యోజనములు విశాలముగలిగి ఆవరించియుండును.

## 3–శాల్మలీ ద్వీపము

యీ యిక్షు సముద్రముచుట్టూ ఆరులక్షల యోజనములవరకు ఆవరించి శాల్మలీ ద్వీపముండు. ప్రియవ్రతపుత్రుండు యజ్ఞబాహుండు రాజుగానుండి యేలుచుండు. పుత్రులకు రాజ్యమిచ్చి సప్తవర్షములయందు అనగా సులోచన, సౌమనస్య రమణక, దేవబర్హా, పారిబర్హా, ఆప్యాయన, అభిజ్ఞాతీలను వర్షములయందు అభిషిక్తులంజేసి యేలించుచు, స్వరస, శతశృంగ, వామదేవ, కుముద, ముకుంద, పుష్పవర్ష, శతశ్రుతలను పర్వతమస్తకంబుల విహరింపుచుందురు. అనుమతి, శినీవాలి, సరస్వతి, గుహువు, రజనీ, నందరాక యను 7– సప్తనదీపుణ్య తీర్థములయందు స్నానాది పవిత్రులగుచుందురు. యీ ద్వీపము

చుట్టూ బూరుగు వృక్షారణ్యములు గలిగియుండుటచేత శాల్మలీ ద్వీపమను పేరుగలిగె. ఇచ్చటి వర్షపురుషులు శ్రుత ధర, విద్యాధర, వసుంధర, ఇధ్మధరులను వర్షపురుషులు గలిగియుందురు. వేదమయాత్మండగు సోముని వేదమంత్ర ములచేత ఆరాధింపుచుందురు. యీ శాల్మలీ ద్వీపముచుట్టూ 10 లక్షలయోజనములు సురా సముద్రము ఆవరించియుండు యీ సురా సముద్రముచుట్టూ కుశ ద్వీపముండును.

## 4– కుశ ద్వీపము

యీ కుశ ద్వీపము 8 లక్షల యోజనముల విశాలము గలిగియుండును. యీ ద్వీపంబున 42 లక్షల యోజనముల యెత్తు కుశ స్తంభం బిచట స్థాపించియుండు. ఇది దేవతాకల్పి తమై మహాకాంతిగో ప్రకాశమానమై యుండును. యీ స్తంభముపేరుతో కీర్తినంతమైన యీ ద్వీపము పేరుగలిగి యుండు. ప్రియవ్రత పుత్రుండగు జ్యోతిష్మంతుడు కుశ ద్వీపము రాజ్యపాలనను చేయుచుండును. కుమారులకు సప్త వర్షముల అనగా హిరణ్యరేత, వసుదాన, దృఢరుచి, నాభి గుప్త, సత్యవ్రత, విప్రక, వామదేవ, నామంబులుగల వర్ష ములయందు పట్టాభిషిక్తులం జేసి యేలించుచుండు. చతుశ్శృంగ, బభ్రు, కపిల, చిత్రకూట, దేవానీకోర్ధ్వరోమ, ద్రవిణంబులను పర్వతములు యందలి విహారస్థానంబుల విహరింపుచు రసకుల్యా, మధుకుల్యా, శ్రుతవింద, మిత్రవింద, దేవగర్భ ఘృతచ్యుత, మంత్రమూలములను, నదులయందు స్నానాది పవిత్రులగుచు

యజ్ఞపురుషు నారాధించుచు కుశలకోవిదులగు చాతుర్వర్ణ్యం బులుగలిగి, వర్షపురుషునిన్ని ఆరాధింతురు. యీ ద్వీపము చుట్టూ 16 లక్షలు యోజనములవరకు ఘృతసముద్రముండును. దీనిచుట్టూ క్రౌంచద్వీప ముండును.

## 5- క్రౌంచ ద్వీపము

యీ క్రౌంచ ద్వీపము మధ్యను క్రౌంచాద్రి పర్వతము గలదు. యీ పర్వతమును షణ్ముఖుడు దివ్యబాణంబులచేత వేయగా పాలవెల్లువయై యుండగా ఆ యుపద్రవంబును వరుణ దేవుండు పరిమార్చె. అంతట రక్షణపొందియుండె. క్రౌంచ ద్వీపాధిపతియగు ద్యుతిమంతుడు రాజై యేలుచుండెను. యీాయన కుమారుడు ఘృతపృష్టుడు కుమారులకు తనయేలు బడి అనంతరమున యమోద, మధురహ, మేఘపృష్ట, సుధామ, ఋషిజ్య, లోహితార్ణవ, వనస్పతులను సప్తవర్షం బుల రాజ్యాభిషిక్తులంజేసి పరమకల్యాణగుణయుక్తుండై శ్రీహరిని ధ్యానపూజాదులసేవించుచు తపంబునకుం జనియె. ఆ వర్షములయందు శుక్ల, వర్ధమాన, భోజన, ఉపబర్హణ, ఆనంద సర్వతోభద్ర, యను సప్తకుల పర్వతంబులయందు విహరించుచు అభయ, అమృతౌఘ, నార్యక, తీర్థవతి, ద్రుప్తి రూప, పవిత్రవతి, శుక్లయశీపవిత్రోదక, యను సప్తనది పుణ్య తీర్థముల పవిత్రులగుచుండునట్లు నియమించి తపంబునకుం జనియె. గురు, ఋషభక, ద్రవిణక, దేవసంజ్ఞులను, నామంబు గల చాతుర్వర్ణ్యంబులుగలిగి వరుణదేవు నారాధించుచు అర్ఘ్య

పాద్యాదుల బూజింపుచు, భుక్తిముక్తులనొందుచు, క్రౌంచ ద్వీపముచుట్టూ 24 యోజనముల వలయముగలదు. 26 లక్షల యోజనములు చుట్టూ దధిసముద్ర మావరించియుండు. యీ దధిసముద్రముచుట్టూ శాక ద్వీపముండు.

## 6– శాక ద్వీపము

యీ శాక ద్వీపము మహాప్రకాశముగలిగి సుగంధ యుక్తమై 32 లక్షల యోజనముల విశాలము గలిగియుండు. ప్రియవ్రతపుత్రుడగు మేధాతి తన పుత్రులతో కలిగిన సప్త వర్షములయందు అనగా పురోజన, మనోజన, వేపమాన, ధూమ్రానక, చిత్రరధ, బహురూప, విశ్వాచారంబులను సంజ్ఞలుగల సప్తవర్షంబులయందు అభిషిక్తులంజేసి శ్రీహరి పాదసేవనచేయుచు పర్వత దండకారణ్యంబుల కరిగి పర్వత శిఖరంబుల తపం బాచరింపుచునుండె. ఇందు పర్వతములు ఈశాన, ఉరుశృంగ, బలభద్ర, శతకేసర, సహస్రశ్రోత, దేవ పాల, మహానస, మను కులపర్వతంబులను, సీమాపర్వతములును గలవు. వాటియందు విహరింపుచు అచ్చట నదములు అన ఘాయు, ఉభయస్పృష్టి, అపరాజిత, పంచపదీసహస్రశ్రుతి, నిజధృతియున్నూ, సప్తపుణ్య నదీతీరములయందు స్నానాది పవిత్రులగుచు అచ్చటి జనులు ప్రాణాయామయోగముల చేత ఆత్మస్వరూపానుసంధానులై ఋతవ్రత, దానవ్రత, సువ్రత, నామక చాతుర్వర్ణంబులు యోగాను సంధానపరులై యుందురు. విదృస్త, రజస్తమ, సగుణ, పరమసమాధి, వాయు

దేవుని సేవింతురు. 32 లక్షల యోజనములు వలయముగల శాకద్వీపముచుట్టూ క్షీరసముద్రము నావరించియుండు. యీ క్షీరసముద్రముచుట్టూ పుష్కరద్వీప మావరించియుండును.

## 7- పుష్కరద్వీపము

యీపుష్కరద్వీపముచుట్టూ 64 లక్షల యోజనముల విశాలముగలిగి యుండును. యీ మహాద్వీపమునందు బంగారు పత్రములుగల పద్మములు గలిగియుండును. బ్రహ్మదేవుని నివాసమైయుండును. యీ పద్మములు, ఆసనములుగా, నుపయోగింతురు. మానసారపర్వతమునందుండు వర్షములు యీ పర్వతమధ్యమునందుండు వర్షములెవ్వియనగా యీ పర్వతమునకు మధ్యను వెలుపలను వుండు వర్షములకు మధ్య వ్యవధి 108 వేల యోజనముల ప్రమాణముండు ఉన్నతములై యుండు చదరంబులుగలిగియుండు యీ ద్వీపములకు 4 దిశ లను లోకపాలురపురంబులుండు. యీ పుష్కరద్వీపాధిపతి యగు వీతిహోత్రుండు రమణక, ధాతక, నామంబుల పుత్రులను వర్షధ్యయంబుల నభిషిక్తులంజేసి పూర్వులువచ్చిన మార్గమున తపంబునకేగె. యీ ద్వీపంబున పురుషులు బ్రహ్మ దేవునికి కర్మారాధనము జేయుచుందురు. చాతుర్వర్ణంబులు స్థిరబుద్ధిగలవారలై అభేదంబుగా సర్వసములై యుందురు.

యీ పుష్కరద్వీపముచుట్టూ 64 లక్షల యోజనములు విశాలముగలదై మంచినీళ్ళ సముద్రముచుట్టూ ఆవ రించియుండు. ఆవల లోకాలోకపర్వతములుండు శుద్ధోదక

సముద్రము లోకాలోకపర్వతములమధ్య 2 కోట్ల యోజనములు విస్తారమున నిర్జనభూమియుండు. ఆ భూమి అద్దమువలె వైక్రాంతమణులచ్ఛాయను దేవతా భూమియోగ్యమైయుండు. ఆ భూమిం జేరిన పదార్థములు మరలపొంద నశక్యమైయుండు. అటుమీదట లోకాలోకపర్వతమను సూర్యుని ఉదయపర్వతములుండు. ఉదయపర్వతము వెంటనే 8 కోట్ల యోజనములు సువర్ణభూమియుండు. సూర్యాది ధ్రువాంతములగు జ్యోతిర్గణంబులుండుటచేత లోకాలోకపర్వతంబు లనం బరగియుండును. యీ 500 కోట్ల యోజనములుగల భూమండలము తుదీయాంశ ప్రమాణంబై యుండు. యీ లోకాలోకపర్వతముల మీద అఖిల జగద్గురువగు బ్రహ్మదేవుండు.

వృషభ. పుష్కర, చూడ, వామన, అపరాజితు, సంజ్ఞలుగల దిగ్గజంబులు నాల్గుదిశలయందు నుండు. యీ లోక రక్షణార్థము నిర్మించియుండె. తన కైశ్వర్యముగా నందు దేవ సమూహములకు తేజశ్శౌర్యములు హృదయములయందుంచుకొని శాంతివహించి, వాగ్వాణరూపంబుగానుండు కారణ కాలబలంబుల నిచ్చుచుండు భగవంతుడు ఆదిదేవుండు సాటిలేని వైరాగ్యంబున ఉత్తమజ్ఞాన మహైశ్వర్య మహాత్ములతో ప్రకాశింపుచుండు. విష్వక్సేనుడు మొదలుగా పార్షదులతో కూడి ప్రశస్తనిజవరబలంబున ఆయురారోగ్యముల నిత్య సత్త్వలగుచు ఆ పర్వతముపై సకలలోక రక్షణార్థము కల్పపర్వతము యోగమాయా తన్మయరచితుండై యుండు. వివిధ మంత్రగోప్యసిద్ధికొరకు ఆ పర్వతాగ్రంబున నున్న వరమేశ్వ

రుండు దప్ప లోకాలోకపర్వతంబునకు అవ్వలనెవ్వరులు సంచ రింప నశక్యంబై యుండు. బ్రహ్మాండమునకు సూర్యుడు మధ్య గతుండై సంచరింపుచుండు. 25 వందలకోట్ల యోజన విస్తీ ర్ణాయమానంబగు బ్రహ్మాండకటాహంబున సూర్యుని చేత ఆకాశ, దిర్, స్వర్గ, అపవర్గ, దేవ, తిర్యగ్, మనుష్య, నాగ, పక్షి, తృణ, తరుగుల్మ, లతాది, సర్వజీవజంగమంబులకు నర కాదిగతుల నిర్ణయించి, సర్వజీవులకు సూర్యుం డాత్మయై యుండు. ఇది భూమండల విధానంబు. ఇట్టి అగమ్యస్థానంబు దెలియక అగోచరంబుగానుండు ఇదే పరమాత్మైక్యస్థానంబు. యీ పరమరహస్యంబు నిశ్చల వేదాంతంబని జ్ఞానయోగుల అనుభవంబు అని భాగవత బ్రహ్మాండ పురాణ సిద్ధాంతంబు. ఇదే పరమ గురురహస్యంబు పెద్దలవలన దెలియవలయును.

## 14. భువనముల వివరణము

### 1– పాతాళలోకము–అధోలోకము

అధోభాగంబున ప్రథమలోకాదిగా పాతాళలోక ముండును. బ్రహ్మాండమునకు క్రిందివరుసను చివరిభాగము ఆదిశేషుని యేలుబడియైయుండు. అనంతనామముచేత విరా ట్పురుషుడై యుండు. ఇది ఆదివిష్ణు అవతారము. సర్వలోక మున విరాట్పురుషుడుగా నుండి పూజింపబడుచుండు యీ పాతాళమున బలీంద్ర ముచికుందపట్టణంబులు గలవు. అచ్చటి వారు ఆదిశేషుని పూజాధ్యానారాధనంబులతో సుఖానందం

బున అచ్చటి పుణ్యాత్ములు భక్తులు కడతేరి జన్మ చాలించి, పాతాళలోకమునకు పైగానుండు లక్ష యోజనములయెత్తున నుండు రసాతలమున జనింతురు.

## 2–వ లోకము రసాతలము

యీ రసాతలము అధోలోకపాతాళమునకు లక్ష యోజనములకు పైగా నుండు రసాతలమున భూమి పాషాణమయముగా నుండు. ఇచ్చట నివాతకవచాదులు కాలకేయాదులు అను రాక్షసులుందురు. కేసరి, ఉలోమ, శతసిర, వాసుకి పట్టణము లిందుగలవు. ఇంకా అనేకులు గలరు. ఇచ్చట హిరణ్యాక్షుడు గలడు. యిక్కడివారు ఈశ్వరధ్యానము చేయుదురు. అందరు భక్తపరాయణులైయుందురు. ఇక్కడి భక్తులు, పుణ్యాత్ములు, కడతేరి జన్మ చాలించి యీ లోకమునకు పైగా లక్ష యోజనములయెత్తున నుండు మహాతలమున జనింతురు.

## 3–వ మహాతలము

యీ మహాతలము ఇసుకభూమి, కాద్రవేయులను సర్పములిందు గలవు. కూహక, తక్షక, కాళీయ, సుషేణులు, గలరు. విరేచనుని గృహములందు అగ్నిజింహులు విద్యుజ్జిహుని గృహము విందుగలవు. మహామేఘుని పట్టణము లిందు గలవు. గృహములున్నూ గలవు. యిచట పరమేశ్వరుని ధ్యానపూజనములు చేయుచు భక్తపరాయణులై యుందురు. యిచట భక్తులు పుణ్యాత్ములు యీ లోకమునకు లక్ష యోజనముల యెత్తున తలాతలమున జన్మలెత్తు చుందురు.

## 4-వ తలాతలము

యీ తలాతలమున పసుపురంగుగల భూమి యుండును. యిచ్చట మయుడు రాజ్యము చేయుచుండును. శివుడు త్రిపుర పురములు దహించినపుడు దానవ గృహములు నిర్మించుటకు మయుని విష్ణుదేవుండిచట నిల్పెను. గజకర్ణ, కాలనేమి, సుమాతలి మందిరము లిచట గలవు. వారు పురాధీశ్వరులై యుందురు. వృకాసురాలయమున్నూ, తార్క్ష్యని పట్టణము లిందుగలవు. ఇందువలన నాగు లిచట లేరు. అందరు విష్ణుదేవుని ఆరాధింతురు. ఇక్కడ పుణ్యాత్ములు భక్తులు, యీ లోక మునకు పైగా లక్ష యోజనముల యెత్తున నుండు సుతలమున జనింతురు.

## 5-వ సుతలము

యీ సుతలమున భూమి నల్లగా నుండును. బలిచక్ర వర్తి, ప్రహ్లాదుడు త్రివిక్రమూర్తి చేత నియమింపబడి యిచట నివాసముగా నుందురు. రాజ్యపాలన గావించుచుందురు. బలిచక్రవర్తి రాబోవు మన్వంతరమున ఇంద్రుడగును. ఇతని ద్వారమున విష్ణువును కావలి యుంచిరి. త్రిశిఖర విరాధపట్ట ణము లిందుగలవు. నందకుడు, కపిలుడు, విశాలాక్షుడు, వీరు నివసించియుందురు. వీరందరు విష్ణుభక్తిపరులు. ఇచ్చటి భక్తులు పుణ్యాత్ములు కడతేరి యీ లోకమునకు పైగా లక్షయోజన ముల యెత్తున నుండు వితలమున జనింతురు.

## 6-వ వితలము

యీ వితలమునందు భూమి పాండురవర్ణముగా నుండును. అధికముగా కనకమయమై యుండును. భంజనుడు, హయగ్రీవుడు, నికుంభుడు, గోముఖుడు, నలుడు, మొదలగు వారు దానవు లిందుగలరు. యిచట నివసించుచుందురు. కంబళ, అశ్వతర, తరక్షులను వారి పట్నము లిందుగలవు. వీరు ఈశ్వరు నారాధించెదరు. వీరిలో భక్తులు, పుణ్యాత్ములు, కడతేరి యీ లోకమునకు పైగా లక్ష యోజనముల యెత్తున అతలమున జనింతురు.

## 7-వ అతలము

యీ అతలలోకము భూలోకము క్రిందివరుసను వెంటనే యున్నది. యిచట నల్లని భూమి, యిచట బలాసురుడు అనగా మయుని కుమారుడు షణ్మవతియను భార్యను గలసి 96 విధములగు మాయావిద్యలతో వినోదమార్గముగా క్రీడించి యానందింపుచుండు. ఇతని యావలింతచేత అనేక మంది స్వైరిణులు, పుంశ్చలులు, కామినులు, జారిణులు, జనించి వీరు పాతాళలోకమునకు పోయి బలవంతులగు పురుషులకు, హాటక రసంబను వశ్యసిద్ధక్రియలనిచ్చి మదాంధునిం జేసి, నానావిధములగు 84 బంధవిశేషములతో రతిక్రీడలచేత పరమానందము బొందుచుందురు. నముచి, శంకుకరుడు, కబంధుడు మొదలగు రాక్షసుల గృహము లిందుగలవు. నాగరాజగు ధనుంజయుని పట్టణ మిందుగలదు. ఇచటి పుణ్యా

త్ములు, భక్తులు, ఈశ్వరు నారాధింపుచు, జన్మాంతమున యీలోకమునకుపైగా నుండు లక్ష యోజనములకుపైగా నుండు భూలోకమున జనింతురు.

## 8-వ భూలోకము

యీ భూలోకము జంబూద్వీపమని భారతవర్షమని భూలోకమని ప్రసిద్ధిగలదు. దీనియందు భారతవర్షము, కింపురుషవర్షము, హరివర్షము, ఇలావృతావర్షము, రమ్యకవర్షము, హిరణ్యకవర్షము, కురువర్షము, భద్రాశ్వవర్షము, కేతుమాలావర్షము, అను 9 వర్షములుగా విభజించిరి.

యీ 9 వర్షములున్నూ ఖండములుగా మార్చిరి. యెట్లనగా— భరతఖండంబును, ఇంద్రఖండంబును, చరుఖండంబును, గబస్తిఖండంబును, నాగఖండంబును, తామ్రఖండంబును, వారుణీఖండంబును, సౌమ్యఖండంబును, గంధర్వఖండంబును, అను నవఖండములుగాను, 56 దేశములుగాను 1000 యోజనములు సిద్ధచారణ గంధర్వుల నివాసముగలిగి సేవింపబడుచుండును. అనేక ధాతులోహ పాషాణమయంబై, అనేక రత్నఖనిజమయంబై, 20 లక్షలు మూలికాకరణులు గొప్ప పర్వతములు గలవు. అనగా నీలాద్రియు, కౌమాద్రి, శ్వేతాద్రి, మాల్యవంతము, గంధమాదనము, వింధ్యపర్వతములు గలవు. వీటియందు దివ్యకరుణులు గలవు. సురలు, కిన్నరులు, ఉరగులు, యక్షులు, కింపురుషులు, అందు నివసింతురు. తూర్పున భద్రాశ్వులు, దక్షిణమున భారతులు,

పశ్చిమమున కేతుమాలులు, ఉత్తరమున పుణ్యపురుషులు వుందురు. అచ్చటివారు ఫలరసాదు లాహారము చేతురు. ఆరోగ్యవంతులై చిరాయువుగల్గియుందురు. మామిడిపండ్లరస మాహారముచేయుచు పదివేలసంవత్సరములు జీవింతురు. నిత్యయవ్వనముగలిగి యుందురు. యీ భారతదేశమునను౦డు పట్టణముల వివరము.

## 56 దేశపట్టణముల వివరము

అవంతిదేశము, అంగదేశము, ఆభీరదేశము, ఆంధ్ర దేశము, ఉత్కలదేశము, ఉలూకదేశము, కరూశదేశము, కర్నాటదేశము, కళింగదేశము, కాశ్మీరదేశము, కాంభోజ దేశము, కాశీదేశము, కామదేశము, కురుదేశము, కుకుర దేశము, కుంతలదేశము, కేకయదేశము, కొంకణదేశము, కోసలదేశము, కేరళదేశము, గాంధారదేశము, ఘూర్జర దేశము, చేదీదేశము, చోళదేశము, టెంకణదేశము, త్రిగర్త దేశము, దశార్ణవదేశము, నిషధదేశము, నేపాళదేశము పాంచాలదేశము, పాటలదేశము, పాండ్యదేశము, పుండ్ర దేశము, పుళిందదేశము, బర్బరదేశము, భరుకచ్ఛదేశము, భల్లాటదేశము, భోజదేశము, మధుదేశము, మద్రదేశము, మత్స్యదేశము, మగధదేశము, మళయాళదేశము, మహారాష్ట్ర దేశము, మాళవదేశము, యవనదేశము, రోమకదేశము, రోరుకదేశము, లాటదేశము లోలోరము, వంగదేశము, వన్న దేశము, విదర్భదేశము, విదేహదేశము, శ్రీనరుదేశము,

శూరసేనదేశము, సవ్వీరదేశము, సింహదేశము, సింహళదేశము, సింధుదేశము, హాటకదేశము, ఇవి భారతవర్షమున గల దేశములు.

56 దేశముల దేవతా సంచార పర్వతములు. యీ 56 దేశములందుగల పెన్నిధానములగు పర్వతస్థానములు 11 అనసూయకొండ, అనపర్తికొండ, అంజనాద్రి, అనుముకొండ, అనగాపల్లికొండ, అండమానుదీవులు, అభ్రకంపగిరి, ఆధోని కొండలు, అస్సాంకొండలు, అహోబిలంకొండలు, వినుకొండ, ఉదయగిరికొండలు, ఉదయాద్రికొండలు, ఇంద్రకీలాద్రి, ఎలిగొండ, ఓబలమ్మకొండ, కనిగిరి, కంఠాగిరి, కల్యాణగిరి, కటకపూరుకొండలు. కలువగుంట కనుమబావి దగ్గర దొంగతనము జరిగిన దొంగలను కొండ యీగలుతరిమి గుట్టునట. యితరులను తాకవట. కంభంచెర్వుకొండలు, కాకముఖపర్వతము, కొండవీటికొండను, పార్లుగాడిస్న్ని, పగడపుతీగ చెట్లు గలవు. యివి మనుష్యులను, ఆవులు యెడ్లను చంపును. కొప్పుకొండ, కొండపల్లికొండను అనంతమగు మూలికలు గలవు. కోటప్పకొండ, కోళ్ళపూడికొండ, కొత్తకోటకొండలు, కోలాహలంకొండలు, కురుచేడుకొండలు, కూనూరుకొండలు, గండకీగిరి, గాజులపల్లెకొండ, గిద్దలూరుకొండ, చక్రవాళపర్వతం, చక్రతీర్థంకొండలు, చిమ్మిరిబండకొండలు, చిద్దాద్ కొండలు, బొంబై 20–య్యామడలో పడమట కనుమల అరణ్యములో అర్ధరాత్రమున దేవగంధర్వగానములు, నృత్యములు జరుగు

చుండగా సన్యాసులు, దిగంబరులు, మొదలగువారు చలి కోర్చలేక నెగిళ్లు వేసుకొని ఆ గాననాట్యములు విందురట.

బొంబైకి 20- ఆమడలో చుందూరు కుమారస్వామి స్థానమున అర్ధరాత్రిలో భరతనాట్యమున్నూ, జరుగునట. జోగులు, యోగులు, దిగంబరులు, సాధులు, వెళ్ళుచూతురట. జాతరూప శిలా పర్వతములయందు బంగారు నవరత్నములు దొరకునట. నత్తరామేశ్వరకొండ, నంద్యాలకొండలు, నల్ల మలకొండలలో అనేక శరణులున్నవట. నాగళ్ళపూడిగట్టు, నాగపూరుకొండలు, నాగార్జునకొండలలో దేవశిల్ప చిత్రము లున్నవట. నారాయణకోట, నారాయణకొండలలో తప స్విద్ధులున్నారట, నాసిక్‌కొండలు, నాదెళ్ళకొండలు, నాయకు రాలుకనముకొండలు, నైమిట్టకొండలు, నీలగిరికొండలు, తాడేపల్లికొండలు, తిరుతని మత్స్యములికొండలో గంగానది గలదట. ఆగంగలో, రోగములువచ్చినవారు, మత్స్యములను వండి, బ్రాహ్మణునకు దక్షిణతాంబూలముతో చెల్లించుట కివ్వగా బ్రాహ్మణుడు మంత్రించుచూ 2 చట్లు చేపలు వండి చెల్లించువరకు వక్కొక్కటి బ్రతికిలేచి గంగలో అన్నీ పడి పోవువరకు రోగికి ఆరోగ్యము వచ్చునట. తిరుపతికొండలో మహాత్కారణులున్నవట. త్రిశృంగపర్వతము పుణ్యస్థలము త్రిపురాంతకంకొండలో వయఃకరణులుగలవు. ఋషులు దెచ్చు కొనుచుందురు. సువర్ణకరణులున్నూ గలవు. మహాత్కారణు లున్నూ గలవు. తువ్వపాడుకొండలు, ధత్తాత్రేయగిరి, ధవళే శ్వరంకొండలు, దిగువపాళెంకొండలు, దుందుభిగృహంకొండలు,

పద్మనాభగిరి, పక్షితీర్థంకొండలు, పాణ్యంకొండలు, పాండవ గృహంకొండలు, ఫిరంగిపురంకొండలు, పెనాంగుకొండలు, పుష్కరరాజ్‌కొండలు, బస్రాకొండలు. బదరీనారాయణ కొండలు, బృహదార్ణకొండలు, బండిరెలిగండ్లకొండలో వశ్యకరణులుగలవు. యీ కొండమీది సన్యాసి వక చిన్న దానిపై మనస్సుంచి గృహము దెలుసుకొని వచ్చి పెడగా నుండి చూచుచుండగ ఆ చిన్నదానిసోదరుడు బండికి తారు వేయుటకు చెల్లెలతో చమురుగిన్నె తెమ్మని చెప్పగా తెచ్చి బైటబెట్టి యింటిలో పనులు చేసుకొనుచుండ ఆ సన్యాసి చమురుగిన్నెలో పసరు పిండిపోగా ఆ చిన్నదాని సోదరుడు ఆ చమురుతో బండికి తారువేసి, బండిగట్టుటకు, యెడ్లను దీసుకవచ్చేవరకు, యీ బండి తనంతట సన్యాసివద్దకుపోయి నిలచెను. జనులు బండివెంటబడి సన్యాసివద్దకు వెళ్ళిరి. బ్రహ్మగిరి, బ్రహ్మకపాలం, భద్రాచలం, భీముడుకొలనుకొండలు, భీముడుపట్నంకొండలు, బెల్లంకొండ, బెర్మాకోనలు, భైరవ కోనకొండలు, బొబ్బిలికొండలో ఆబోతుయెద్దు ప్రమాణం పచ్చ గలదట. దినమునకు వకతూరి దాని కిరణములు దిశలకు చిమ్మునట. బొప్పూడికొండలో మహాత్ములు గలరు. బొంబై దగ్గర 32 శిఖరములకొండలు గలవట. మహానదికొండలు, మణిపూర్‌కొండలు, మంగళగిరికొండ, మరోనారాయణ కొండలు, మనుసూర్యాకొండలు, మట్టివాడకొండ, మణిమేఖలా కొండ, మానుకొండ, మాచర్లకొండ, మఖవత్పర్వతము, మైసూరుకొండలలో జలధారలు బంగారు అధికముగా గలదట.

గనులు గలవట. యెలిగొండలో యుగములనాటి ఋషులు గలరట. యఱ్ఱగొండ, యెంగళాయపాలెపుకొండలు, యుసిరిబిజం కొండలు, రణతీర్థంకొండలు, రవ్వలకొండలు, రాయచూరు కొండలు, రాయకూరుకొండలు, రాయగడకొండలు, రామగిరి, రాజమహేంద్రవరంకొండలు రామకూరుకొండలో దేవఋషులు గలరు. లంకమకొండలు, లక్ష్మణజ్వాలకొండలు, లండింగు పర్వతములు, లాహోరుకొండలు, వలపర్లకొండ, వరంగల్లు కొండలు, వంగవోలుకొండ, వింధ్యద్వంతపర్వతము, వృషభధ్వజ పర్వతము, వారిధరపర్వతము, విశాఖపట్నంకొండలు, వెంకట గిరికొండలు, వేజగిరిమలలు, శలమకొండ, శింగరాయకొండ, శింగపూరుకొండలు, శతశృంగపర్వతం, శీతానగరంకొండలు, శీమకుర్తికొండలు, శిశిరబీజంకొండలు, శేషశైలం, శ్రీశైలం, సత్యనారాయణకొండలు, సారంగధరమెట్టు, సావిత్రికొండలు, సింహాచలం, సింహాళంకొండలు, ఆదిశేషునకు వాయుదేవునకు పందెముబడి యెగరగొట్టబడిన మేరుపర్వశిఖరముచీలిక. సూరద్గిరి, సూజ్‌గిరి, సోమిదేవిపల్లికొండలు, సౌమనస్య పర్వతములు, శృంగవంతపర్వతము, హంసమంతపర్వతము, హరిద్వారంకొండలు, హస్నాంకొండలు, హంపీకొండలు, ఇవి వాలిసుగ్రీవులు ఆంజనేయులు నివసించినవి. ఇత్యాదిపర్వతముల యందు సానువులు, చరులు, గృహాలు, బిలములు, దోనలు, నిర్ఝరులు, విశాలస్థలములు, విశాలములయందు దేవతలు, మునులు, ఋషులు, సాధువులు, మహాత్ములు, యోగులు మొదలగువారలకు నివాసం విశ్రమయోగ్యములుగానుండి

మాణిక్య, వజ్ర, కురువింద, సూర్యకాంత, చంద్రకాంత, స్ఫటికముక్తిక, ప్రవాళ, మరకత, పుష్యరాగ, వైక్రాంత, గోమేధిక, వైడూర్యాది, నవరత్నములు, 20 లక్షల మూలికలు, సకలకరణులు, లోహాదులలో సువర్ణ, రజిత, తామ్ర, నాగ, వంత్రపు, ఆయస, కాంతలోహాదులున్నూ, 64 పాషాణములున్నూ, 24 ధాతువులున్నూ, లవణాది ఖనిజములున్నూ, 18 ఉపరసములు, మహారసములున్నూ, మానవులకు పెన్నిధానములుగా నిరంతర ముపయోగములు.

## పట్టణ స్థానములు

అయోధ్య, అరుణపురము, అవంతి, ఆభీరము, అమరావతి, ఇంద్రప్రస్తము, ఉజ్జయనీ, కటకము, కాంచీపురము, కాశ్మీరము, కల్యాణనగరణము, కలశపురము, కౌశాంబిపట్నం, గౌరపురము, గిరివ్రజము, జలంధరపురము, తక్షశిలానగరము, తక్షకనగరము, చేదిపురము, ద్వారకాపురము, ధర్మపురము, పాటలీపుత్రము, పాంచాలనగరము, ప్రాగ్జోతిషము, పాండుపురం, మధురానగరము, భోజపురము, మిథిలానగరము, మానసపురం, మాహిష్మతీపురం, లలితపురం, వైరాటము, సింహాపురం, శ్రీకాకుళం, శ్రీనగరు, హస్తినాపురం, హరిప్రస్థం, మధుర, చేదీపురం, వారణాశి, లోలోరం, ఇత్యాది పట్టణములు అనేకములుగలిగి యీ 56 దేశములందు 4 పట్నములు పేరులేకుండా అరణ్యములగుటచేత 52 దేశములే యున్నట్లున్నూ, తెలియుటచేత అమరావతియు, నందికొండ

ప్రాజక్టున్నూ, ప్రత్యక్షములు. 164 పర్వతములున్నూ, 72 జీవ నదులున్నూ, సర్వజీవకోటికి ప్రాణజీవనాధారములై యుండును.

## 84 జీవులు

శ్లో॥ క్రిమ్యాదేకాదశం లక్షు। దశలక్షో విహంగమః। లక్షాచ్చతుర్ద్విర్యానుష్యా। నవలక్షా జలేచరః। త్రింశ లక్షాం గవాంశాద్యాః। స్థావరోలక్షువింశతిః। చతస్రోశితి। ఏతేభ్యః। లక్షోనిర్మిత విశ్వసృట్॥ అను సూత్రక్రమమున వృక్షాదులు 20 లక్షలు, వృక్షముల నాశ్రయించు క్రిమికీటకములు, 11 లక్షలు, మృగములు 30 లక్షలు, పక్షులు 10 లక్షలు, జలజంతువులు 9 లక్షలు, మానవులు 4 లక్షలు, సృష్టించె. తదుపరి.

## ఆరోగ్యవిషయము

శ్లో॥ శరీరమాద్యం ఖలుధర్మసాధనం। అను సూత్రము ననుసరించి, యీ జంబూద్వీపమందు, భారతవర్షమునగల 56 దేశములలో అష్టాదశవర్ష స్త్రీ పురుష బాల్య యవ్వన, వృద్ధాదులకు ఆరు ఋతువులయందు గలుగు వాత, పైత్య, కఫ, ద్వంద్వ త్రిదోష ఆగంతుక దోషములగు రోగములకు శాంతికరములగునట్లు ఇచట చికిత్సరూపములగు కషాయ చూర్ణ వస్తుగుణములను జనోపయోగముగా 50 సంవత్సరముల నుండి ప్రత్యక్షానుభవముగా వర్తమానము నడచుచున్నవి గనుక ఇవి నమ్మి సేవించిన శీఘ్రాయురారోగ్యసుఖముల బొందుచున్నారు.

శ్లో॥ పూర్వజన్మకృతంపాపం। వ్యాధిరూపేణ బాధితం। తఛ్ఛాంతే రౌషధై ర్దానై జపహోమసురార్చనైః॥ అను సూత్రక్రమంబున పూర్వజన్మ ప్రారబ్ధమువలనగాని క్రిందటి ఋతువునందును, వర్తమాన ఋతువునందును, భుక్త్యాది పదార్థముల వ్యత్యాసముచేత కల్గినదోషములను జరాదులను యితర రోగములను కల్గినపుడు మానవుడు యేపనిచేయుటకు వనికిరాడు. గనుక పనిచేయక లాభముండదు. లాభములేక స్థాయిగలుగదు. గనుక మానవుల కారోగ్యము ముఖ్యావసరము. ఆయురారోగ్య బలతేజస్సులు మానవునకు చతుర్విధ పురుషార్థసాధకములు గనుక, సర్వజనోపకారమని యిట్లు వ్రాసియుంటిని. బుద్ధిమంతులు ఇవి గ్రహించి ఆరోగ్యసుఖముల బొంది సుఖింతురుగాక.

శ్లో॥ 'పృథ్వ్యసహ్యాంశయోరోషధీ వనస్పతయః॥' యీ సూత్రక్రమమున బ్రహ్మదేవుండు లోకజన పోషణార్థముగా 25 లక్షల యోజనములు విశాలారణ్యములుగా ఏర్పరచి వృక్షమూలికాదులను పృథ్వ్యంశమున మధుర రుచిగలవిగాను జలభూతాంశమున లవణరుచిగలవిగాను, అగ్న్యంశమున కారపురుచిగాను, భూమ్యగ్నులచే తీపులు రుచిగలవిగాను, ఆకాశాంశమున చేదు రుచిగలవిగాను, నిర్మించెను. షడ్రుచులు శరీర ధాతువులను వృద్ధిపరచును.

శ్లో॥ కటుకాద్వర్ధతే మాంసం। కషాయా చ్ఛోణితం రసాత్। లవణాద్వర్ధతేమస్తి। ఆమ్లం మజ్జా ప్రవర్ధనం। మధురాద్వర్ధతే శుక్రః। తిక్తోన్మేధ ప్రజాయతే॥ యీ సూత్రక్రమమున

అనగా కారమువలన మాంసవృద్ధిన్నీ, వగరు వస్తువులచేత రసవృద్ధిన్నీ, ఉప్పురుచివలన శల్యములవృద్ధిన్నీ, పులుసువలన మేదోవృద్ధిన్నీ, మధురవస్తువులవలన వీర్యవృద్ధిన్నీ, చేదువస్తువులవలన కొవ్వువృద్ధిన్నీ గల్గును. యీ షడ్రసాదులవలన శరీర బలసౌష్టవము గలుగునట్లు ఆయుర్వేదమార్గమున సృష్టికాండమున ప్రచురపరచె.

షడ్రుతువులలో కాలదోష, పదార్థదోష, అజ్ఞానదోషాదుల శాంతికొరకు ఆరోగ్యము గలుగుటకొరకు ఓషధీగణములను ఇచట కొన్ని వ్రాయబడును. గర్వించక వీటిని సేవించిన వారికి శీఘ్రాయురారోగ్యసుఖములు గల్గును. యిప్పటికి 50 సంవత్సరములనుండి వాడుకలో నున్నవి ఇచట వ్రాయబడును.

## రోగశాంతులకు ఓషధీగణములు

త్రికటవులు—అనగా శొంఠి, పిప్పలి, మిరియములు— వీటి కషాయ చూర్ణములతో కఫము, కాస, మేహము, జ్వరము, అగ్నిమాంద్యము హరించును. వస్తువు బేడయెత్తు.

త్రిఫలములు— వీటి చూర్ణ కషాయములతో అనగా కరక్కాయలు, తాడికాయలు, ఉశిరికలు. వీటిని సేవించిన పైత్యము, మేహము, విషము, హరించును.

త్రిజాతకములు— అనగా యాలకులు, లవంగములు, దాచనచెక్క వీటిని సేవించిన కఫము, వాతము, విషము, కాసము హరించును.

త్రిసమములు- కరక్కాయ, బెల్లము, శొంఠి; నూరి వుండలుచేసి పుక్కిటవుంచి వూటమ్రింగుచుండిన శ్వాసకాసలు హరించును.

త్రిసుగంధములు- లవంగములు, ఏలకలు, జాజికాయ, ఇవి వూట మింగుచుండిన కఫవాతము హరించి, వయస్థాప్యము గల్గును.

త్రికార్షికలు- అతివస, తుంగముస్తలు శొంఠి, వీటివలన ఆమ్లాతిసారము గ్రహణులు హరించును.

మధురత్రిఫలి- ద్రాక్ష, ఖర్జూరం, దానిమ్మపండు, వీటి కషాయము కఫవాతహరమై ధాతువృద్ధి గల్గును.

సికతాత్రయం- బెల్లం, కలకండ, శక్కర, వీటివలన కంఠరోగం, కఫపిత్తం. తీంద్ర, హరించును.

త్రిక్షారంలు- సజ్జక్షారం, యవక్షారం, వెలిగారం, వీటివలన వేడినీటితోయిస్తే కఫవాతశూలలు హరించును.

చాతుర్జాతకము- యాలకులు, లవంగములు, దాజిన చెక్క, ఆకుపత్రి' యివి చూర్ణకషాయములతో అతిసారము రక్తపైత్యములు హరించును.

చతుస్సమములు- కరక్కాయ, శొంఠి, బెల్లము, ఇవి చూర్ణించియిచ్చిన ఆమాతిసారము మందాగ్ని హరించును.

చతురూషణములు- శొంఠి, పిప్పిలి, మిరియములు, మోడి ఇవి చూర్ణకషాయముయిస్తే శ్వాస, కాస, అగ్ని మాంద్యము, గుల్మము మేహము, హరించును.

చతుర్గ్రంధులు– శొంఠి, వెల్లుల్లి, అల్లము, పిప్పలి యీ కషాయ చూర్ణములతో వాతము, ఆమాతిసారము హరించును.

చతుర్బీజములు– మెంతులు, కస్తూరి, పసుపు, వాము, నల్లతెగడ, యీ చూర్ణకషాయములతో అగ్నిమాంద్యము, ఆమవాతము, గ్రహణులు హరించును.

యక్షకర్దచతుష్కము– పచ్చకర్పూరము, చందనము, కుంకుమపువ్వు, కస్తూరి, వీటి సేవచేత ఇవి మాత్రలు గురిగింజ ప్రమాణములుయిస్తే శీతము, చర్మదోషము, రొమ్మునొప్పి తలనొప్పి, హరించి దేహకాంతినిచ్చును. విషము, అసాధ్య శిరోరోగము శైత్యము హరించును.

తృణపంచమూలములు– దర్భ, రెల్లువేళ్ళు, వెర్రిచెరుకు గరికవేళ్లు, వీటి కషాయములతో సర్వోన్మాద పైత్యములు హరించును.

లఘుపంచమూలములు– పల్లేరువేళ్లు, వాకుడువేళ్లు, ములకవేళ్ళు, కోలపొన్న, ముయ్యాకుపొన్న, వీటి కషాయము త్రిదోషజ్వరములు, వాతజ్వరములు, దగ్గులు, శూలలు, మందాగ్ని హరించును.

పంచతిక్తలు- కటుకరోహిణి, గంటుభారంగీ, నేలవేము, తిప్పతీగ పుష్కరమూలముల యీ కషాయము యిస్తే అష్టవిధ జ్వరములు హరించును.

తిక్త పంచకము- చేదుపొట్ల, కటుకరోహిణి, ముస్తలు, కరక్కాయ, అతిమధురము యివి కషాయముతో విషమ జ్వరములు మానును.

అమృతపంచకం- తిప్పతీగ, అడ్డసరం, మారేడు, చేదుపొట్ల, వీటి కషాయముతో వాతపిత్త, కఫపిత్త, ద్వంద్వ, జ్వర, విషమజ్వరములు హరించును-

ధాన్యపంచకం- ధనియాలు, వట్టివేళ్ళు, మారేడు పిందెలు, శొంఠి, ముస్తలు, యీ కషాయమున అగ్నిమాంద్యము, మలబంధము, పిత్తాతిసారము, హరించును.

బలాఖ్యపంచమూలం- ఆముదపువేళ్ళు, ముత్తువపుల్లం వేరు, తెల్లగలిజేరు, కోలపొన్న, ముయ్యాకుపొన్న వేళ్లు, కషాయముతో శోభజ్వరములు హరించును.

నిశాపంచకం- పసుపు, తిప్పతీగ, దుష్టుపువేరు, పాచితీగ, నేలతాడి, యీ కషాయము నీరస జ్వర దోషములు హరించును.

పంచవల్కలములు-మర్రిచెక్క, అత్తిచెక్క, రాగిచెక్క, జువ్విచెక్క, ప్రబ్బఆకు, వీటి కషాయంతో అయిదు విధములగు శగజాడ్యములు, వాపు, రక్తదోషము హరించును. వ్రణములున్నూ మానును.

మహాపంచమూలములు- మారేడు, నేలగుమ్మడి తక్కిలి, కలిగొట్టు, దుండిగం యీ కషాయమున వాతపిత్త,

కఫవాత, కఫపిత్త, ద్వంద్వజ్వర, విషమజ్వర, త్రిదోషజ్వర, వ్యాప్యజ్వరములు మానును.

జీవక పంచమూలములు- జీవకం, వృషభకం, మేద, మనుబాలా, శతావరి, వీటి కషాయంచేత శ్లేష్మవాత, వాతపిత్త, నేత్రవ్యాధులు హరించును.

జీవకాదిగణములు- జీవకం, వృషభకము, మేధ, మహామేధ, కాకోళి, క్షీరకాకోళి, పిల్లపెసర, కారుమినుము, మనుబాల, అతిమధురము, నేలతాడి, శీతావరి, అశ్వగంధి, వీటి కషాయంతో జీవశరీరములకు బలమున్నూ, శరీరతేజస్సు, పుష్టి, శుక్రవృద్ధి, వృష్యము, శీతము, స్తన్యము, గర్భవృద్ధి, శోషహరము, తృష్ణహారము, రక్తపిత్తహారము, మూత్రశోష, జ్వరములు, దాహములు, విషములు, వాతపిత్తములు, హరించి వయస్థాప్యము గల్గును .

పంచభద్రలు- తిప్పతీగ, పర్పాటకము, ముస్తలు, గంటుభారంగి, నేలవేము; వీటి కషాయముతో సర్వవిధ జ్వరములు మానును.

పంచభృంగములు- దేవదారు, జమ్మి, అతివస, వావిలి చిగురు, పసుపు, వేపాకు, గలగర, తాళిశపత్రి, ఇవి నీటిలో వేసి కాచి ఆరోగ్యముగోరువారు శని బుధవారములలో స్నానము చేసిన ఆయురారోగ్య సుఖములు గల్గును.

పంచబీజములు– సన్నావాలు, జీలకర్ర, వాము, గస గసాలు అజామోదము వీటి చూర్ణమువలన సర్వ కఫవాత ములు హరించును.

పంచసారంలు– తేనె, నేయి, పాలు, మజ్జిగ, శర్కర, ఇవి సేవించినవారికి విషమజ్వరములు, రొమ్మునొప్పి, శ్వాస, కాస, క్షయలు హరించును.

ఖర్జూరపంచకం– ఖర్జూరము, గుమ్మడిపండు, మామిడి పండు, మజ్జిగ, పచ్చకర్పూరము, పానకము, ఇవి వేసంగిలో గ్రీష్మఋతువున వాడతగినవి. ఆకలిదప్పులు శాంతిపడి పుష్టి నిచ్చును.

పంచమూలములు– చిత్రమూలం, జిల్లేడు, మునగ, వరగోగు, దుష్టువేరు, యీ కషాయంతో సర్వ కఫవాత జ్వరములు హరించును.

పంచకోలములు– పిప్పలి, మోడి, చవ్యం, చిత్ర మూలం, శొంఠి. యీ కషాయము సన్నిపాతము, గుల్మము, ప్లీహము, ఉదరము, అనాహము, అనగా రొమ్మునొప్పి, శూల, మందాగ్ని–హరించును.

హరీతకీపంచకం–కరక్కాయలు, వాము, సైంధలవణం, మిరియాలు, శొంఠి–వీటి కషాయంతో అజీర్ణము, మందాగ్ని, హరించి ఆకలి బుట్టించును.

పంచసుగంధలు- తక్కోలం, వక్కలు, లవంగంలు, జాజికాయ, పచ్చకర్పూరం, ఇవి రక్తపిత్తం, ముఖదుర్గంధం, పీనస, కఫవాతము హరించును.

పంచక్షారములు-సజ్జక్షారం, యవక్షారం, వెలిగారము, వుత్తరేణిక్షారం, తింత్రిణీక్షారము, ఇవి కఫవాత హారములు. శూల, గుల్మము, అజీర్ణములు హరించును.

పంచలవణములు- సైంధవలవణం, సౌవర్చలవణం, బిడాలవణం, కానలవణం, సముద్రలవణం- ఇవి కఫము, వాతము, శూలలు, హరించి, నేత్రవాతమును వృద్ధిచేయును.

పంచగవ్యములు- గోమయం, గోమూత్రం, పాలు, పెరుగు, నెయ్యి, ఇవి దేహశుద్ధి, కఫహారము చేయును. అజీర్ణము హరించును. అపశ్మృతి జ్వరములు, హరించును. భూతబాధలు హరించును.

పంచామృతాలు- తిప్పతీగ, శొంఠి, పల్లేరు, శతావరి, నేలతాడి, యీ చూర్ణకషాయములు సంతుష్టి, పుష్టిగలిగించి, మేహశాంతి చేయును.

పంచముష్టికలు- యవలు, రేగువిత్తులు, వులవలు, పెసలు, ముల్లంగిదుంపలు, వీటి యూషము వాతపిత్తము, కఫము, గుల్మము, శూల, శ్వాస, కాస, క్షయ, జ్వరము, సర్వరోగములు హరించును.

ముష్కకాది గణం- మొక్కపుచెట్టు, బ్రాహ్మిజెముడు, త్రిఫలములు, చిత్రమూలం, చంద్ర, ఇవి అర్శస్సు, అశ్మరి, పాండువు, మేహము, మేదోరోగము హరించును.

పంచకందలు- యర్రపొన్నగంటి, నూగుదోస, నేల తాడి, అడవిశనగ, సర్పాక్షి- ఇవి దేహశుద్ధి లోహశుద్ధి చేయును. క్షయహరము, శరీరస్థిరత్వము, చేయును. సర్వ వ్యాధులు హరించును, కందజాతి మూలవ్యాధి హరించును.

పంచపల్లవములు- మాదీఫలం, వెలగపండు, నేరేడు విత్తులు, మామిడి, మారేడు- వీటితో కాచిన నీళ్లు స్నానము చేసిన ఆయురారోగ్యకరములుగా నుండును.

పంచామ్లములు- పులిచింత, రేగు, పుల్లప్రబ్బలి, నారింజ, నిమ్మ, ఇవి శీతలము రక్తపిత్తము, వైగంధ్యము, పీనస, కఫదోషము, హరించును.

వేపపంచాంగం- వేపచెట్టు, వేరుచక్క, ఆకు, పువ్వు, కాయ, ఇవి రక్తదోషము, పిత్తము, దురద, వ్రణము, కుష్టువు, దాహము, తాపము, హరించును.

పల్లేరు పంచాంగము- ప్రతివృక్షముయొక్క పంచాంగమునందును, పంచభూతాంశములచేత, ఒక్కొక్క ప్రసిద్ధిగుణము కలిగియుండును. పల్లేరు పంచాంగమునందు వేరు, పట్ట, ఆకు, పువ్వు, కాయ, వీటియందు వగరు, చేదు, మధురము, గలిగి శరీరము తేలికనిచ్చును. జ్వరము, పిత్తము, వాతరక్తము,

పురద, దాహము, మేహము, కుష్టువు, మూలవ్యాధి అమ్లమును, హరించి, యవ్వనము నిచ్చును.

పంచపిత్తాలు— ఒంటె, ఏనుగ, దున్న, పంది, మేక, వీటి చేదులు, కుందేలు, మొసలి, నెమలి, కోడి, చేప, వీటి చేదులున్నూ, ఏకదోష, ద్విదోష, త్రిదోష, సన్నిపాత, ఆగంతుక, నేత్రదోష, సర్వదోషములు, శ్వాస, కాసలు, క్షయాది రోగములు హరించును.

షడ్రసాలు— మధురం శుక్రవృద్ధి, వుప్పు శల్యవృద్ధి, కారం మాంసవృద్ధి, వులుసు మెదడువృద్ధి, వగరు రసవృద్ధి, చేదు కొవ్వును వృద్ధిచేయును.

కలింగపట్కము— కరక్కాయలు, అతివస, సైంధవ లవణం, ఇంగువు, పుచ్చకాయ, ఇవి రక్తాతిసారము శూలలు హరించును.

పడూషణములు— అనగా పంచకోలములున్నూ, మిరియములున్నూ, ఇవి విశేష అగ్ని గలిగించి, కఫవాత హారమై యుండు.

ప్రాణకరపట్కము— నూతన మాంసం, మృద్వన్నము, క్షీరభోజనం, నెయ్యి, ఉష్ణోదకము స్నానము, ఇవి ప్రాణము నకు బలమిచ్చును. ఇవి ప్రాణరక్షణకరములు.

ప్రాణహరపట్కము— పాతమాంసము, వయసుమిగిలిన స్త్రీ సంభోగము, ఉదయకాల సంభోగము, ఉదయము ఎండ

కాయుట, రాత్రి పెరుగన్నము దినుట, పగటి నిద్ర, ఇవి కొన్ని నిమిషములలో శీఘ్రముగా ప్రాణబలము హరించును.

షట్చరణములు- చిత్రమూలము, కొడిశపాల, విష బొద్ది, కటుకరోహిణీ, అతివస, కరకవలుపు, యీ చూర్ణం నేడినీటితో యిస్తే, మేధస్సునందు కఫముగల్గిన వ్యాధులు హరించును.

లక్షాదిషట్కములకు- యష్టిమధుకము, మంజిష్టి, చాగ, చందనము, సుగంధపాల, వీటి పానాభ్యంజనమువలన, జ్వరహరము, ఆరోగ్యము గల్గును.

షట్సుగంధములు- జాజికాయ, లవంగములు, వక్కలు, సుగంధపాల, తక్కోలపువ్వు, అతి మధురము ఇవి ధాతు వృద్ధిన్ని, బలము, నేత్రవాతము, కంఠవాతము, కేశవాతము గల్గును.

సంతర్పణ పట్కము- ద్రాక్ష, నిమ్మపండు, ఖర్జూర పండు, శర్కర, పేలాలు, తేనె, నెయ్యి, ఇవి చలువచేయును. నేత్రదోషములు హరించును. బలమిచ్చును, హృద్యముగ నుండును, వీర్యవృద్ధి గలిగించును.

షట్ప్రస్తములు- నీళ్లు, పెరుగు, పాలు, ద్రాక్ష కషాయము, నెయ్యి, ఇవి వండి తేనె చేర్చి, సేవిస్తే, పిత్తకాసలు నశించును. పిత్తమేహములు, రొమ్మునొప్పి హరించును.

సప్తోపవిషములు- జిల్లేడు, నాగటిగడ్డ, బొమ్మజెముడు, ఉమ్మెత్త, నీరు పిప్పలి, గన్నేరు, గురిగింజలు, నల్లమందు,

ష్టి కఫవాతములు, విషరోగములు, వీటికి ఉపకారమున్నూ, తిరిమ్మా సమయములలో మహోపకారముచేయును.

సప్తముష్టికలు— వులవలు, యవలు, రేగువంట్లు, పెసలు, ముల్లంగిగడ్డలు, శొంఠి, మిరియాలు, ఇవి యూషము కాచియిచ్చిన దీర్ఘ వాత, సన్నిపాత జ్వరములు హరించును.

క్వాదసప్తకము— సుగంధపాల తు 20 పిరంగిచెక్క తు 10 యేలకులు తు 5 శొంఠి 5 ధనియాలు తు5 తంగేడు పుష్పరేకులు తు 5 ఇవికషాయముకాచి శర్కర వేసిపుచ్చుకొనిన కాఫీ అవుసరములేకుండా చేయును. మేహాశాంతి దారుణములు నశించి శాంతిగలిగి నిష్టపరులకు సర్వకాలోపయోగముగా నుండును.

అష్టవర్గులు— బుద్ధి, వృద్ధి, కాకోళి, క్షీరకాకోళి, మెద, మహామెద, జీవకం, వృషభకం ఇవి వీర్యవృద్ధి, పైత్యహరం, ఆయురారోగ్యములు, యిచ్చును. చిన్నవాళ్ళకు 2–4 చిన్నములు, పెద్దవాళ్ళకు 4–5 చిన్నములు వాడేది. ఇది కాబోలు దేశమున, దొరకును. వీటికిబదులు వస్తువులు యిక్కడ దొరకును.

లఘ్వష్టవర్గులు— భూశర్కర, పెన్నేరు, నేలతాడి, కన్యకుమారి, శతావరి, పెద్దదూలగొండి, కారుమినుము, కారుపెసర, ఇవి పుష్టి, బలము, తేజస్సు, ఓజస్సు, జ్ఞానము, వివేకము, సర్వకార్య సాధకము సమర్థతాశక్తి యిచ్చును.

అష్టధాతువులు– బంగారు, వెండి, తామ్రము, సీసము, తగరము, సత్తు, ఇనుము, కాంతము, ఇవి మూలికలకంటె సహస్రభాగములు, బలముగలిగించును, మానవులకు కాయసిద్ధి అధికముగా నిచ్చును. ఆయురారోగ్యములు స్థిరముగ నిల్చును.

అష్టగంధములు– పచ్చకర్పూరము, మంచిగంధము, తుంగముస్తలు, కుంకుమపువ్వు, దేవదారుచెక్క, గోరోచనం, అగరు, నాగకేసరం, ఇవి శీఘ్రశుభము, భోగార్థము, ఆయురారోగ్యకరములుగా నుండును.

అష్టాంగావచూర్ణం– గుమ్మడిపేకు, పుష్కరమూలము కర్కాటకశృంగి, త్రిఫలంలు, దూలగొండి, అజామోదం, వీటి చూర్ణం తేనెతోయిస్తే త్రిదోషజ్వరములు, ఎక్కిళ్ళు, ఉబ్బసం, గొంతుపట్టుట, ఊర్ధ్వకఫం దిగును. అల్లపురసంతో యిచ్చినను సర్వకఫములు దిగును.

అష్టాంగధూపం– గుగ్గిలం, మవాసాక్షి, వేపాకు, వస, కోష్టు, కరక్కాయ, యవలు, ఆవాలు, వీటి ధూపముతో, దీర్ఘవ్యాపక జ్వరములు, భూతప్రేతపిశాచములు వదలును.

అమృతాష్టకం– తిప్పతీగ, కొడిశపాల, వేపచెక్క, చేదుపొట్ల, కటుకరోహిణి, శొంఠి, చందనం, ముస్తలు, యీ కషాయంతో, పిప్పలిచూర్ణం కల్పియిస్తే, పిత్తశ్లేష్మజ్వరములు హరించును.

పునర్నవాష్టకం- గలిజేరు, వేపవేరు, చేదుపొట్ల శొంఠి, కటుకరోహిణి, తిప్పతీగ మానుపసుపు, కరక్కాయ యీ కషాయంతో సర్వశోభలు, ఉదరశూలలు, పార్శ్వ శూలలు, శ్వాసయుక్తపాండువు, ఇవి హరించి, ఆరోగ్యము గలుగచేయును.

క్షీరాష్టకం- ఉత్తరేణిక్షారం, మోదుగు, జిల్లేడు, నువ్వులకట్టె, చాగ, యవదంటు, సజ్జక్షారం, వెలిగారం, ఇంగువ, వేగిస, మొక్కపుచెట్టు, యీ క్షారములు, దేహములు లోహములు శుద్ధిచేయును. సర్వశూలలు హరించును.

అష్టమంగళఘృతం- వస. కోష్టు, వల్లాకి, ఆవాలు, సుగంధపాల, సైంధవ లవణం, పిప్పళ్లు, వీటి కషాయంలో నేయి చేర్చి, వండి యీఘృతము, శిశువులకు, పెద్దవాళ్లకి స్త్రీ, బుద్ధి మేధాశక్తి, జ్ఞాపకశక్తి, కలిగి అపస్మారము, పిశాచబాధలు తొలగును.

అష్టవిధభస్మములు- మద్దిక్షారం కఫనాశనం, జిల్లేడు క్షారం, గుల్మరోగహారం, కోడిశక్షారం, సర్వదోషములు హరించును. మౌక్తికభస్మం, పైత్యనాశనం, గుండెకు బల మిచ్చును. అగ్నిదీపనంగల్గును. శిలాజితుపిత్తాధిక్యమువలన గలిగె మేహం నశించును. కఫవాతహారం, అగ్నిదీప్తి గల్గించును. కానుగక్షారం రుచికరం, వాతనాశనం, పటిక దంత దార్ఢ్యము నిచ్చును. శుక్తిక్షారం బూతుహరించును. జంతు నాశము చేయును.

అష్టాంగంలు– దేవదారు, నేలవేము, శొంఠి, ముస్తలు, కటుకరోహిణి, కోడిశపాల, ధనియాలు, గజపిప్పలి, యీ కషాయం తంద్రశూల, ప్రలాపం, అరుచి, దగ్గు, మరుపు, మాంద్యము, మైకము, శ్వాస, సన్నిపాతము మానును.

అష్టమూత్రములు– వంటె, ఏనుగ, గుర్రం, గాడిద, ఆవు, యెనుము, మేక, మనిషి యీ మూత్రంలు లోహ రస విషపాషాణములు, శుద్ధులు చేయును. శోభాది, కుష్ఠు వ్యాధులు మాన్పును.

అష్టమహారసములు– అభ్రకం, వైక్రాంతం, మాక్షికం, గుగ్గిలం, శిలాజితు, తుత్తం, పుల్లిపాషాణం, కఫరి, లోహసిద్ధి, దేహసిద్ధి, చేయును. వీటి గుణప్రభావములు అనంతరములు, వీటి గుణములు తెలిసిన చిరంజీవిత్వారోగ్య బలాదులు గల్గును.

ఊషకాదిగణం– చౌడు, పూనీరు, సైంధవ లవణం, శిలాజితు, పుష్పకాసీసం, వాలుకాసీసం, ఇంగువ, మైలతుత్తం, ఇవి శోధకులకు కల్పవృక్షములు, వీటిని శోధనమారణాది క్రియలు దెలిసిన, సిద్ధులు, పెన్నిధానములుగా జూతురు.

నవవిషములు– కాలకూటం, వత్సనాభం శృంగకం, దీపనం, హాలాహలం, బ్రహ్మపుత్రకం, హారిద్రం, సక్తుకం, సౌరాష్ట్రికం, ఇవి మహావిషములు– అత్యుగ్రగుణములుగలవి, జీవులం జంపును.

నవఉపవిషములు- జిల్లేడు, పొత్తినాభి, గురిగింజలు, గన్నేరు, విషముష్టి, ఉమ్మెత్త, నేపాళం, గంజాయి, ఇవి నవ వుపవిషములు, ఇవి అత్యుగ్రవేగము గల వస్తువులు, జీవుల బాధించును.

నవరతనములు- కెంపు, వజ్రం, పవడం, పచ్చ, గోమేధికం, పుష్యరాగం, నీలం, వైడూర్యం, మరకతం, ఇవి ధరించిన, నవగ్రములు అనుగ్రహింతురు. తేజస్సు, ఆయురారోగ్యములు వేల సంవత్సరములు జీవింతురు. శక్తియు, గల్గును.

హింగునవకం- ఇంగువ, పుష్కరమూలం, తుంబురులు, కరక్కాయలు, నల్లతెగడ, బిడాలవణం, సైంధవలవణం, యవక్షారం, శొంఠి, ఇవి గుల్మశూలలు హరించును.

నవధాన్యములు- గోధుమలు, వడ్లు, కందులు, పెసలు, శనగలు, అలచందలు, నువ్వులు, మినుములు, వులవలు. ఇవి నవగ్రహములకు దానపదార్థములు. ఇవి 18 రకములు, ధాన్యములుగలవు. లోకజనరక్షకత్వము గర్భసంతుష్టి గలిగించునవిగా నుండును.

నవాంగయూషం- పెసలు, పుశిరికలు, యవలు, దానిమ్మకాయబెరడు, కర్కంధువు, యెండుముల్లంగి, శొంఠి, పిప్పళ్ళు, వులవలు, ఇవి కఫకాసను, హరించును.

నవాంగక్వాథం- శొంఠి, తిప్పతీగ, తుంగముస్తలు, నేలవేము, వల్లేరు, ముయ్యాకుపొన్న, కోలపొన్న, ములక,

వాకుడు, యీ కషాయంతో, కఫవాతజ్వరం, వాతపిత్తజ్వరం, హరించును.

దశమూలాలు— మారేడు, గుమ్మడి, తక్కిలి, కలిగొట్టు, దుండీగం, కోలపొన్న, ముయ్యాకుపొన్న, ములక, వాకుడు, పల్లేరు, ఇవి త్రిదోషజ్వరాలు, విషమజ్వరాలు, శూలలు, వాతములు, హృద్రోగాలు, హరించును.

మధురాదిగణం— అష్టవర్గులున్నూ జీవంతి, అతిమధురం, కలిసి మధురాదిదశగణమగును. పిత్తోధరము హరించును. బలము పుష్టి ఆయుర్వృద్ధినిచ్చును.

దశాంగలేపం— దిరిశనచెక్క, అతిమధురము గ్రంధితగరం, రక్తచందనము, జటామాంసి, మానుపసుపు, కస్తూరిపసుపు, చంగల్వకోష్టు, కురువేరు, ఇవి చూర్ణించి, తేనెతో పూసిన, విసర్పి, దుష్టవ్రణం, శోభలు హరించి, శరీరకాంతి, శాంతిగలును.

క్షారదశకం— మునగముల్లంగి, మోదుగు, చుక్కకూర, చిత్రమూలం, వుత్తరేణి, అరటి, చెరుకు, వేము, అల్లం, యీ క్షారములు, మహోపయోగములుగానుండు.

దశాంగధూపం— తేనె, ముస్తలు, నెయ్యి, గంధం, గుగ్గులుశిలాజిత్తు, సరళకం, సిహ్లాకం, సిద్ధార్థం, యీ వస్తువులు, ధూపంవలన, సర్వదోషములు శాంతించును.

ద్వాదశాంగాలు— వేము, అతిమధురం, ముస్తలు, పర్పాటకం, చేదుపొట్ల, అడ్డసరం, వట్టివేరు, త్రిఫలాలు

కోడిశపట్టు, యీ కషాయచూర్ణములచేత, విస్ఫోటములు హరించును.

త్రయోదశాంగాలు- ఇది ముస్తకాదిగణం, తుంగ ముస్తలు, వస, చిత్రమూలం, మానుపస్పు, కటుకరోహిణి, బండిగురివిందచెక్క, నల్లజీడి, విషబొద్ది, త్రిఫలాలు, అతివస, కోష్టు, ఏలకులు, తెల్లవస, ఇవి యోనిదోషమును చనుపాలను హరించును. నల్లజీడి శుద్ధిచేయవలెను.

త్రయోదశాంగ- లోద్రాదిగణం, లొద్దుగు, తెల్లలొద్దుగు, కచోరం, గిలిగిచ్చ, అనగాగజ్జల, సరళదేవదారు, గుమ్మడిచెకు, సన్నరాష్ట్రిం, కడిమి, అరటి, అశోకం, ముస్తలు, నూగుదోస, అందుగు, ఇవి యోనిదోషం, విషదోషం, కఫదోషం, మేధస్సును హరించును. స్తంభనకారి, కాంతికరము, బలమిచ్చును. అతిసారము, ఆమదోషము, రక్త, శ్వేతప్రదరలు, శాంతించును. యీ చూర్ణం సర్వ మేహాలను మాన్పును. వ్రణములపై చల్లితే మానును.

చతుర్దశాంగములు-వేము, కటుకరోహిణి, కొడిశపాల, ధనియాలు, దశమూలాలు, యీ కషాయం, వాతాధిక్యము పురాణజ్వరము, సన్నిపాతము, మానును. తెగడ చేర్చిన కషాయం, సర్వదోషములు హరించును.

పంచదశమూలంలు- యీ కషాయం కటుకరోహిణి, విష్ణుక్రాంత, ఈశ్వరి, వావిలి, చిత్రమూలం, గచ్చవేరు,

ఉత్తరేణి.......... .......... .......... ..........
.......... మద్ది, .......... .......... ఎదురాకు, పిప్పళ్లు, యీ కషాయముతో, సూతికాజ్వరము, విషమజ్వరం, సర్వజ్వరాలు, హరించును. కఫవాతాలు హరించును.

అష్టాదశమూలాలు– ఇదే బౌనకషాయము అని యూనాదులు, మొదలగు మూర్ఖజాతులు వాడుదురు. ముత్తువపుల్గం, మునగచక్క, చిత్రమూలం, జిల్లేడు, పులిమిరి, మసుబాల, తెల్లవుప్పి, నల్లవుప్పి, వంపెన, గూడపాల, వీటి కషాయంతో సర్వదోషజ్వరాలు, విషత్రిదోషములు నశించును.

అష్టాదశ వుపరసాలు– గంధకం, ఇంగిలీకం, తాళకం, మణిశిలస్రోతోంజనం, వెలిగారం, రాజావర్తం, చుంబకపాషాణం, పటిక, శంఖం, కటీగైరికం, కాసీసం, రసకం, కపర్దం, కురువిందం, యిసుక, బోళం, కుంకుష్టకం, సౌరాష్ట్రిం, ఇవి వుపరసాలు, ఇవి మానవులకు సంజీవివలె ఉపకరించును.

అష్టాదశ మూలకషాయం– దశమూలాలు, కచోరం, కర్కాటకశృంగి, పుష్కరమూలం, దురదగోండి, శొంఠి, కోడిశవిత్తులు, చేదుపొట్ల, కటుకరోహిణి, యీ కషాయం, సన్నిపాతజ్వరాలు, రొమ్మునొప్పి, పక్కనొప్పులు, శ్వాస, ఎక్కిళ్లు, వాంతి, హరించును.

అష్టాదశాంగ చూర్ణం– ద్రాక్ష, తిప్పతీగ, కచోరం, కర్కాటకశృంగి, పుష్కరమూలం, దురదగోండి, శొంఠి, కోడిశవిత్తులు, చేదుపొట్ల, కటుకరోహిణి, పుశిరికలు, ధని

యాలు, నాగుదోసవాకుడు, ముచుకందం, యీ చూర్ణం, జీర్ణజ్వరం, అరుచి, శ్వాస, కాస, పడిశము, నశించును.

అష్టాదశ సురసాదిగణం— తులశి, కృష్ణతులశి, నల్లగరిక, తెల్లగరిక, మరువం, కట్పలం, ఎలుకచెవి, కశివెంద, తుమ్మి, చేదరాశి, భారంగి, బండిగురువిందచెక్క, కామంచి, బోడతరం, విషముష్టి, కామంచిగడ్డి, జటామాసి, ఇవి స్థౌల్యము, మదము, దురద, కఫము, హరించును.

వింశతిక్షారాలు— మొగలి, అరటి, చాగ, కలిగొట్టు, కానుగ, తాలం, హింతాలము, నేలపురిరిక, నల్లజిల్లేడు, తెల్లజిల్లేడు, కాడజెముడు, బొమ్మజెముడు, మద్ది, మునగ, అవిసె నల్లవెంపలి, తెల్లవెంపలి, పసుపు, మానుపసుపు, వరగోగు, మందాత, దొండ, ఇవి 20-న్ని క్షారప్రధానములు, ఇవి మానవులకు బహూపకారములు.

ఏకవింశతి- వరుణాదిగణం, పులిమిరి, అవిసె, మారేడు, ఉత్తరేణి, చిత్రమూలం, చిన్ననెల్లి, పెద్దనెల్లి, మునగ, కారుమునగ, చిన్నవాకుడు, పెద్దవాకుడు, చిన్నగోరింట, పెద్దగోరింట, ములుగోరింట, చాగ, మద్ది, నేలవేము, దుష్టపు, దొండ, కానుగు, శతావరీ, వీటి కషాయం, కఫము, మేధస్సు, గుల్మము, అర్శస్సు, శిరశ్శూల, అభ్యంతరవిద్రధి మానును.

ద్వాత్రింశదంగ కషాయం— భారంగి, వేము, వేపచెక్క, ముస్తలు, కటుకరోహిణి, వస, శొంఠి, పిప్పలి, మిరియాలు, అడ్డసరం, వెర్రిపుచ్చ, దుంపరాష్ట్ర, గూడపాల, చేదుపొట్ల,

దేవదారు, పసుపు, కలిగొట్టు, దుందిలం, వల్లారి, మానుపసుపు, అతివస, తిప్పతీగ, తెల్లతెగడ, పుష్కరమూలం, కలుగ్రానుగు, వాకుడు, ములక, కొడిశపాల, త్రిఫలం, కచోరం, యీ కషాయంతో 13 సన్నిపాతాలు, 18 శూలలు, 5 కాసలు, 5 హిక్కలు, అర్శస్సులు, కడుపుబ్బరాలు, వూరుస్తంభం, అంత్రవృద్ధి, కంఠరోగం, అరుచి, సంధివాతం హారించును.

ద్వాత్రింశదంగ- మహాతిక్తకషాయం, కుష్టాది మేహములకు, ఏడాకులపొన్న, అతివస, రేల, కటుకరోహిణి, ముస్తలు, విషబొద్ది, వట్టివేరు, త్రిఫలాలు, చేమపాట్ల, వేపచక్క, పర్పాటకం, దురదగొండి, చందనం, పిప్పళ్లు, గజపిప్పళ్లు, పద్మకాష్టం, పసుపు, మానుపసుపు, వస, వెర్రిపుచ్చ, శతావరి, సుగంధపాల, గూడపాల, కొడిశపాల, అడ్డసరం, చాగ, తిప్పతీగ, నేలవేము, అతిమధురం, కలుగ్రానుగు, యీ కషాయంతో కుష్టులు మానును.

క్షారకల్పన- యే మూలికయైనను, కాల్చి భస్మము చేసి, నీటిలో 2 దినములు వూరించి, తేర్చి, వడకట్టి, మట్టిపాత్రలో, ఇనుకకాచిన, చోడువలెనుండు ఉప్పు వచ్చును. 2-3 చిన్నములు తేనెతో వాడినయెడల, ఆ మూలికకు చెప్పిన గుణముకు 10 రెట్లుగా గుణమిచ్చి శీఘ్రముగా పని చేయును. వాత, పైత్య, కఫ, శూల, అజీర్ణ, అతిసారములు, మానుట ప్రత్యక్షార్థము. ఇట్టి లవణములు అవుషధమునకు తోడుచేసివాడిన, మానవులకు, ఆయురారోగ్య బల తేజో

వృద్ధిగలిగి, సకలవిధ కార్యములు, కాఠిన్యములైన పనులైనను సుసాధ్యముగా సాధించుటగల్గును. ఆరోగ్యము గలవాడు పనులు చేసినట్లు రోగి చేయలేడు. దేవతలు అమృతపానము వలన, స్థిరారోగ్యబలములు, సంపాదించిరి. మానవులకా భాగ్యములేదు. కొంతకాలము, గడచువరకు, అర్బుద శంఖములు కోటానుకోట్లుగా, మానవోత్పత్తి చేసి యహంకార వ్యామోహములు కల్పించగా స్త్రీలవలలో దగిలి, వ్యామోహులై, నిరంతరసంగమాపేక్షలతో సప్తధాతుబలములు నశించి, దుర్బలులై, వ్యాధులచేత అసంఖ్యములుగాచచ్చి, నూటికి కోటికి నొకరుగా మిగిలి నిర్జీవులైయుండగా, వారలు సజీవులుగాను, ఆరోగ్యవంతులుగాను, బలవంతులుగాను, చేయుటకు, భక్తులు, మహాత్ములు, ఋషులు, దేవతోపాసనాపరులు బయలుదేరి, త్రిమూర్తులను, త్రిశక్తులను, దిక్పాలకులను, నవగ్రహములను, ఋషులను, యాచించి, అశ్వినీ దేవతుల సహాయముచేతను, ఆయుర్వేదము భిక్షారూపముగా నడిగితెచ్చి నిర్జీవులను సజీవులుగాను, రోగులను ఆరోగ్యవంతులుగాను, దుర్బలులను బలవంతులుగాను, చేయగా, మిగిలి బ్రతికియున్నవారికి పుట్టిన సంతతులే యిప్పటికి బ్రతికి ప్రబలముగానున్న లోకస్థులని తెలిసేది. ఆయుర్వేదము స్థిరాయురారోగ్యము నిచ్చు కల్పవృక్షము.

84 లక్షల జీవములలో– ఓషధీ వృక్ష మూలికాదుల నాశ్రయించి యందు క్రిమికీటకములలో 11 లక్షలు గలవు గనుక, వాటియందు కొన్ని యిచట వ్రాయబడును.

క్రిమికీటకములు– 11 లక్షలు: అంబారికాడలు, ఆరుద్ర పురుగులు, ఇలకోళ్ళు, ఇంద్రభోగపురుగులు, ఉసుళ్ళు, ఎఱ్ఱలు, కందిరీగలు, కాళ్ళజెఱ్ఱులు, కొండచెదలు, కొరివి చీమలు, గండుచీమలు, గొడ్డీగలు, గోమార్లు, యెఱ్ఱచీమలు, చిమటలు, తుమ్మెదలు, తేనెటీగలు, తూనిగలు, తేళ్ళు, దోమలు, పట్టుపురుగులు, సూర్యపుటపురుగులు, లద్దెపురుగులు, బుడ్డబురుజులు, బొద్దిపురుగులు, మిన్నల్లులు, మెరుగుడు బూచులు, వానపాములు, సాలెపురుగులు, మండ్రగబ్బలు, వీటిలో పంచరంగులు గలిగియుండును. ఇవి వృక్షమూలముల నాశ్రయించి యుండును.

పక్షిజాతులలో 10 లక్షలు గలవు– ఇచట కొన్ని వ్రాయబడును. ఇవి వృక్షముల కొమ్మల నాశ్రయించియుండునవి. యేవనగా–అడవి పిచ్చుకలు, పావురములు, అడవికోళ్ళు, ఉల్లంకులు, కక్కెరపిట్టలు, కారుకోళ్ళు, కాకులు, కోకిలలు, కొంగలు, కొండకాంచనపిట్టలు, కౌజులు, గద్దలు, గడ్డిపిట్టలు, గబ్బిలంలు, గరుడపక్షులు, గండభేరండములు, గూబలు, గోరువంకలు, గొడ్డుబాతులు, చిలుకలు, చింతొక్కలు, జుట్టుపిట్టలు, జొన్నంకులు, జెముడుకాకులు, డేగలు, తీతువలు, దొమ్మరిపిట్ట, నీరుకాకి, నీరుకోడి, నెమలి, పచ్చపిట్ట, పమిడికంటె, పిచ్చుకలు, పిగిలిపిట్టలు, పుంజులు, పూరేళ్ళు, పొన్నంగులు, పోలుగపిట్టలు, బాతులు, బెగ్గురుపక్షులు, రాంబందులు, రాతిగువ్వలు, లావుకపిట్ట, నిప్పుకోడి, హంస, ఇత్యాదులు గలవు. వీటిలో పంచవన్నెలుగలవిగా నుండును.

ఇవి క్రిమికీటకములను భక్షించి మత్స్యములను వృక్షఫలము లను, భక్షించి జీవించును.

మృగములు- 20 లక్షలలో కొన్ని యిచట వ్రాయ బడును. అడవిపంది, అలంపోతు, ఆలవ, ఉడతలు, ముంగి సలు, యంత్రవలు, వుడుములు, యెనుబోతులు, యెలుగు గొడ్లు, ఏదుపందులు, ఏనుగలు, కస్యాలేళ్ళు, కంచిమేకలు, కన్నంగులు, కుక్కలు, కురుబోతులు, కొర్నగండు, కొండ ముచ్చు, కంచరగాడిద, కుందేలు, ఖడ్గమృగము, గాడిద, గుఱ్ఱము, చిరుతపులి, చిట్టెలుక, పందికొక్కు గరిటెకొక్కు, జాగిలము, తొండ, తోడేలు, దుప్పులు, దున్నలు, నక్కలు, నలికంటికీచులు, పంపులు, పిల్లులు, పునుగుపిల్లి, కొండబల్లి, మేక, రేచు, శివంగి, యొంటె, సింహము, యీ మృగము లలో పంచెవన్నెగలవిగానుండును. యీ మృగములకు పక్షిజాతులు, క్రిమికీటకములు, భక్షణార్థములుగా నుండును. యీ మృగముల, చర్మములు, గోళ్ళు, శల్యములున్నూ, దంతములు, మానవులకు ధూపములు, శరీరరక్షణకు ఉపయో గములుగానుండు. పూర్వులున్నూ వాడిరి.

ఏనుగులు, ఒంటెలు, ఎనుములు, యెద్దులు, దున్నలు, బఱ్ఱెలు, మేకలు, గొఱ్ఱెలు, వీటి మాంస చర్మములు, క్షుద్రమానవోపయోగముగా నుండును. సృష్టి ప్రారంభమున బ్రహ్మదేవుండు మూర్ఖజన తండములను, 20 లక్షలు వృక్ష ములుగాను, 30 లక్షలు పశుమృగాదులుగాను మార్చి

సృష్టించెను. యీ సర్వసృష్టిజీవులున్నూ, మానవోపయోగ ములుగా నుందురు. వీటి సాహాయ్యముల చేత కర్మవృత్తులు నడిపించుచుందురు.

సర్పజాతులలో శిరస్సున చుట్టకుదుళ్ళుగలవి భూమిని మోయు శేషుని సంతతి యుందురు. కర్కోటక సంతతులున్నూ, పూర్ణ పడిగల నాగులు, అర్థపడిగల నాగులు, ఉద్దండ శూర త్వముగలవి, నాగులు, నలుపు, తెలుపు, రెండు జాతులు ప్రశస్తము, యెర్రతాచు కొండతాచులు వీటిలో నున్నవట. మిన్నాగులు మొగిళ్ళయందును రక్తపింజరలున్నూ గలవట. జెర్రులు కొండచిలువలు, శిఖండులు, నూనెపలుగుడు, పురి కోసలు, పక్షుల కాహారములుగా నుండును. ఇవి అనంత జాతులుగా నుండును. సర్పవిషము, అవుషధోపాయంబులుగా నుండును. ఇది అమృత స్వరూపముగా నుండును. అమితముగా సేవించిన మృత్యువై చంపును. సర్పముల చేమలు, శిరస్సున నుండు మణులు, మానవోపయోగములు ప్రాణరక్షణము లుగా నుండును. యింతవరకు భూమి నాధారముగానుండు జీవుల సృష్టించె. మరియు.

మత్స్యవర్గము— 9 లక్షలు. కొన్ని యిచట వ్రాయ బడును. సముద్రమున అగ్నినక్రమను మొసలి గలదు. దాని మావి 'అంబరు' యని ప్రసిద్ధి. దీని క్రయము తులము 100 రూపాయలుండును. సూతికావాతము, పక్షవాతము, హరించి, వీర్యవృద్ధిచేయును. యిది శాస్త్రప్రమాణము జలమందుబుట్టు, మత్స్య విశేషములు. ఆవిలము, ఇంగిలము, ఇసుకదొందులు,

ఉలసచేపలు, ఉల్లంచేపలు,యంద్రకాయలు,కర్ణవశమత్స్యము, కాకిచిప్పలు, నత్తలు, కొరమీను, కోడజెల్ల, కోలవాసాలు, కుక్కనాలుకలు, గండెపక్కెలు, గర్గర మత్స్యము, గొరకలు, చంద్రవంకలు, చందువాచేపలు, చాగలములు, చిత్రాయలు, చంబాలకములు, చేదుపక్కెలు, టేకులు, జలగలు, తాబేళ్ళు, తిమింగిలములు, నఖంచిప్పలు, నల్లజెల్లలు, నారజెల్లలు, నాలుకచేపలు, నెత్తాళ్ళు, పరిగలు, పండుగొప్పలు, పాటమీలు, బాలచుంబాలకుం, బర్బరమత్స్యములు.

బాడసుమత్స్యము- బీరుకమత్స్యము, బొమ్మిడాలు మట్టగిడసలు, మలుగులు, మహాషీమత్స్యములు, ముత్యపుచిప్పలు, మెట్టమీలు, మొసళ్ళు, వాలగలు, వాతికమీనులు, సోలమోసలు, శంబూకములు, శంఖములు, శుక్తిగుల్లలు, యీ మత్స్యవర్గమునందు పంచవన్నెల మత్స్యములున్నూ గలవు వీటి శల్యములు, చేమలు ముండ్లున్నూ, మానవులకుపయోగములు. మృగ, పక్షి, భూత, ప్రేతములకు, క్షుద్రజాతులకున్నూ, భక్షణార్థములై యుండు.

84 లక్షల జీవులలో స్వేదజ (చెమటవలని బుట్టేవి) ఉద్భిజ (భూమిని బగులగొట్టుకొని పుట్టేవి) అండజ-గుడ్లవలన బుట్టేవి. జరాయుజ-మావివలన బుట్టేవి. ఇవిగాక పంచభూతాంశములచేత, అనగా పృథివీయంశముచేత చతుష్కోణాకారముగాను, జలాంశము చేత, అర్ధచంద్రాకారముగాను, అగ్నియంశమున, ఊర్ధ్వత్రికోణాకారముగాను, వాయు

హాంశమున దీర్ఘషట్కోణాకారముగను, ఆకాశమున కైవారా కారముగను, యీ పంచాకారరూపములుగా బ్రహ్మదేవుండు సృష్టించి జగమభివృద్ధిచేసెను. యీ భారతవర్షమునబుట్టి, చిద్విలాసములుగా సృష్టించెను.

## జీవభక్షణ పదార్థములు

మన్ను భక్షించేవి 4 లక్షల జీవములున్ను, ఉదక భక్షణగలవి. 8 లక్షలున్నూ, అగ్నిభక్షణచేసేవి, 3 లక్షలున్నూ, వాయుభక్షణచేసేవి, 3 లక్షలు జీవములున్నూ, చీకటి భక్షించేవి, 3 లక్షలు జీవములున్నూ, యెండను భక్షించేవి, 3 లక్షల జీవములు, వెన్నెలను భక్షించేవి, 3 లక్షల జీవములు, రాళ్ళను భక్షించేవి, 4 లక్షలు, కట్టెలను భక్షించేవి, 3 లక్షల జీవములు, పొగను భక్షించేవి, 3 లక్షల జీవములు. గడ్డి భక్షించేవి, 3 లక్షల జీవములు. ధాన్యపు కంకులు భక్షించేవి, 3 లక్షల జీవములు. ఆకులు భక్షించేవి, 7 లక్షల జీవములు. ఫండ్లు భక్షించేవి, 3 లక్షల జీవములు. దుంపలను భక్షించేవి, 3 లక్షల జీవములు. మకరందమును భక్షించేవి, 4 లక్షల జీవములున్నూ, అన్నము భక్షించేవి, 1 లక్ష జీవములు. మాంసభక్షణచేసేవి, 16 లక్షల జీవములు. రక్తభక్షణజేసేవి, 8 లక్షల జీవములు. యెముకలను భక్షించేవి, 2 లక్షల జీవములు. మలమును భక్షించేవి, 1 లక్ష జీవములున్నూ సృష్టించెను. మరియు.

జీవా ద్యాయుః ప్రమాణములు

చెదలు పురుగులు, 7 దినములు జీవించును. కోళ్ళు, 8 సంవత్సరములు జీవించును. గద్దలు, 8 సంవత్సరములు జీవించును. వృషభములు 8 సంవత్సరములు జీవించును. లేళ్లు, 12 సంవత్సరములు జీవించును. ముంగిసలు, 12 సంవత్సరములు జీవించును. కుక్కలు, 14 సంవత్సరములు జీవించును. హంసలు, 15 సంవత్సరములు జీవించును. మేకలు, 16 సంవత్సములు జీవించును. కంచరగాడిదలు, 20 సంవత్సరములు జీవించును. నెమళ్లు, 20 సంవత్సరములు జీవించును. పందులు, 20 సంవత్సరములు జీవించును. బర్రెగొడ్లు, 25 సంవత్సరములు జీవించును. పొంటెలు, 25 సంవత్సరములు జీవించును. గోవులు, 25 సంవత్సరములు జీవించును. గుర్రములు, 25 సంవత్సరములు జీవించును. గాడిదలు, 25 సంవత్సరములు జీవించును. దుప్పులు, 36 సంవత్సరములు జీవించును. పెద్దపులులు, 64 సంవత్సరములు జీవించును. యేనుగలు, 120 సంవత్సరములు జీవించును. మానవులు 120 సంవత్సరములు జీవింతురు. కోతులు, 300 సంవత్సరములు జీవించును. యెలుగుబంట్లు, 300 సంవత్సరములు జీవించును. కప్పలు, 300 సంవత్సరములు జీవించును. కాకులు, 1000 సంవత్సర జీవించును. సర్పములు. 1000 సంవత్సరములు జీవించును. సింహములు, 100000 లక్షల సంవత్సరములు జీవించును. శరభమృగములు, 100000 సంవత్సరములు జీవించును.

పిల్లమేతలకు 2 కాళ్ళతో 2 యేనుగలను తన్నుకపోయే గండబేరుండ పక్షులు, 10 లక్షల సంవత్సరములు జీవించును.

క్రిమికీటకములు, 11 లక్షలు. కూర్మ మత్స్యాదులు, 9 లక్షలు. పక్షులు, 10 లక్షలు. మృగములు 20 లక్షలు. పశువులు 10 లక్షలు. వృక్షమూలాదులు, 20 లక్షలు. మానవులు, 4 లక్షలు. యీ మొత్తం 84 లక్షలు. జీవజన్మంబులతో జంబూద్వీప భారతవర్షము, సంపూర్ణచిద్విలాసముగా సృష్టించి, యీ జంబూద్వీపాధారుండగు, బ్రహ్మదేవుండు.

## త్రివిధ సృష్టులు

శ్లో॥ ఊర్ధ్వసాత్వికమిత్యాహు। ర్మధ్యే రాజసముచ్యతే। అధోగతం తామసంచ। గుణత్రయమితీరితం॥ యీ సూత్రక్రమంబున, ఊర్ధ్వమున దేవతాలోకమున్ను, మధ్యను మానవలోకమున్ను, అధోభాగమున, నరకలోకమున్ను, ఇవి త్రిగుణవిభాగములచేత 9 భాగములుగా, సర్గముల సృష్టించెను.

యీ జంబూద్వీపమున స్వాయంభువ మనువును ప్రథమ మనువుగా నిల్పి, యీ మనువు కుమారుడు ప్రియవ్రతుడు, రాజ్యభారము మాని, దైవచింతనలోనుండగా, బ్రహ్మదేవుండు వచ్చి రాజ్యభారంబు ధరించుట యత్యావసరంబని బోధించి అర్బుదసంవత్సరములు రాజ్యమేలించెను. యీ ప్రియవ్రతుని కుమారుడు అగ్నీంద్రుని జంబూద్వీపమునందు పట్టాభిషిక్తుని చేయగా సింహాసనాధిపత్యము వహించి

యేలెను. యీ యగ్నీంద్రుని కుమారుడు వృషభుడు, యీ వృషభుని కుమారుడగు భరతునకు పట్టాభిషిక్తుని చేసి యేలించి నందున, భరతఖండమని ప్రసిద్ధి గలిగెను. యీ భరతుడు వేదాచారక్రమములు ఆగమక్రమంబుల యజ్ఞహోమము, షట్శాస్త్రధర్మములు, 32 విద్యలు, 64 వృత్తివిశేషములు, 32 వాస్తువిధానములు చిత్రశిల్పములు, సకలధర్మ విధివిధానములు, వివర్శ చేయుటచేత ప్రసిద్ధికెక్కినవాడాయెను. యీ భారతవర్ష గృహస్థాశ్రమ ధర్మస్థులకు బదరికాశ్రమమున నుండు శ్రీమన్నారాయణుండు, సాంఖ్య, తారక, అమనస్కయోగక్రమంబుల బోధించి, ఉపదేశములనిచ్చి కృతార్థుల చేయుచుండు ఆదేవునిం గొలిచి, పూజారాధనములు చేయుచుందురు. యీ భారతవర్షమున సారాంశములగు పర్వతములు, పుణ్యతీర్థములు, పవిత్రస్థానములు, గలవు. ఆ నదీతీరముల స్నానసంధ్యానుష్టానములు చేయు పుణ్యాత్ములు, ముక్తులగుదురు. యీ భారతవర్షమున జనించు, పురుషులు, త్రివిధ కర్మములంజేసి, శుక్ల, లోహిత, కృష్ణవర్ణరూపంబులుగా నుందురు. సాత్విక, రాజస, తామస కర్మంబులంజేసి, దేవ, మానవ, తిర్యక్, సూకరజన్మములనెత్తి, పుణ్య పాప ఫలితముల బొంద నర్హులుగానుందురు. హిమవత్పర్వతమునకు దక్షిణముననుండు భూమి కర్మభూమియగుటచేత నచ్చటివారు కర్మమూలక దుఃఖములం బొందుచుందురు. సుకృతకర్మలు చేయుటచేత స్వర్గాధివాసమున్నూ, దుష్కృతములచేత నర

కాధివాసములున్నా, యీ రెండు భారతవర్షమున కరతలా మలకమని ప్రసిద్ధి.

యీభారతవర్షమున రాగద్వేషరహితులై అవాఙ్మానస గోచరుండు, నిరంజన, నిరామయ, నిర్గుణపరబ్రహ్మయొక్క సగుణరూపమును నిశ్చలచిత్తముననిల్చి, భక్తియోగమున నారాధించెడు మహాత్ముల హృదయగ్రంధి దహానంబుగావించి, పరమభాగవతోత్తములంజేసి, ఉత్తమగతి లాభమును బొందించును. భారతవర్షము మహత్తరమైనదని, స్తుతింపుచు, యీ భారతవర్షమున భగవంతు డవతారములెత్తి, వచ్చి గురు రూపంబున యోగోపదేశబోధల చేయుచు కృతార్థులజేయుట గాక తన యవతారములను కథాశ్రవణములచేత కొనియాడి పూజించి, జపించువారలకు హారి సకలాభీష్టసిద్ధు లిచ్చు చుండును.

## యితర వర్ష ఆచారములు

ఇతర వర్షములయందు, భగవధ్యానములేక చేయు యజ్ఞతపోదానంబులు, యెన్ని చేసినను, వారికి పశుమృగాదుల వలె జన్మములు దప్పవు. యీ భారత వర్షమున, ముహూర్త మాత్రము సర్వసంగపరిత్యాగియై, వైరాగ్యముననున్న, పురుషశ్రేష్టునకు భగవత్ప్రసాదప్రాప్తి అతి సులభముగా నుండును. భగవద్భక్తియు, విష్ణుకథాలాపములు, దేవతోత్సవములు యెచ్చట లేకుండునో అది అమరలోకంబైనను అజ్ఞాన మృగమండలంబగును. అమరలోక నివాసులైనను,

జ్ఞానానుష్ఠానంబుల చేతను తపోహోమాది విధికలాపంబుల, సిద్ధిబొందకున్న భారతవర్షమున, జన్మించక తప్పదు. భారత వర్షమున మానవజన్మమెత్తి శ్రద్ధాయుక్తముగా ననుష్ఠింపకుండి సిద్ధిబొందకుండిన తనకుతానె బంధకంబుల బొందువాడగును. శ్రద్ధచేత జపతప, అనుష్ఠానములు, యజ్ఞహోమములు, చేయగా, వేల్వబడిన హవిస్సు పెక్కునామములచేత, పరమేశ్వరుండు భక్తియధికపరచి, భారతవర్ష ప్రజల కరుణించి ఇహాపర సౌఖ్యముల నిచ్చుచుండును.

యీ జంబూద్వీపమున, సగరచక్రవర్తి కుమారులు అశ్వమేధయాగము చేసి, అశ్వము వెంట దగిలి, పోవుచుండగా, అధోద్వీపములకుపోయి అదృశ్యముకాగా, అశ్వమును వెదకుచు భూఖనములుచేయగా ఆ ఖనన ద్వారమున, పోగా, స్వర్ణ ప్రస్థయు, చంద్ర-శుక్లావర్త, రమణకమందేహారుణ, పాంచ జన్య-సింహళ లంకాద్వీపములను యీ 8 ద్వీపములు గను పించె. యీ జంబూద్వీపము లక్షయోజనములు గలదై యుండును. యీ లోకము దేవతామయమైయుండును.

## కామ్యార్థ సిద్ధి దేవతలు

భారతవర్షమున, కామ్యార్థసిద్ధినిచ్చు దేవతలు గలరు. అనగా బ్రహ్మవర్చసు గోరువాడు బ్రహ్మదేవుని పూజా జపధ్యానములచేత సిద్ధించును. ఇంద్రియపాటవ కామునకు ఇంద్రుండును, ప్రజాకామునకు దక్షాది ప్రభృతులున్నా, లోకజన కామునకు దక్షాది ప్రభృతులున్నా, లోకజన

కామునకు అదితియు, స్వర్గ కామునకు ఆదిత్యులు రాజ్య కామునకు విశ్వదేవతలు, దేశప్రజాసాధన కామునకు సాధ్యులున్నూ, స్త్రీ కామునకు దుర్గయు తేజఃకామునకు అగ్నిదేవుండును, వసుకామునకు వసువులు, వీర్యకామునకు రుద్రులు, ఆయుఃకామునకు అశ్వినీదేవతలు, పుష్టికామునకు భూదేవియు, ప్రతిష్టాకామునకు గగన భూదేవతలున్నూ, సౌందర్యకామునకు గంధర్వులు, కామినీకామునకు అప్సరసలున్నూ, ఊర్వసులున్నూ, సర్వాధిపత్యకామునకు బ్రహ్మదేవుండున్నూ, కీర్తికామునకు యజ్ఞములు, విత్తసంచయకామునకు ప్రచేతసులు, విద్యాకామునకు ఈశ్వరుడున్నూ, దాంపత్యకామునకు మా దేవియు, ధర్మార్ధకామునకు విష్ణుదేవుండున్నూ, సంతానకామునకు పితృదేవతలున్నూ, రక్షాకామునకు యక్షులున్నూ బలకామునకు మరుద్గణములున్నూ.

రాజ్యకామునకు మనురూప దేవతలున్నూ, శత మారణకామునకు నైరుతియు, భోగకామునకు చంద్రుడు, యీ దేవతా మంత్రములచేత పూజానియామక జపసిద్ధి బొందిన, దేవతా సాహాయమువలన ఆయా కార్యములు ఫలించి సిద్ధిబొంది సుఖింతురు. భోగమోక్షముల నిత్తురు. యీ మంత్రములు, గురువులవలన విధివిధానములు దెలిసి చేయవలెను. స్వయముగా గ్రంధములలో మంత్రములు జపించి మనోదుఃఖముల పాలుకాకూడదు అని భాగవత ప్రమాణము.

## నవవర్షముల వివరము– ఇలావృత వర్షము

అధిష్ఠాన బ్రహ్మపట్న మధ్యస్థయగు యిలావృత వర్షమున కధీశ్వరుండగు, పరమశివుండు నిత్యమంగళ విగ్రహుండై యోగభోగంబుల నిత్యానందపరుండై, భక్త రక్షణాభీష్ట ఫలప్రదుండై, సర్వజగంబులకు భుక్తిముక్తుల నిచ్చుచు, విరాట్పురుషునివలె, సర్వలోకము సమదృష్టి నేలుచుండు. యీ గంభీర దీప్తవంతమగు యీ యిలా వర్షమున, చంద్రసూర్యులు, నక్షత్రములు, అధిక ప్రకాశము గల్గియుందురు. సుందర ప్రకాశ పద్మములవంటి శరీరములుగల్గి, కమలనేత్రలు, పద్మగంధులు, అధిక సౌందర్య సమేతలై, గజసమాన జంబూఫలరసంబుల పానంబుచేత నిత్యజీవనులై అధిక శుభానురాగములతో, 13 వేల సంవత్సరములు, ఆయుష్యముగలిగి, జీవింతురు. యీ యిలావృత వర్షమునకు, తూర్పు దిగ్భాగంబున॥

## భద్రాశ్వవర్షము

తూర్పుదిశ భద్రాశ్వవర్షమున, భద్రశ్రవుండను పేరు పొంది, కీర్తివంతుడై, మేరుధీరసముధైర్యుండై, సముద్రాంత జగతినేలుచు, ఆ రాజుకు ఇష్టదేవతయగు హయగ్రీవమూర్తిని సేవించుచుందురు. స్తోత్రపూజానుష్ఠాన తపోవంతులై, కాలము గడుపుచుందురు. మంత్రసిద్ధినిపొంది భుక్తిముక్తు లనుభవించు చుందురు. హయగ్రీవునిదలంచి ధన్యులగుచుందురు. ఆకుపచ్చ,

నలుపు, తెలుపు వర్ణములుగలిగిన వృక్షములుండును. కాల జంబులను 5 పర్వతములున్నూ, వేలకువేలు కొండలున్నూ, దేశములున్నూ, శంఖావతి, శీతల, భద్ర యను నదులున్నూ, శంఖచ్ఛాయగల మానవులున్నూ, బంగారుచ్ఛాయగల వారున్నూ, వుందురు. పుణ్యాపరులు, సమర్థులు, సుగుణులు, వందల సంవత్సరములాయుర్దాయము గలవారుగా నుందురు. జనార్దనుడు, హయగ్రీవుడు, చతుర్భుజుడునై యుందురు. యీ మహాత్ముని శిరస్సు, హృదయము, శేషము, పాదములు, హస్తములు, కన్నులు, యీ స్థానములు, కృత్తికా నక్షత్ర మందు పూజింతురు.

## కింపురుషవర్షము

యీ ఇలావృతవర్షమునకు ఆగ్నేయ దిశయందు కింపురుష వర్షమున మానవులు విద్యాపాండిత్యముగలిగి, 10 వేల సంవత్సరములు ఆయువుగలిగి యుందురు. స్త్రీపురుషాదులు రోగశోకభయములులేక మనోహరమగు జువ్విపండ్లరసం బాహారంబుగలిగి, తృప్తిచెందుచు, స్త్రీలు ఉత్పలగంధులు పద్మపత్రాక్షులై అస్ఖలితనవయవ్వనులై, పూర్ణచంద్రముఖులై, ప్రకాశమానమృదుశరీరులై యుందురు. రామభద్రుండు సీతాలక్ష్మణసమేతులై, కింపురుషగళంబులచేత, పూజింపబడు చుండు వారికి భుక్తిముక్తు లొసంగు చుందురు.

## భారతవర్షము

బ్రహ్మపట్నాధిష్టిత, జంబూద్వీప ఇలావృతవర్ష దక్షిణ భాగమున నుండు భారతవర్షమునందు, బ్రహ్మ క్షత్రియ

వైశ్య శూద్ర మ్లేచ్ఛ పంచమ ఛండాలాది 18 కులములలో వేదాచారశిష్టులు, కులవంశ ఆచార ప్రవర్తకులు షట్కర్మాధికారులు, అష్టాంగయోగపరులు, సాంఖ్య, తారక, అమనస్కయోగనిష్టులు, కేవల సమాధిపరులు, అచలవిద్యాధికారులు, గలరు. ఇట్టి భారతవర్షమున బ్రహ్మ, విష్ణు, ఈశ్వరాదులు, అవతారముఎత్తి, గురురూపములతో యోగమార్గాదివిధులు బోధించి, పూజింపబడుచు, కృతార్థులచేయుచుందురు. అభీష్టసిద్ధులిచ్చుటకు కల్పవృక్షములవలె వెన్నంటియుందురు. యీ భారతవర్షమున కూర్మరూపుండగు విష్ణుదేవుండు ప్రధానమూర్తియై, భుక్తిముక్తుల నిచ్చుచుండును. శైవమత సంబంధమున ఈశ్వరుండును, అధర్వణవేదశిష్టాచారమున బ్రహ్మదేవుండును, వీరు అధిష్టానగురువులై యుందురు.

హరివర్షము

బ్రహ్మపట్నమునకు నైరుతిదిశయందుగల హరివర్షమున సుఖాస్పదులై, 108 వేల సంవత్సరములువరకు అయుష్యము గలిగి, యిక్షురసపానమున తృప్తిజెందుచు, జరాశోకరోగంబులు లేక బంగారుచ్ఛాయగల దేహములతో అభినవ మన్మధుల వలె నుందురు. దేవతాలోకమున పుణ్యము నశించి, యీ భారతవర్షమున జనింతురు. పరిశుద్ధ స్వభావులుగా నుందురు. అక్కడనుండు మానవ దైత్యదానవులు, స్నానసంధ్యానుష్టానపరులై యుందురు. హరివర్షపతియగు నారసింహమూర్తిని, పూజింపుచుందురు. అచ్చట జనులు స్థిరబుద్ధిగలిగి యుందురు.

రమ్యాదుకూలములు ధరించి, మంత్ర జప స్తోత్రపఠనధ్యాన తపస్సమాధులచేత, నరసింహదేవుని కరుణనొంది, ప్రకాశ మతులై భుక్తిముక్తులు గలిగియుందురు.

## కేతుమాలా వర్షము

ఇలావృత వర్షమునకు, పశ్చిమ దిశయందు, యీ కేతుమాల వర్షమున, విమలము, కృష్ణము-విశోకము, జయంతము, హరినగము, విశాలము, వర్ధమానము అను ప్రధాన పర్వతములుగలిగి, వీటి ప్రత్యంత పర్వతములు, వేలకు వేలుగలిగి, ప్రతి పర్వతమునకు దేశములు గలిగి సిరి సంపదలచేత, మేధావంతులగు స్త్రీలుగలిగి, విశాల నేత్రలు, పన్నగవేణులు, మధుర జలపానముచేత తృప్తులగుచు, 120 సంవత్సరములు జీవించుదురు.

హరిహర రూపములచే నమరియుండు ఆదిదేవతలు, పాదహృదయ, వదన, పుచ్ఛ, పార్శ్వంబున కృత్తికాది నక్షత్రముల, పూజింపబడి, ఫలితము లిచ్చుచుందురు. భగవంతుడు శ్రీదేవితో, సంతోషమునొంద, కామధేను రూపంబుననున్న మహానుభావుని, అస్త్రతేజఃప్రకాశంబున, ప్రజాపతియు, అల్లుండగు రాత్ర్యధిదేవతల గర్భంబులందనియు జేయు అధికభోగంబులచేత గర్భంబులు నిర్జీవంబులై స్రవించు చుండు. నా కామదేవుండు, వివిధ లీలావిలాసంబులచేత ఆలోకన సుందర భ్రూమండల సుభగ వదనారవింద కాంతులం జేసి, రమాదేవిని సంతోషింపచేయు, భగవన్మాయామాపి:శి

యగు, (శ్రీ)దేవియు, ప్రజాపతి పుత్రీపుత్రులను, రాత్రి బగళ్లుంగూడి, కామదేవుని స్తోత్రపఠన పూజాదుల, ధ్యానము లచే అర్చింపుచుండుదు. వరాహమూర్తి అధిష్ఠాన దేవతయై యుండును.

## హిరణ్మయ వర్షము

ఇలావృత వర్షమునకు వాయువ్య దిశనుండు, హిర ణ్మయ వర్షమున, కూర్మావతారము దాల్చిన విష్ణుదేవుండు ఆధి దేవతయైయుండు, యమధర్మరాజు, పితృపతి, అర్యముడు, సకలజనంబులున్నూ, ఆ దేవుని యారాధింపుచుందురు. వారికి భుక్తిముక్తు లొసంగుచుండును. ఉత్తర కురుభూముల వారు, అచ్చట రాజులు-ప్రజలు వరాహదేవు నారాధింపు చుందురు. హైరణ్వతియును మధురజల పూర్ణయు, బంగారు పద్మములుగల సరస్సు గలదు. వీటి భక్షణచేత, తేజోబల ములుగలిగి దీర్ఘాయుష్యము గలవారుగా నుందురు. ధనికులు ప్రియదర్శనును, సత్వాధికులు, ఆరోగ్యవంతులు, పుణ్య మూర్తులుగా నుందురు, ఇత్యాది జనులుందురు.

## రమ్యక వర్షము

ఈ యిలావృతవర్షమునకు ఉత్తరదిశయందు అధిక రమ్యముగానుండును. రమ్యకవర్షమునందు ముసలితనము లేక యుందురు. నిర్మలులై కామసుఖప్రియులుగా నుందురు. ప్రకాశ శరీరులు, సౌమ్యులు, అనేక ఫలరసపానభోజనులు, 10 వేల

వర్షములు జీవింతురు. ఇచ్చట కూర్మావతారము దాల్చిన హరి, దేవతగా నుండును. పితృపతి, అర్యముడు, అచ్చటి సర్వజనులు, ఆ దేవు నారాధింపు చుందురు. ఉత్తర కురు భూములయందు ఆ వరాహదేవుడు అధిపతిగా నుండును. అచ్చటివారికి భుక్తిముక్తులు జరుగుచుండును.

## కురువర్షము

ఈ ఇలావృతవర్షమునకు ఈశాన్యదిశయందు యీ కురు వర్షముండును. ఇది మనోహరంబై పుష్పఫలభరిత వృక్షమయంబై, కల్పవృక్షములు గోరికలనిచ్చునట్టివి, వస్త్ర భూషణాలంకారములచేత, మానవులు ఆయురారోగ్య సుఖ విజయములు గలవారలై సుగంధమందవాయువులతో నిత్య సంతోషులై యుందురు. మిథునములైపుట్టి, అనురాగములతో ఇష్టాష్టసిద్ధులనుభవించు చుందురు. చక్రవాకములవలె క్రీడించు చుందురు. దేవలోకమున పుణ్యము నశించి దిగజారి భారత వర్షమున జనించుచుందురు. యీ భూమిని జనించినవారు 14 వేల 500 సంవత్సరములు జీవింతురు. చంద్రకాంతచలము, సూర్యకాంతచలము, గలవు. వాటి మధ్యమున భద్ర-సోమ తరంగిణులు గలవు. పర్వతములు, అమృతకల్పములు, అనేక వనములతోను క్షీర-దధి అమృతకరులతో నిండి యుండును. మత్స్యరూపుడగు విష్ణువు 9 విధములగు శరీరములు ధరించి, సంచరించును. ఆ భూమి తారకములతో జనపదములతో ప్రకాశింపుచుండు.

## బ్రహ్మాండపురుష స్వరూపము-మండల నిర్ణయము

సర్వ బ్రహ్మాండ చతుర్దశ భువనాత్మక మధ్యస్థ జంబూద్వీప భారతవర్షభూమి అనంత చిత్రమయమై తపస్సిద్ధి గలిగిన పుణ్యాత్ములాధారముగ విజయసుఖభోగంబులు గలిగి యుండు. యిట్టి భూమికి 20 యోజనముల యెత్తున నిప్పు, వాన, వాయువు, వీటివలన ఉత్పాతములు గలుగు మేఘగ్రహ సంచారములున్నా.

భూమికి 30 యోజనములయెత్తున సంచరించు సిద్ధ గ్రహ సంచారములున్నా.

భూమికి 40 యోజనముల యెత్తున సంచరించు భూత ప్రేత పిశాచ సంచారములున్నా.

భూమికి 50 యోజనముల యెత్తున సంచరించు సుభాది సూచకులగు దేవతాగ్రహములున్నా.

భూమికి 60 యోజనముల యెత్తున సంచరించు ధూమ వాతాద్యరిష్ట గ్రహములున్నా.

భూమికి 70 యోజనముల యెత్తున సంచరించు శిశువు లను బాధించు షోడశమాతృకా గ్రహములున్నా.

భూమికి 80 యోజనముల యెత్తున సంచరించు యవ్వన వయసు రాబోవు యువకులను వేధించు కామినీ, మోహినీ, శాకినీ, ఢాకినీ, గ్రహములున్నా. యీ గ్రహములు శుక్ల స్రవణాది దోషంబులం గలిగించి నీరసులం జేయుచుండు.

భూమికి 90 యోజనముల యెత్తున సంచరించు పిశాచ బ్రహ్మరాక్షస గ్రహామండలమున్నా.

భూమికి 100 యోజనముల యెత్తున సంచరించు, కాలవిశేషములయందు దేవగంధర్వ సంచారములున్నా, భూమికి 50 వేల 7 వందల 77 యోజనముల యెత్తున సంచరించు, చంద్రమండల సంచారమున్నా, పాతాళము మొదలు సూర్యమండలము వరకు 13 లక్షల 83 వేల 677 యోజనముల దూరమున సంచరించును. భూమండలం మొదలుగా 16 లక్షల 83 వేల 677 యోజనముల దూరమున సూర్యమండల సంచారము. ఇదే భువర్లోకము. ఇది బ్రహ్మాండ పురుషునకు హృదయస్థానము. ఇది దాటినవారు పుణ్యాత్ములు గలరు. బ్రహ్మాండపురుషునకు కంఠస్థానమగు, భువర్లోకం మొదలు, సువర్లోకము వరకు 2 కోట్ల 14 లక్షల, 88 వేల, 627 యోజనముల యెత్తున, ఇదే ఇంద్రపాలనగల స్వర్గలోకము.

భూమి మొదలు, 17 లక్షల, 75 వేల, 911 యోజనముల యెత్తున అంగారక మండలమునూ.

భూమికి 6 లక్షల, 88 వేల, 627 యోజనముల యెత్తున సూర్య-బుధ-శుక్రమండలములున్నా, సంచారాధికారములున్నా.

భూమికి 81 లక్షా 126 వేల, 474 యోజనముల యెత్తున, బృహస్పతి మండల సంచారమున్నా.

భూమికి 2 కోట్ల, 31 లక్షా, 97 వేల 850 యోజనముల యెత్తున, శనైశ్చర మండల సంచారమున్నా, 19 యోజనముల విశాల ఇంద్రనీలపు కోట నివాసమున్నా.

భూమికి 1 కోటి 35 లక్షల 23 వేల 879 యోజనముల దూరమున, రాహుమండల సంచారమున్నా.

భూమికి 3 కోట్ల 60 లక్షల 27 వేల 726 యోజనముల యెత్తున కేతుమండల సంచారమున్నా.

భూమికి 4 కోట్ల 13 లక్షల 64 వేల 864 యోజనముల యెత్తున నక్షత్రమండల సంచారమున్నా.

పాతాళము మొదలు నక్షత్రమండలంవరకు 4 కోట్ల 20 లక్షల, 64 వేల 864 యోజనముల యెత్తున శింశుమారచక్రమున్నా.

భూమి మొదలు 1 కోటి 20 లక్షల 64 వేల 864 యోజనముల యెత్తున భువర్లోకమున్నా, యీ లోకమున ఆదిత్యులు, ఋషభులు, విశ్వదేవతలు, యీ 3 తెగలవారున్నా, ఆర్యపులు, ఋద్రులున్ను, మారుత్తులు, అశ్వినులు, వసువులు, మొదలుగాగలవారు 33 కోట్లు దేవతలున్నా, వుందురు. వీరు సోమపానముచేసిన, సోమవులు, వీరికి ఇంద్రు డధిపతియై యుండును.

యీ ఇంద్రుడు 100 యజ్ఞములు చేయుట చేత ఇంద్రాధిపత్యము గలిగెను. ఇదే స్వర్గలోకము.

యీ స్వర్గలోకమునకు పైగా 12 కోట్ల యోజనముల వరకు సువర్లోకముండును. బ్రహ్మాండ పురుషునకు ఇది కంఠ స్థానము. యీ సువర్లోకము మొదలు మహర్లోకపర్యంతము 4 కోట్ల 14 లక్షల 88 వేల 627 యోజనములవరకు బ్రహ్మాండ పురుషునకు భ్రూమధ్యస్థానము. ఇది మహర్లోకము యిచట కల్పాంత పర్యంత మాయుర్దాయముగలవారుగా నుందురు. ఇక్కడ నివసించువారు చాక్షుష మన్వంతర కాలమువరకు జీవింతురు. ఇదే స్వర్గలోకము దీనిపైన మహర్లోకము గలదు.

## మహర్లోకము

స్వర్గలోకము పైగా 12 కోట్ల యోజనములవరకు నుండు లోకమున శుక్రాదులు కల్పాంతమువరకుందురు. నివృత్తినివారావలంబులు, శుక్రాదులు, దేవతలు, మునులు, గ్రహములు, మనస్సిద్ధిగలవారు, కోరినవెంటనే అభీష్టములు సిద్ధించువారు, తపోశక్తిచేత పరస్పరసహాయులు అనేక జీవ కోట్లు యిక్కడ నివశింతురు. యీ లోకము పైగా జనోలోక ముండును.

## జనోలోకము

యీ జనర్లోకమున దక్షప్రజాపతి ప్రభృతి. బ్రహ్మ మానస పుత్రులుందురు. వారు ఉగ్రతపంబున లోకసంరక్షణ చేయుచుందురు. మరీచి, కశ్యప, దక్ష, అంగీరస, భృగు, పులస్త్య, పులహ, క్రతు, ప్రజాపతులు జనర్లోకమున నివసింతురు. ఇచ్చట వారి దేహములు లేవు. కర్పూరజ్యోతివలె

ఆకారము గలవారు. వీరు సూక్ష్మదేహులు. వీరికి జ్ఞానమే శరీరము. స్వాయంభువు ఇచ్చటి వాడే. యీ జనర్లోకస్థానము బ్రహ్మాండ విరాట్పురుషునకు ముఖస్థానము. యీ జనర్లోకము పైగా తపోలోకము గలదు.

## తపోలోకము

యీ తపోలోకము 4 కోట్ల యోజనముల యెత్తున నుండును. బ్రహ్మాండపురుషునకు శిరోస్థానమైయుండును. యీ లోకమున విరాజమాన దేవతలుందురు. వారు తపో బలముచేత కల్పాంత పర్యంతము అరిష్టములంటక, సుఖింతురు. దేవతలు-వృషభులు, ఋషభులు, సనత్కుమారాదులు యిచట తపస్సుచేయుటచేత తపోలోకమని పేరు గలిగెను. యీ లోకము పైగా సత్యలోకము గలదు.

## సత్యలోకము

యీ సత్యలోకము 6 కోట్ల యోజనముల యెత్తు గలదు. అచ్చటి వారికి చావులేక సత్తామాత్రులై యుందురు. ఇందువలన సత్యలోకమందురు. బ్రహ్మ-విష్ణు-ఈశ్వరులు సాత్విక దేవతలుందురు. ఇది బ్రహ్మాండపురుష శిరోస్థానము. యీ బ్రహ్మాండ విశాలము 14 కోట్ల 56 లక్షల 88 వేల 627 యోజనములు విశాలముగలదు. పరమేశ్వరుని బ్రహ్మాండ విరాట్స్వరూపము, సూర్యసిద్ధాంత, బ్రహ్మాండ మార్కండేయ పురాణ ప్రమాణములు.

స్వారోచిష మన్వంతరము 1656898843- స్వారోచి యను వాడు హిమవత్పర్వతమున వరూధిని యను అప్సరసకు జనించినవాడు. తానభివృద్ధికి వచ్చి, ముగ్గురు భార్యలతో మందర పర్వతమునందు విహరించినట్లు మార్కండేయ పురాణప్రమాణము. యీ స్వారోచిష మనువు స్థితి యెట్లనగా, యీ మనువు బ్రహ్మపదము చేరగానే. బ్రహ్మదేవుండు ఇతనిని మనువుగాజేసి, పారావతులను, దేవతలుగానూ, తుషితులను 2 తెగలుగ జేసి, విపశ్చిత్తను వాడు ఇంద్రుడయ్యె. ఊర్జస్తంభుడు, ప్రాణదత్తోళి, ఋషభ, నీహార, అర్వరవంతులను, వారు సప్తఋషులుగాను, చైత్రాది సుతులేడ్వురు పుట్టిరి. యీ మన్వంతరమున, భూమి పాలించిరి. యిట్టి మను సంధులలో ప్రళయములు వచ్చునపుడు, సృష్టినిలచును. 120428- సంవత్సరములు మను సంధి కాలము, పోగా మన్వంతర ప్రారంభమగును.

యిప్పటికి సృష్టికి ప్రారంభమై

యక్ష, రక్ష, రాక్షస, పిశాచ, గరుడ-గంధర్వ కిన్నర-కింపురుష, దేవతాది, బ్రహ్మఋషులు, సప్తరుషులు, అష్టదిక్పాలకులు, చతుర్దిశాధి దేవతలు, నవబ్రహ్మలు, ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు, ఆకాశగంగ, చంద్ర సూర్యాదులు, కాలప్రమాణమును సృష్టిచేసిరి.

స్వారోచిషమను సృష్టిప్రారంభమై తదాది భూలోకమున మేనితో మానవలోక నివాసమున్నూ, నిర్యాణమై దేవలోక

నివాసమునన్నూ, జరుగుచుండెను. తొలి మనువువలె రెండవ మనువున్నూ వెంటనే సృష్టి జరిగించెను. యీ మనువునకు 9 మంది కుమారులు, వారి సంతతులు-వారు రాజులైరి. భూగోళమును పాలించిరి. స్వారోచిషుడు బీజమనువు కాడు. స్వాయంభువే బీజమనువు. యీ రెండవ స్వారోచిష మనువు కాలమున, విద్యలు, కళలు, విశేషవృద్ధి బొందెను. యీ మనువు విశేష దేహకాంతి గలవాడగుటచేత స్వారోచియను పేరు గలిగెను, హిమవద్గిరియందు నివాసము చేసెను. ఇందీవ రాక్షుడను గంధర్వుని పుత్రికయగు, మనోరమను పెండ్లి యాడెను. యీ భార్యవలన అస్త్రహృదయమను విద్య గ్రహించెను.

యీ విద్య స్వాయంభువ మనువు వశిష్టు కిచ్చెను. వశిష్టుడు మనోరమ మాతామహునకిచ్చెను. అతడు మనోరమ తండ్రియగు అల్లునకు అరణముగా నిచ్చెను. మనోరమ తండ్రి వలన గ్రహించి భర్త కిచ్చెను. యీ విద్య స్వాయంభువు నుండి పరంపరగా వచ్చుచుండెను. మనోరమ తండ్రి ఇందీవ రాక్షుడు అష్టాంగ యుక్తముగా ఆయుర్వేద మిచ్చెను. మనోరమ సఖులగు విభావరి; కళావతులను, స్వరోచిని వివాహము చేసుకొని, విభావరివలన సర్వభూతభాషణములు తెలియు విద్యయు నేర్చెను. పద్మినీ విద్యవలన నవనిధులు వశమై, సకల భోగములను అనుభవించెను. స్వాయంభువ మన్వంతరమునందును, స్త్రీలవల్లను సర్గత్రయము జరిగెను. స్త్రీలవల్లనే విద్యాభివృద్ధిగల్గెను. స్వరోచికి వన దేవతలవలన

గలిగినవాడు స్వారోచిషమనువు. ద్యుతివంతుడను నామము గల్గెను. ప్రతి మన్వంతరమున నుండవలసినవారు 1-మనువు, 2-దేవతలు, 3-సప్తఋషులు, 4-మనుపుత్రులు, మనువు రాజవంశమునకు సప్తఋషులు, బ్రాహ్మణవంశమునకు మూల కారకులు యీ రెండవ మనువు కాలమున బ్రాహ్మణ క్షత్రియ, విభాగములు పూర్తిగ నేర్పడినవి.

యీ మన్వంతరమున దేవతలు, తుషితులు, పారావతులనియు, 2 తెగలు గలరు. వారికి ఇంద్రుడు విపశ్చిత్తను వాడు సప్తమహర్షులు, 1 వశిష్టపుత్రుడు ఊర్జుడు, 2 కాశ్యపుడగు స్తంభుడు, 3 భార్గవుడగు ప్రాణుడు, 4 ఆంగీరసుడగు ఋషభుడు, 5 పౌలస్త్యుడగు దత్తుడు, 6 అత్రి, 7 పౌలహుడు, 1 మనుపుత్రులు, 2 చైత్రుడు, 3 కింపురుషులు, 4 కృతాంతుడు, 5 విభృతుడు, 6 రవి, 7 బృహాదత్తుడు, 8 నవుడు, 9 శ్వేతుడు, వేదశిరుడను బ్రాహ్మణకుమారుడు, వేదశిరుడను బ్రాహ్మణకుమారి తుషితకు మహావిష్ణువు జనించె. విభుడను పేరుగలిగి, ఇంద్రునకుతోడై, దైత్యసంహారము చేసి, ధర్మము స్థాపించెను. స్వారోచిష మన్వంతరము సంపూర్ణము.

## ఉత్తమ మన్వంతరము

స్వారోచిషమనువు అనంతరము 135017834З సంవత్సరములకు ఉత్తమమనువు ప్రారంభమై, యీ 3_వ మన్వంతరాధిపతియై, యీ మనువు ఉత్తానపాదుని కుమారుడు, ఇతడు ఉత్తముడు, 2 మన్వంతరములవరకు జీవించెను. మూడవ

మన్వంతరమున మనువయ్యె, ఇతడు తపఃప్రసిద్ధవర్తనుడనియు
యీ మన్వంతరమున మంత్రశాస్త్రము అభివృద్ధి చెందెను.
మంత్రపూతములగు హోమానిష్టలు, అవయవదోషములు
దుశ్శీలత్వము పోగొట్టును. ఉత్తమమనువు తండ్రి ఉత్తమ
గుణములుగలవాడు బహుళ యను భార్యను వివాహమాడి
తానను రాగముననున్నను ఆమె ప్రతికూలముగా నుండుటచేత
అడవిలో విడిచెను. నాగలోకపతియగు నాలపోతుడు అడవిలో
దిరుగుచు బహుళను మాయాబలముచేత నాగలోకమునకు
గొనిపోయెను. నాగరాజు కూతురు తండ్రికి కనుబడకుండా
కాపాడుచుండె, తండ్రికి కూతురుపై కోపమువచ్చి, మూక
త్వము బొందుమని శపించె. తర్వాత ఉత్తముడు భార్యను
రావించి, తనకు మిత్రుడగు సుశర్మయను బ్రాహ్మణునిచే
మిత్రకామేష్టి చేయించి యామె దుశ్శీలత్వము మాన్పించెను.
తర్వాత భార్య కోరగా సారస్వతేష్టి చేయించి నందయొక్క
మూకత్వము పోగొట్టెను. యీ మన్వంతరమందు వెనుకటి
మన్వంతరమువలె సృష్టి జరిగెను.

1 స్వధానులు, 2 సత్యులు, 3 శివులు, 4 ప్రతూర్ధనులు,
5 వశవర్తులు, వీరికి శాంతి యను వాడింద్రుడు, వశిష్ట
పుత్రులు, సప్తమహర్షులు, మనుపుత్రులు 13 మహాత్ములుగా
నుండిరి. క్షత్రియరూపదశన్నులైరి. విష్ణువు సూనృతకు
జన్మించి, సత్యసేనుడను పేరుతో ఇంద్రసహాయుడయ్యె.
సుధర్ములు, సత్యులు, శివులు, ప్రతుర్ధనులు, వశవర్తులు,
దేవతలుగాను, శతక్రతువు లొనరించి సుశాంతియను వాడు

ఇంద్రుడయ్యె. ఇతను మిగుల ధార్మికుడు. యితని నామోచ్చారణచేత, మానవారిష్టములు తొలగును. కావున మానవహారిష్టములు తొలగుటకై॥శ్లో॥సుశాంతో దేవరాట్ప్రాతోన స్యుశాంతిం ప్రయశ్చతు।సహితశ్శివ సత్యాద్యైస్తదైవ వశవర్తిని॥ ఇది పఠించి హోమముచేసిన, వానికి, నజ్రసపరి వ్యాధులు, యేడ్గురు సుతులు బుట్టిరి. వారికి మహిమచేతను సప్తరుషులుగ నుండిరి. భూమండలము పాలించిరి. దిగంత కీర్తివంతులైరి.

## 104, 34, 58, 80, 043-4 తామస మన్వంతరము

ఇతడు, సురాష్ట్రుని జేష్టపత్నియను నుత్పలాదేవికి జనించెను. వెనుకటి జన్మమున సిద్ధవర్యుని పుత్రుడు. ఇప్పటి నామధేయము, లోలుడు, ఉత్తమ మనువు తమ్ముడు, స్వాయంభువ మన్వంతర సర్గసృష్టిలో ఉత్తమ మనువువలెనే, వృద్ధిబొంది, మూడు మనువుల కాలమునకు, మనుపదవికి వచ్చెను. తామసుడనుటకు కారణము, ఇతని తండ్రి సురాష్ట్రుడు బ్రతుకవలెనని యిచ్ఛచేత, శక్తిసంపాదించి, 1000 సంవత్సరములు, గడుపుచుండగ, భార్యలను, వివాహము చేసుకొని, కాలవశమున భార్యలు-మంత్రులు, నశించగా, రాజ్యము గోల్పోయి, వితస్తానది గట్టున, తపస్సు చేయుచుండగా, వర్షముచే గట్టువిరిగి నదిలోబడి కొట్టుకొని పోపుచుండగా, యీదుచున్న ఆడలేడి, తోకబట్టుకొని, యొడ్డుకు చేరి, యీ మృగమందు బదిధెనురాగుడై యుండగా, ఆ మృగము

వెనుకటి జన్మమున తాను, అతని ప్రథమ భార్యయగు, యుత్పలాదేవియనియు, శాపము వలన మృగరూపము వచ్చె ననియు, యిప్పుడు ఇతని స్పర్శచేత, గర్భము వచ్చెననియు, లోలుడనువాడు తనకు బుట్టుననియు, వాడు మనువు కాగల డనియు చెప్పెను. ఇతడు పుట్టినప్పుడు, జగత్తు చీకటికమ్మి యుండుటచేతను, తామసమృగ జన్మమెత్తుటచేతను, తామస యోనింజనించుటచేతను, తామసుడని పేరు వచ్చెను. కాబట్టి యీ కథనుబట్టి, యీ మన్వంతరమున, మృగములకు మను ష్యులు జనించినట్లు కనబడుచున్నది. యీ మనువు కాలమున, దేవగణములుగా ప్రబలిరి. 1 సత్యగణము, 2 రూపగణము, 3 సుధీగణము, 4 హరిగణము వీరికి ఇంద్రుడు శిబిచక్రవర్తి, సప్త మహరుషుల వివరము 1 కాశ్యపుడు, 2 అగ్ని, 3 పృథువు, 4 చైత్ర్యుడు, 5 పీవరుడు, 6 చరకుడు, 7 జ్యోతిర్ధాముడు. శాంతి, నర-ఖ్యాతుడు మొదలగువారు తామస మను పుత్త్రులు. విష్ణువు, హరియను నామెకు, పుత్త్రుడై హరియను పేరుతో ప్రసిద్ధికెక్కెను.

గజేంద్రమోక్షణ కథ. ద్రవిడదేశపు ఇంద్రద్యుమ్ను డను రాజు, అగస్త్యఋషి శాపముచేత యేనుగయై పుట్టి, హూహూనాకు గంధర్వుడు శాపముచేత మొసలియై పుట్టి, సరస్సు మడుగునందు ఆ యేనుగను బట్టెను. 1000 సంవత్సర ములు పోరగా బలము దప్పి, గజేంద్రుడు హరిని వేడగా మొసలిని చంపి గజేంద్రుని రక్షించగా శాపము తొలంగి రాజ గంధర్వులు స్వస్థానములకేగిరి. దురాసాహులు, హరులు,

సత్యులు, స్వరూప హృదయులు, ననువారు. దేవత్వము వహించిరి. 100 యజ్ఞములు చేసిన శిబిచక్రవర్తి ఇంద్రుడయ్యెను. జ్యోతిర్ధముడు, పృధువు, కావ్యుడు, చైత్రుడు, అగ్ని, నవకుడు, పీవరుడు. సప్తఋషులైరి. నర, ఖ్యాతి, శాంతి, భయ, జాను, జంఘాదులు, మనుపుత్రులుగ ప్రసిద్ధి నొందిరి.

## 2362?8843 దైవతమనువు ప్రారంభము

ఇతని రుతవంతుడను నామముగలవాడు. ఋషిశాపముచేత రేవతీ నక్షత్రము భూమిమీద బడినప్పుడు స్త్రీ రూపమునొంది, దుర్ధముడను రాజు యీమెను వివాహమాడి, దైవతుడను పుత్రుని గనెను. దుర్ధముడు ప్రియవ్రతుని వంశజుడు, దైవతుడు స్వాయంభువ వంశస్తుడు. ఉత్తమ-తామస సందైవతులు అన్నదమ్ములు, అని భాగవత ప్రమాణము స్వాయంభువ మన్వంతరమున సర్గములోనికివచ్చి క్రమవృద్ధిచెందిరి. దైవత మన్వంతరమున 71 మహాయుగముల కాలము గడచినది. యిందలి చరిత్రములు తెలియుటలేదు. యీ దైవత మన్వంతరమున దేవతలు 4 భాగములుగా విభజనలైరి. 1 సుమేధులు, 2 భువరయ్యులు, 3 వైకుంఠులు, 4 అమితాభులు, వీరికి ఇంద్రుడు విభుడు. సప్తమహారుషుల వివరములు 1 హిరణ్యరోముడు, 2 వేదశ్రీయనువాడు, 3 ఊర్ధ్వబాహుడు, 4 వేదబాహుడు, 5 సుధాముడు 6 పర్జన్యుడు, 7 వశిష్టుడు, బలుడు మొదలగు దైవతునకు పెక్కండ్రు కొడుకులు

బుట్టిరి. రాజులైరి. విష్ణువు వైకుంఠుడను పేరుతో నవతరించి, ధర్మసంస్థాపనను చేసెను.

రైవతమనువుస్థితి స్వాయంభువు వంశసంభూతుడగు కర్దమునకు రేవతియను కన్యయందు రైవతుడను మనువు బుట్టెను. సకల ధర్మవిదుడై, సకల జనాభిమతుడై, సంచరించె. అఖిలవేదాంగవేత్తయని కీర్తివహించె. శత్రుజయుండై మన్వంతరపాలనంబొనర్చె. సుమేధస్సులు, భూతరజస్సులు, వైకుంఠులు, నమితాభులు, 4 గణంబులుగా దేవతలుప్రసిద్ధినొందిరి. 100 యజ్ఞములు చేసిన, విభుడనువా డింద్రుడయ్యె. హిరణ్యరోముడు, దేవరి, యుర్ధ్వబాహుడు, వేదబాహుడు, సుదాను, వర్జన్యుడు, వశిష్టువనువారు, సప్తరుషులుగను బలబంధువు, మహావీర్యుడును, సుయష్టువుడు, కావ్యుడు, సత్యకులు, మొదలగు పుత్రులు. భూమిని పాలించిరి. ఇంద్రుడు స్వారోచిషుడు దప్ప, తక్కినవారు స్వాయంభువు వంశమువారు.

## 430018843 చాక్షుష మన్వంతరము

యీ చాక్షుష మన్వంతరమున విశేషము లేమనగా క్షీరసాగర మదనమున్నూ, కూర్మావతారము, జగన్మోహినీయవతారము, దేవాసుర యుద్ధము, మొదలగు ఘనకార్యములు జరిగిన వామనావతారము, యీ మన్వంతర చివర జరిగినది. యీ మనువు ధృవుని వంశస్థుడు. చక్షుషుని కుమారుడు. భాగవత–మార్కండేయములందు యీ ప్రమాణములు గలవు. ఇతని మిత్రుడను రాజునకు గిరిభద్రయను భార్యవలన

జన్మించెను. పుట్టినటనే తల్లికి వైరాగ్యము బోధించెను. తర్వాత తపస్సు చేసి, బ్రహ్మచే వరములు గొనియున్నాడు. చక్షుషుని కుమారుడగుటచేత చాక్షుషుడని నామమిడి యున్నారు. కొంత జ్ఞానము సంపాదించెను. మిత్రునకు జన్మించి నపుడు ఆనందుడనిన్ని నామము గలదు. కాని బ్రహ్మ ప్రత్యక్షమై, పూర్వజన్మ నామధేయమే నిశ్చయము చేయుట చేత చాక్షుషుడని ప్రఖ్యాతుండయ్యె. యీ చాక్షుష మన్వంతర మున జనులకు జ్ఞానాభివృద్ధికై యెక్కువ ప్రయత్నములు జరిగించిరి.

క్షీరసాగర మథనము జరిగి దేవతలకు అమృత లాభ మున్నూ, రాక్షసులకపజయలాభమున్నూ, గల్గెను. రాక్షసు లోర్చక బలిసేనాధిపత్యమున, దాడివెడలి, స్వర్గము నపహ రించిరి. విష్ణువు వామనావతారమును యెత్తి బలి నణగ ద్రొక్కెను. దేవతలకు జ్ఞానమును స్వర్గమును యిచ్చెను. సత్పురుషులకు జ్ఞానాభివృద్ధిన్ని, నిరాటంకముగ జర్గుట తట స్థించెను. ఇది చాక్షుష మన్వంతరాంతమున జరిగినది. యీ మన్వంతరమున దేవతలు 5 తెగలైరి. 1 అప్యులు, 2 ప్రభూ తులు, 3 భవ్యులు, 4 భృగువులు, 5 లేఖులు. వీరికి మనోజవు డింద్రుడు అయ్యెను. సప్తర్షులు, 1 సుమేధుడు, 2 హావిష్మం తుడు, 3 ఉన్నత్తుడు, 4 మధువు, 5 సహిష్ణుడు, 6 విమ లుడు, చాక్షుషునకు, శతద్యుమ్నుడు, మొదలగు పుత్రులు పెక్కండ్రు గలిగిరి. యీ మహీతలము నేలిరి. చాక్షుష మన్వంతరస్థితి అప్యులు, ప్రభూతులు, భవ్యులు, పృధగులు,

లేఖులు, దేవతలైరి. 100 క్రతువులుచేసిన మనోజవుడు ఇంద్రుడాయెను. సుమేధస్సు, విరజస్సు, హావిష్మంతుడు, ఉన్నత్తుడు, మధువు, అత్రి, సహిష్ణువు, సప్తఋషులైరి, సూరువు మొదలగు మనుపుత్రులు భూమిని పాలించిరి.

## వైవస్వత మనువు ప్రారంభము

12329, 8, 839 సంవత్సరములనాడు, వైవస్వత మనువు ప్రారంభమై, యీ మన్వంతరము నడచుచున్నది. ఏడవ మనువు, ఇప్పటికి యిరువదియేడు మహాయుగములు గడచి, 28–వ యుగము వర్తమానముననున్నది. కలియుగము మొదటిపాదము 5043 సంవత్సరము గతమగుచున్నది. ప్రతి మహాయుగమునకు, కృత, త్రేతా, ద్వాపర–కలియుగములు 4 ను, వేర్వేర భేదముగా నడచును. ప్రతి యుగమునందును ఇట్లే భేదించి నడచును. భేదములనగా ప్రజలయాచారములు, వృత్తులు మార్పుగలుగుటయు, జరుగును. ఇవి తెలియుట యత్యావశ్యకము. కృతయుగప్రారంభమున, స్త్రీ పురుషులు జంటలుగా జనింతురు.

## కృతయుగము

యీ జంటలుగా జనించిన వారిని మిధునములుగ జేతురు. వీరు సత్వగుణ ప్రధానముననుందురు. సంకల్పసిద్ధిగలవారు. తపస్సంపన్నులు. 4 వేల సంవత్సరములాయుర్దాయము గలవారు. అప్పటికి స్త్రీలకు రుతునియమములు లేవు. అంత్యకాలము వచ్చునపుడు ఒక మిధునమును గని చని

పోదురు. సహజముగా, కొండలయందుగల గుహలయందు నివసింతురు. నదీతీరములయందున్నూ నివసించి, దుష్టజంతు భయములేక, విహరింతురు. వారికి వర్షముతోను, సస్యముతోను పనిలేదు. ఫల, పత్ర, కందమూలములు భక్షింతురు. యే వస్తువు కావలెనని కోరితే సంకల్పసిద్ధివలన లభించును. శక్తి కలిగియుండును. నిరంతరమిష్టే జరుగును. యే కొరతలు లేకుండును.

## త్రేతాయుగము

యీ యుగము రాబోవు కాలముననే సంకల్పసిద్ధి నశించి, క్షుత్పిపాసలచే బాధపడుచు, సాత్వికగుణము నశించి, పాదధర్మము నశించి, 3 పాదములు ధర్మము నడచుచు, జనులు సమభావములుదప్పి, సమత్వ దృష్టి భేదించి, భేద బుద్ధులు కలిగియుందురు. యీ త్రేతాయుగమున ప్రధమంబున గొప్ప మేఘములు ప్రబలి వర్షములు గురియుటయు, అప్పటి నుండి కల్పవృక్షములు జనించి, ప్రజలు కోరిన వస్తువు లిచ్చుటయు, దున్నక, వెదజల్లక, సస్యములు పండును. స్త్రీలకు ప్రతి మాసమందు రుతువులేర్పడెను. సంతానవృద్ధి యధిక మగును. ప్రజావృద్ధికాగా జనులకు లోభరోగాదిగుణము లెక్కువగును. దోషకార్యము లెక్కువగును, లోభ మధికమై యీ చెట్లు నావి, యీ ప్రదేశము నాది యని వివాదము లాడుదురు. కట్టుబాట్లేర్పడును. వర్ణాశ్రమధర్మము లేర్పడి శీతోష్ణద్వంద్వములతో బాధలేర్పడును. బాధాపీడితులగుదురు. కృత్రిమములు దుర్గుణములు గల్గును. పట్టణములు,

పల్లెలు, మొదలగు వాసస్థానము లేర్పడును. కాలక్రమంబున లోభమోహామనస్కులై యుందురు. కల్పతరువులు నశించును. యీ యుగాంతమున కృషివ్యాపారములు ప్రారంభమై విస్తరించును. వడ్లు, గోధుమలు, కందులు, పెసలు, శనగలు, అలచందలు, నువ్వులు, మినుములు, వులవలు, కొర్రలు, పచ్చజొన్నలు, మొక్కజొన్నలు, తవిదలు, వరిగలు, సజ్జలు, సామలు, అమడలు, యీ 18 గ్రామ్య జాతులు ధాన్యము పండింతురు. నీవారాది భేదజాతి ధాన్యము లేర్పడును. యీ యుగమున యజ్ఞయాగములయందు ప్రజల కాశక్తి మెండుగా నుండును. ఆత్మపరాయణులై యుద్ధములయం దాశక్తి కల వారలగుదురు. అపుడు ద్వాపరయుగ ప్రవేశమగును.

## ద్వాపరయుగము

యీ ద్వాపరయుగము ప్రవేశించగానే, రాజస-తామసగుణము లధికమగును. జనులు గర్వోద్రేకులై నడతురు. ధర్మము 2 పాదములు నడచును. కామక్రోధ, లోభ మోహామద-మత్సర గుణము లధికమగును. వాణిజ్యాది వ్యాపారము లెక్కువగును. వృత్తులు ప్రబలును. ప్రబలముగా యుద్ధములు యెక్కువగా జరుగును. ఆయువు క్షీణించును. అధర్మ మెక్కువగును. అసత్యములు ప్రబలును. జనులు నియమములు దప్పుదురు. అప్పుడు కలియుగ ప్రవేశమగును.

## కలియుగము

యీ కలియుగ ప్రవేశము కాగానే, తామసగుణము ప్రధానముగా నుండును. సర్వకార్యములయందు సర్వకాలముల యందు, తామసము ప్రధానముగా నుండును. ప్రాముఖ్యత గల్గును. ప్రజలు స్వయంకృషిమాని, పరద్రవ్యాసక్తులై, లోభత్వముచేత, పరులసొత్తులు మోసగించి దొంగిలించుటయు, సదా రోగపీడితులై యుందురు. అల్పాయుర్దాయు లగుదురు. దొంగవృత్తులచే ధనమార్జింతురు. ప్రతి మహాయుగము నందును, యుగధర్మము లిట్లే జరుగును. లేశమాత్రమైనను ధర్మము నిలువదు. భేదములు గల్గును.

## వైవస్వత మనుచరిత్రము

ఈ వైవస్వత మనువు విశ్వకర్మ పుత్రియగు-సంజ్ఞా దేవికి సూర్యునివలన జనించెను. యీ సూర్యునకు వివస్వతు డని పేరు గలుగుటచేత, యీ సూర్యునియందు జనించుట వలన, వైవస్వతుడని పేరు గల్గెను. వెనుకటి కల్పాంతమున యీయన సత్యవ్రతుడు. ద్రవిడదేశపు రాజు. ఒకనాడు సత్య వ్రతుడు సూర్యున కర్ఘ్యమిచ్చుచుండగ, నొక చేపపిల్ల చేతిలోబడి 1,2 నిమిషములలో గుంటలు-చెఱువులు, మడు గులు, యేళ్లు సముద్రములకు మించిన, ఆకారముగా వృద్ధి బొందగా సముద్రమున విడచెను. సత్యవ్రతుడు ఆ మీనమును ముద్రమున విడచి, నీవు మీనరూపుండగు ఆది విష్ణుండవని,

ధ్యానించగా, మీనరూపుండగు విష్ణువు ప్రసన్నుడై, వారము దినములకు ప్రళయము రాగలదు. ఒక యోడను నిర్మించు కొని, అందు సమస్త వస్తువులు, సప్తఋషులు, కొన్ని వృక్ష బీజములు, కొన్ని జంతువులు, కొందరు పురుషులు, కొందరు స్త్రీలు, వీరిని నాయోడ నెక్కించుకొనియుండ, విష్ణువు మీనావతారమున, ఆ యోడను ముక్కున దగిలించుకొని, ప్రళయకాలమున సంరక్షించుకొనుచు, సత్యవ్రతునకు విష్ణు దేవుండు సాంఖ్యయోగము నుపదేశించె.

అప్పటినుండి సత్యవ్రతుడు క్రమవృద్ధికి వచ్చి, యేడవ మన్వంతరమునకు మనువయ్యెను. సత్యవ్రతుడే వైవస్వత మనువు. యీ మనువునకు 10 మంది కుమారులు. అందు ఇక్ష్వాకు సూర్యవంశమునకు మూలపురుషుడు. సూర్యవంశ మున విష్ణువు, శ్రీరాముడై యవతరించెను. పితృవాక్య పరి పాలనము చేసెను. సోదరవాత్సల్యము శరణాగత వాత్సల్య తయు, ఏకపత్నీవ్రతము మొదలగు ధర్మములు నిరూపించెను. జ్ఞానాభివృద్ధి చేసెను.

## చంద్రవంశం

సుద్యుమ్నుడను, మనుపుత్రుడు, శివుని శాపము చేత, స్త్రీరూపము ధరించిన, చంద్రుని కుమారుడగు బుధునివలన పురూరవ చక్రవర్తిని గని, చంద్రవంశము స్థాపించెను. చంద్ర వంశమునందు, విష్ణువు కృష్ణావతారమెత్తి భక్తియోగము, కర్మ సన్యాసయోగములు, భగవద్గీతలో ప్రకటించెను. జ్ఞానాభివృద్ధికి దారిజూపెను. యీ మన్వంతరమున, బ్రాహ్మణవంశమునందు, విష్ణువు పరశురామావతారమునెత్తి క్షాత్రమను ధనుర్వేద

మును లోకమునకు వ్యాపింపచేసెను. తర్వాత విష్ణువు బుద్ధావతారమెత్తి భూతదయ ముఖ్యమని నిరూపించెను. యీ కలియుగాంతమున విష్ణువు, కలికావతారమెత్తును. యీ మన్వంతరమున జ్ఞానాభివృద్ధికి, ధర్మసంస్థాపనమునకు నెక్కువప్రయత్నములు జరుగును. మార్కండేయ పురాణమున నిట్లు గలదు.

యీ వైవస్వత మన్వంతరమున, దేవగణములు, 1 ఆదిత్యులు 12 మంది, 2 అష్టవసువులు 8 మంది, 3 రుద్రులు 11 మంది, 4 సాధ్యులు 12 మంది, 5 విశ్వేదేవతలు 10 మంది, 6 మరుత్తులు 49 మంది, 7 భృగువులు 7 మంది, 8 అంగీరసులు 8 మంది, అను యెనిమిది గణములు. వీరికి ఇంద్రుడు, ఓజస్వియనువాడు, సప్తఋషులనగా 1 అత్రి, 2 వశిష్టుడు, 3 కశ్యపుడు, 4 గౌతముడు, 5 భరద్వాజుడు, విశ్వామిత్రుడు, 7 జమదగ్ని యనువారు.

వైవస్వత, మన్వంతర స్తితి, వసువులు, రుద్రులు, సాధ్యులు, విశ్వులు, మరుత్తులు, భృగువులు, అంగీరసులు నను-8-గణములు, దేవతలయ్యెదరు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, ననువారు, కశ్యపుని సంతతివారు. సాధ్యులు, మరుత్తులు, విశ్వులు, ధర్మపుత్రులు, భృగువులు, భృగుపుత్రులు, అంగీరసులు, అంగీరసపుత్రులు, ఓజస్వి యనువాడింద్రుడయ్యె. అత్రి, వశిష్ట, కాశ్యప, గౌతమ, భరద్వాజ విశ్వామిత్ర జమదగ్నులనువారు సప్తఋషులుగా నుందురు. ఇక్ష్వాకు నాభాగ, ధృష్ట, శర్యాతే, కరూష, వృషధృవ, సుతులను వారు మనుపుత్రులై భూమిని పాలించెదరు.

వైవస్వత మన్వంతరము సంపూర్ణము

## బ్రహ్మావతార వివరము

ఈ బ్రహ్మదేవుండు విష్ణు నాభీకమల సంజాతుండై పద్మజబ్రహ్మ యను బ్రహ్మదేవుండు జనించి.

జగదుత్పత్తి కారణాంతర్భూత తపోధ్యాన విడంబన కాలము గడపి, సృష్టియత్నమున స్వాయంభువావతారములు ప్రారంభించి, సృష్టియధికారమున కొన్ని తెగలు సృష్టించి, సృష్టి విఘ్నముకాగా, కౌమారాజ్య సర్గంబు వహించి, పద్ధతుల ననుసరించి, బ్రహ్మణ్యుండై, కఠినబ్రహ్మచర్యంబున ఘోరతపంబు జేసి, యజ్ఞమయుండై యుండి, వేదములు దొంగిలించిన సోమకాసురుండు భూమి నాక్రమించి అల్లకల్లోలములు చేయగా వానిని సంహరించెను. ఇది బ్రహ్మదేవుని ప్రథమావతారము.

రెండవ సుయజ్ఞావతారమున తాపసోత్తముడై ఇంద్రత్వంబు వహించి, రాక్షసుల జంపి సురల రక్షించె. యజ్ఞవరాహరూపంబున రసాతలగత భూమిని కొమ్మున నెత్తి 8-వ లోకముగా భూలోకముండు స్థానమున, భూమిని నిల్పి, ఆక్రమించి జగదుత్పత్తిచేయుచు, జనుల సృష్టించి రక్షించె.

మూడవతూరి నారదమహాఋషియై జనించి, కర్మనిర్మోక వైష్ణవ వ్రతముసల్పి, వైష్ణవాచారము ప్రకటించె.

నాలుగవతూరి, కపిలావతారమున తల్లికి సాంఖ్యయోగంబు బోధించె.

అయిదవతూరి, దత్తాత్రేయావతారమునందు కర్మ భార్యా సర్గంబు నడపి, నరనారాయణావతారమున అభిధానంబున దుష్కర తపంబుచేసె.

ఆరవతూరి అనసూయాదేవికి, అత్రిమునికి పుత్రుండై అలర్క ప్రహ్లాదులకు, ఆత్మవిద్య దెలిపె.

యేడవతూరి నాకూతికి, రుచికి త్రివిక్రముడై, హంస తారక మార్గంబుదెలిపె.

యెనిమిదవ యవతారమున యజ్ఞపురుషుండై మాయాది దేవతల రక్షించె. స్వాయంభువ మన్వంతరము రక్షించె.

తొమ్మిదవ యవతారమున మేరుదేవియందు నాభికి జన్మించి, యురుక్రముండన ప్రసిద్ధివహించి, హంస మార్గంబు ప్రకటించె. విద్వజ్జనుల నాదరించె.

పదవ జన్మంబున పృథుచక్రవర్తి యవతారంబెత్తి, భూమియందు ఓషధుల సృష్టించె.

పదునొకండవజన్మంబున చాక్షుష మన్వంతరంబున, ప్లవంబున మీనావతారంబున నావ నెక్కించి, వైవస్వతమనువు నుద్ధరించె. అంతంబున సముద్రమథనంబున కూర్మావతారంబునెత్తి క్షీరసముద్ర మధ్యమున అమృతకలశహస్తుండై, లోకస్థుల చిరంజీవులంజేయ ఆయురారోగ్యంబుల వృద్ధివంతులంజేసె

పదమూడవతూరి మోహినీ రూపంబున సురల నమృతాహారులంజేసి, రాక్షసులయెడ నిరాదరణంబు నూపి, సూర్య చంద్రుల కారణమున రాహుకేతువను వానిని అమృత

మహిమచేత, ద్విదేహులంజేసె. ఆ కారణమున సూర్యచంద్రులకు గ్రహణములు గలుగుచుండె.

పదునాల్గవ జన్మంబున వరాహరూపుండై ప్లక్షద్వీపంబున హిరణ్యాక్షుని వధించె.

పదునైదవ జన్మంబున కపట వామనావతారంబున ఇంద్రునివలన స్వర్గరాజ్యముగొని, ఇంద్రుని రక్షించి బలిచక్రవర్తిని పాతాళమునకు పంపించె.

పదహారు పరశురామావతారంబున 21 తూరి రాజకంఠచ్ఛేదంబులు చేసె.

పదిహేడవ జన్మంబున వ్యాసావతారము.

పద్దెనేనిమిది రామావతారంబున రావణుని సంహరించె.

పందొమ్మిది బలరామావతారంబున సాహసకర్మంబులంజేసె.

యిరువదవ జన్మంబున కృష్ణావతారమెత్తి మహత్తులంజూపె.

యిరువదియొకటవ జన్మంబున బుద్ధావతారంబునెత్తి జ్ఞాన విశేషంబులదెల్పె.

యిరువదియొకటవ జన్మంబున విష్ణుయశుండను బ్రాహ్మణునకు కల్క్యవతారమై జనించు. ఇత్యాద్యవతారంబులెత్తి, లోకకల్యాణంబుకొరకు త్రివిధగతుల బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, అవతారంబులుగా, ఒక్కొక కార్యముకొరకు, ఇట్లవతరించి, నిర్వహింపుచుందురు. యుగ యుగములయందు లోకోద్ధారణకొరకు అవతరింపుచుందురు.

## పృధుచక్రవర్తి యవతారము

బ్రహ్మదేవుని 10-యవ యవతారము పృధుచక్రవర్తిగా నవతరించి, బ్రహ్మాండమునందు తాను సృష్టించిన, సర్వజీవ జంతుజాలాది జగంబులకు యే కొరతలు లేకుండు నట్లు, అనగా దేవ, రాక్షస, మానవ, మృగ, పక్షి, సర్పాదులకు సర్వపదార్థములు, సృష్టించుటకు యత్నించి, యుక్తి దోచక, పృధుచక్రవర్తి వీరావేశంబున కామధేను రూపంబున నున్న, యధేచ్ఛగా సంచరించు భూదేవిని ధనుర్బాణంబులు చేబూని వెంటదగిలి, నీవు వశచోటునిలువక లోక ప్రజల కొరతలు తీర్చక, ఆదరించెడి మాతృవర్తనమాని, నిరాదరణ చూపుచు రిక్తమార్గమున చరింపుచున్నావు. నిన్ను వధించెద నని బెదరించగా ఆగోరూపధారిణియగు భూదేవిని విని నిలచె. నేనేమిచేయగలను. నన్ను వధించిన నీకేమి పుణ్యలాభము గలుగును. నీవు భూమిని మిట్టపల్లములు సమముచేసినచో, వర్షములచే భూమియందు సస్యాదు లుత్పత్తియగును. అట్లు చేయలేక నన్ను వధించి ప్రయోజనములేదు. అని చెప్పగా విని 192 కోట్ల సంవత్సరములక్రిందట ఆదివరాహామూర్తిచేత రసాతలమునుండి భూమిని దెప్పించి పాతాళాదిగా 8-వ లోకముగా భూమిని స్థాయిగా నిల్పినపిమ్మట ఆ భూమిని విచారించువారు లేకుండిరి. నేను భూమి కధిదేవతనై యుండియు చేయుకార్యములేక యధేచ్ఛగా దిరుగుచుంటిని. ఇపుడు నన్ను బెదరించి లాభములేదు. భూమి మిట్టపల్లములు లేక చదరము చేయించగా వర్షములు కురియగా సస్యోత్పత్తియగునని

చెప్పగా అట్లే చేయించెను. సస్యోత్పత్తికాకయుండగ, పృథు చక్రవర్తి భూమిదేవిని వితర్కించె, అప్పుడు భూదేవి శరణాగతయై ప్రపంచమునకు కామధేను రూపంబున అధికారక్రమంబులంబట్టి, సర్వోషధీస్వరూపంబు లుత్పత్తియగునట్లు ప్రమాణవాగ్దత్తములు ధారోదక పూర్వకముగా నిచ్చె. అంతట పృథు చక్రవర్తి సంతోషించి, భూమి మిట్టపల్లములు సమము చేయించగా సస్యోషధీ వృక్షమూలములు 20 లక్షలు సృష్టిగలిగె. అంతట పృథుచక్రవర్తి అధికార క్రమంబులు విచారించి సకలోషధీ కందమూల కాయధాన్యంబులు యెవరికి యే పదార్థము లవసరమో, ఆ పదార్థములు లభించునట్లు విధివిధానంబులు నిశ్చయించె.

సకల ఋషులకు బృహస్పతి యధికారంబున, ఇంద్రియములకు సదస్యులను అమృతంబును, దేవతలకు ఇంద్రాధికారంబున, కనకపాత్రలయందు ఓజోబల వీర్యామృతంబును, రాక్షసులకు ప్రహ్లాదాధికారంబున సురాసవరూప దుగ్ధంబును, గంధర్వులకు విశ్వావసు వత్సకంబుగా, పద్మమయ నిర్మితపాత్రలయందు, మాధుర్య సౌందర్యసహిత, గాంధర్వ క్షీరంబును, పితృదేవతలకు, సూర్యాధికారంబున నాకాశ పాత్రంబుగా, గవ్యం బను దుగ్ధంబును, సిద్ధులు కపిలవత్సకంబుగా, నాకాశపాత్రంబున సంకల్ప నామరూప అణిమాది సిద్ధులను క్షీరంబును.

విద్యాధరాదులు, తదధికారంబున పాత్రక్రమంబుగా, ఖేచరత్వాది వ్యాపారరూప క్షీరంబును, కింపురుషులు, వ యు

వత్సకంబుగా, నాత్మపాత్రలయందు సంకల్పమాత్ర క్షీరం బును, అంతర్ధానాద్భుత ఆత్మసంబంధ, మాయా క్షీరంబును, యక్షరక్షోభూత పిశాచంబులకు భూతేశవత్సకముగా, కపాల పాత్ర రుధిరాసవంబను దుగ్ధంబును, అహిదందశూక, సర్ప నాగ తక్షక, వత్సకంబుగా, బిలపాత్రంబుల విషరూప క్షీరంబులును.

పశువులకు, గోవులకు, వృషభ వత్సకంబుగా, నరణ్య ప్రాంత తృణక్షీరంబును, క్రవ్యాద మృగములకు, మృగేంద్ర వత్సకంబుగా, నాత్మకళేబర పాత్రంబున క్రవ్యంబను దుగ్ధంబును.

విహంగములకు, సువర్ణవత్సకంబుగా, నిజకాయ పాత్రంబునందు కీటక ఫలలాది దుగ్ధంబును, వనస్పతులు వట వత్సకంబుగా నవలోహరూప వయస్సను దుగ్ధంబును, గిరులు హిమవత్పర్వత వత్సకంబుగా, నిజసానుపాత్రలందు నానాధాతులోహ పాషాణ రత్నాది దుగ్ధంబును, సర్వచరా చరవర్గ స్వముఖ్యులధికారముగా, స్వస్వపాత్రముల భిన్నరూప క్షీరంబును, పర్వతభూముల మిట్టపల్లంబు లేకముచేసి గ్రామ పట్టణ దుర్గ–ఖర్వ్వఖర్వర, పుళిందఖేట, శబరాలయ ప్రజా వాటా ఘోష వివిధ నిలయములు సృష్టించె. ఇట్టి బ్రహ్మావ తార ప్రతిరూపుండగు ఆ పృథు చక్రవర్తిని, పొగడుటకు ఆదిశేషునకైనను అనంతకోటి దేవతలకైనను వశముగాదు.

## ధ్రువచరిత్రము-ధ్రువావతారము

స్వాయంభువ మనువునకు, ప్రియవ్రతుడు, ఉత్తాన పాదుడు అను నిరువురు పుత్రులు జనించిరి. అందు ఉత్తాన పాదుని కుమారుడగు ధ్రువుడు తండ్రియొద్దకు వెళ్ళి తొడపై కూర్చునియుండగా సవతితల్లి వచ్చి నెట్టివేయగ, అధిక దుఃఖము గలిగి, ఆరని క్రోధావేశమున్నూ కలిగి శీఘ్రముగా లేచివెళ్ళి అరణ్యమున ప్రవేశించి, అయిదేళ్ళప్రాయంబున స్థిరధైర్య వంతుడై పరమేశ్వరధ్యాన నిష్టకు ప్రవేశించి, శ్రీమన్నారా యణానుగ్రహామునకు పాత్రుండై, అమోఘ తీవ్రనిష్ఠజేసి, పరమేశ్వరానుగ్రహ సిద్ధిబొంది, శింశుమార చక్రోర్ధ్వంబున అధికారము పొందియుండె. యీ ధ్రువుని మహిమ వర్ణింప ఆదిశేషునకైన నలవికాదు. యీ ధ్రువుడు కాలబలంబున నిమిషమాత్రం బెడలేక సంచరించుచుండు, జ్యోతిర్గ్రహ నక్ష త్రములకు, ఈశ్వరునకు ధ్యానాక్రమణమున పశుమేధి స్తంభం బునుంబోలి, కల్పితమేఘములవలె, శ్యేనాది పక్షులు వాయు వశంబున పురుషయోగ గృహీతాసులై, కర్మనిమిత్తగతిగలిగి, వసుంధరం బడకుండ శింశుమారచక్రంబున, జ్యోతిర్గణంబు తలక్రిందుగానుండు శింశుమారచక్ర పుచ్ఛాగ్రంబున ధ్రువుం డును శింశుమార పుచ్ఛంబున ప్రజాపతియు అగ్నీంద్ర ధర్మలున్నూ, పుచ్ఛమూలంబున ధాతృవిధాతలున్నూ, కటిప్రదేశంబున ఋషిసప్తకంబును, దక్షిణావర్తమున కుండలీ భూత శరీరమునకు నుదగయన నక్షత్రములున్నూ, దక్షిణ పార్శ్వంబున దక్షిణాయన పక్షములున్నూ, పృష్టమున దేవ

మార్గంబును, ఆకాశగంగయు, ఉత్తరమున పునర్వసు పుష్యమి నక్షత్రములున్నూ, దక్షిణమున నార్ద్రాశ్లేషలును, దక్షిణ వామపాదంబుల నభిజిత్తు ఉత్తరాషాఢలును, దక్షిణ వామనాసారంధ్రంబుల శ్రవణ పూర్వాషాఢలున్ను, దక్షిణ వామలోచనంబుల, ధనిష్టామూలలున్ను, దక్షిణ వామకర్ణముల, ముఖ్యాద్యష్ట నక్షత్రములున్నూ, వామపార్శ్వంబున దక్షిణాయనంబును, దక్షిణ పార్శ్వంబున కృత్తికాది నక్షత్ర త్రయంబును, ఉత్తరాయణంబును, వామదక్షిణ స్కంధంబుల శతభిష జ్యేష్టలున్నూ, ఉత్తరహనువున, నగస్త్యుండును, అపరహనువున యముండును, ముఖమునం దంగారకుండును, గుహ్యమున శనైశ్చరుండు, మేఢ్రంబున బృహస్పతియు, పక్షంబున ఆదిత్యుఁడు, నాభిని శుక్రుడు, మనంబున చంద్రుడును, హస్తంబుల నశ్వినులు, ప్రాణాపానంబుల బుధుండును, గళంబున రాహువు, సర్వాంగంబుల కేతువును, రోమంబున తారలు నుండును. అది పుండరీకాక్షుని సర్వదేవతామయంబగు శరీరము. యీ దివ్యదేహంబే ధ్రువునిగా నెరుంగుము. ఇట్టి ధ్రువుని శరీరము ప్రతిదినంబును సంధ్యాకాలములయందు యేమారక భక్తిచే మనస్సున నిల్పి, తత్వబుద్ధి మనంబున బురికొల్పి, నియతవ్రతుండై స్నాన సంధ్య జపానుష్టానంబుల స్తవంబులం జేయుచున్నవారికి సకలాభీష్టములు సిద్ధించు. జ్యోతిస్వరూపున వెలుగు శింశుమారచక్రమును, సన్నుతించినవారికి సర్వాభీష్టములు సిద్ధించునని భాగవత ప్రమాణము.

## కాలోత్పత్తి సూత్రము

సూత్రం॥ తీక్ష్ణసూచ్యాబ్జ పత్రస్య। దళవేధస్త్రుటీ భవేత్। తచ్ఛతంలవ ఇత్యుక్తం। స్త్రిశంశత్తు నిమేషకః। నిమేషై సప్తవింశత్యా, కాలోగుర్వక్షరస్యచ। దశగుర్వక్షరోచ్చార కాలప్రాణో విధీయతే। షడ్భిప్రాణై ర్వినాడీస్యా। త్తష్టష్ట్యా నాడికాస్మృతాః। ఇత్యాదే। ర్న కాల నియమోనాస్తి। బ్రహ్మణః। పరమాత్మనః ఇత్యుక్తం బ్రహ్మసిద్ధాంతం॥ ఇతి వాక్యానుసారేణ। బ్రహ్మణ సౌరమానేన। త్రుటికాల ప్రమాణతః॥

తామర పుష్పదళమున తీక్ష్ణమగుసూది స్పర్శ యెంత కాలమో, ఆ ప్రమాణకాలము, త్రుటి యనంబడును. యీ త్రుటులు 100 గూడిన కాలము, వక లవ మనంబడును. యీ లవములు 30 గూడిన నిమిషమగును. యీ నిమిషములు 27 గూడిన కాలము గుర్వక్షరము, యీ గుర్వక్షరములు 10 గూడిన వక ప్రాణకాలము. 60 ప్రాణకాలములు వక విఘడియ ప్రమాణము. యీ ఘడియలు 60 గూడిన వక ఘడియ ప్రమాణము అని బ్రహ్మసిద్ధాంతమున చెప్పియున్నది.

రెండు ఘడియలు వకముహూర్తము పగటివి దినము నకు దివారాత్రములు 30 ముహూర్తములు గలవు. అవి, బ్రహ్మముహూర్తములని ప్రసిద్ధి. పగలు 15 రాత్రి 15 ముహూర్తములు. పగటి ముహూర్తములు 1 రుద్ర,

2 అహి, 3 మిత్ర, 4 పితర, 5 వసు, 6 వార, 7 విశ్వ, 8 వేద, 9 విధి, 10 శతముఖ, 11 పురుహూత, 12 వహ్ని, 13 నక్తంచర, 14 వరుణ, 15 అర్యమ, యీ ముహూర్తము లలో భగ, ఇంద్ర, అగ్ని, అహి, దైత్య, రౌద్ర, పితర, ముహూర్తములు అశుభములు. తక్కినవి సకల శుభములకు పనికివచ్చును చేయవచ్చును.

### రాత్రి ముహూర్తములు

1 గిరిశ, 2 అజపాద, 3 అహిర్బుధ్న్య, 4 పూషా, 5 అశ్వి, 6 యమ, 7 అగ్ని, 8 ధాతృ, 9 చంద్ర, 10 అదితి, 11 జీవ, 12 విష్ణు, 13 తిగ్మద్యుతి, 14 త్వష్టృ, 15 సమీరణములను, ముహూర్తములలో రౌద్ర, అజాంఘ్రి, యమ, అగ్ని ముహూర్తములు, అశుభములు. వీటిలో శుభకార్యములు చేయరాదు.

### వార దుర్ముహూర్తములు

ఆదివారమున–అర్యమ్ణ, అర్క ముహూర్తములు 2న్నూ.

సోమవారమున– రాక్షస, బ్రహ్మ, ముహూర్తములు 2 న్నూ.

మంగళవారం– పితృ, వహ్ని, ముహూర్తములు 2న్నూ.

బుధవారము– అభిజిన్ముహూర్తమున్నూ.

గురువారమున– రాక్షస, ఉదక, ముహూర్తములు 2 న్నూ.

శుక్రవారమున- పిత్రు, బ్రహ్మ, ముహూర్తములు 2 న్నా.

శనివారమున- భుజంగ, ఈశాన, ముహూర్తములు 2 న్నా.

వారజనిత ముహూర్తములు గనుక, వర్జింపబడినవి. యీ దుర్ముహూర్తములలో బలమగు శుభలగ్నము కుదిరినను, శుభకార్యములు చేయరాదు. చేసినవారికి అరిష్టములు గల్గును.

రాహు ముహూర్త హోరలు

శ్లో॥ అర్క శుక్ర బుధ శ్చంద్ర। మందోజీవ ధరా సుతః॥ అను సూత్రక్రమమున 7 హోరలున్ను ఆదివారం ఉదయ గంట మొదలు, వచ్చే ఆదివారం ఉదయం వరకు వరుస తప్పక లెక్కించుచు రాగ గంట గంటకు శుభా శుభ హోరలు తెలియును. రెండున్నర ఘడియకు వక గంట చొప్పున యీ 7 హోరలే పగలు 12 రాత్రి 12 గంటలకు నడుపుచుండిన హోరలు తెలియును. ఇంగ్లీషువారి ప్రభుత్వ మున 60 ఘడియలకు 24 గంటల ప్రమాణము ఘడియార ములద్వారా నడిపించుచుండి ప్రస్తుత వర్తమానమున జరుగు చున్నది.

రాహుముహూర్త హోరలు

ఆదివారం ఉదయ గంట మొదలు వచ్చె ఆదివారం వరకు. ఉదయం మొదలు 1 రవి హోర 2 శుక్ర హోర

3 బుధహోర, 4 చంద్రహోర, 5 శనిహోర, 6 గురుహోర, 7 కుజహోర, 8 రవిహోర, 9 శుక్రహోర, 10 బుధహోర, 11 చంద్రహోర, 12 శనిహోర, దీనితో సాయంత్రమగును. యిట్లు దివారాత్రములు లెక్కించుచురాగా, వచ్చే ఆదివారం ఉదయమునకు రవిహోర వచ్చును. శుక్ర-బుధ-చంద్ర-గురు-హోరలు శుభం గలుగును. రవి-శని-కుజహోరలు, అశుభము గలిగించును. ఇవి ప్రస్తుత కాలవర్తమానమున కొందరు వాడుచున్నారు.

## వారములందు హోరలు

ఆదివారము మొదలుగా, శనివారము వరకు, వార ప్రారంభము మొదలుగా, ఝాముకు 2 హోరలవంతున, సాయంత్రంవరకు 8 హోరలకు, వారాధిపతికి, ప్రథమమున 2 హోరల వంతున, ఆదివారం ఉదయం, రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, హోరతో సాయంత్రం అగును. సాయంత్రం మొదలు రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రవి హోరతో తెల్లవారును. తెల్లవారి, సోమవారంనాడు సోమ-సోమ హోరలు మొదలుగా, వారముల వరుస లెక్కించిన హోర తెలియును. యీ హోరలు జ్యోతిష్కులు వాడుదురు. యీ హోర 1కి మూడుముప్పాతిక ఘడియల వంతున లెక్కించేది. శుభ హోరలు శుభములు. అనగా చంద్ర, బుధ, గురు, శుక్ర హోరలు శుభములు రవి, కుజ, శని హోరలు అశుభ

ములు. యివి తెలియనివారు గౌరీపంచాంగమున కాలములు నడుపుకొనుచుందురు.

## లగ్న ప్రమాణములు

పూర్వము 5 ఘడియల ప్రమాణము లగ్నముగా లెక్కించిరనియు, 60 ఘడియలకు, 12 లగ్నములనియు జ్యోతిషరత్నాకరమున గలదు.

## ద్వాదశలగ్న కాలములు

శ్లో॥ మీనమేషౌ చతుర్దండీ। గోకుంభౌ చతురర్ధకం। పంచపాదో యుగ్మమృగౌ। పంచార్ధం చాపకర్కిణౌ। కార్పి సింహౌ చపం చార్ధం। పంచపాదస్తులాంగనే॥ యను సూత్ర క్రమమున మేషం 4 ఘడియలు, వృషభం 4-30 ఘడియలు, మిధునం 5-15 ఘడియలు, కర్కాటకం 5-30 ఘడియలు, సింహం 5-15 ఘడియలు, కన్య 5-15 ఘడియలు, తుల 5-15 ఘడియలు, వృశ్చికం 5-30 ఘడియలు, ధనస్సు 5-30 ఘడియలు, మకరం 5-15 ఘడియలు, కుంభం 4-30 ఘడియలు, మీనం 4-0 ఘడియలు కలిసి మొత్తం 60 ఘడియల దినమునకు 12 లగ్నములు గడచును. యీ లగ్నములయందు నవగ్రహములు నడుచుటచేత లోకులకు శుభాశుభము లిచ్చుచుందురు. పగలు ఈశ్వర స్వరూపుడగు సూర్యుడున్నూ, రాత్రి శక్తిస్వరూపుడగు చంద్రుడున్నూ జగంబులం గాపాడుచు, పాలించుచుందురు.

యామ ప్రమాణము అనగా వక ఝామము

యీ కాలములకు 4 ఝాములకున్నూ అగస్త్య కేరళశాస్త్రమున ప్రత్యేక ఫలితములు. భూత, భవిష్య, ద్వర్తమానములున్నూ. తెలియవచ్చును. యిట్లే 4 ఝాములు రాత్రికినీ, కాలఫలములు వేర్వేరుగానున్నవి. 8 ఝాములు వక దినము. యీ దినములలో 7 దినములు వక వారము యెట్లనగా, 1 ఆదివారము, 2 సోమవారము, 3 మంగళ వారము, 4 బుధవారము, 5 గురువారము, 6 శుక్రవారము 7 శనివారము. అని వర్తమానమును నడుపుచున్నారు. సోమ, బుధ, గురు. శుక్రవారములు శుభకార్యములకున్నూ, ఆది, మంగళ, శని వారములు అశుభకార్యములకు అవసరములు. యీ వారములు 2 కూడిన పౌర్ణమితోగూడి 1 పక్షమగును. మొదటి శుక్లపక్షము, 2-వది కృష్ణపక్షమని తెలిసేది.

శుక్లపక్షము-కృష్ణపక్షము

యీ పక్షమునకు 15 తిధులు గలవు. యెట్లనగా, శుక్లపక్షమున, 1 పాడ్యమి, 2 విదియ, 3 తదియ, 4 చవితి, 5 పంచమి, 6 షష్టి, 7 సప్తమి, 8 అష్టమి, 9 నవమి, 10 దశమి, 11 ఏకాదశి, 12 ద్వాదశి, 13 త్రయోదశి, 14 చతుర్దశి, 15 పౌర్ణమి. యీ శుక్లపక్ష తిధులవలెనె కృష్ణపక్షమున్నూ అమావాస్యతో కలసి వక మాసమగును. వారములు, తిధులు, పక్షములయందున్నూ పురుషదేవతలకు, స్త్రీ దేవతలకు, వ్రతపూజాక్రమములు నడుపుచుందురు.

## 12 మాసములు

1 చైత్రం, 2 వైశాఖం, 3 జ్యేష్ఠం, 4 ఆషాఢము, 5 శ్రావణము, 6 భాద్రపదము, 7 ఆశ్వీజము, 8 కార్తీకము, 9 మార్గశిరము, 10 పుష్యము, 11 మాఘము, 12 ఫాల్గునము. యీ 12 మాసములు శుభాశుభకార్యముల కుప యోగములు. ఇవి రెండు మాసములు కలిసిన 1 ఋతువన బడును. 6 ఋతువులు గలవు.

## 6 ఋతువులు

చైత్ర–వైశాఖములు వసంతఋతువు. జేష్ఠాషాఢములు, గ్రీష్మఋతువు. శ్రావణభాదపదములు వర్షఋతువు. ఆశ్వీజ కార్తీకములు శరదృతువు. మార్గశిరపుష్యమాసములు హేమంతఋతువు. మాఘ–ఫాల్గుణములు శిశిరఋతువు. యీ 6 ఋతువులలో పుష్యమాసమున ఉత్తరాయణ ప్రారంభము. యిది దేవతలకు ఉదయకాలము వంటిది. అషాడమాసము మొదలుగా, దక్షిణాయనము, ఇది రాత్రి కాలము వంటిది. స్త్రీ దేవతాపూజలు జరుపుదురు. యీ 2 అయనములు కూడగా, వకసంవత్సర కాలమగును.

## నక్షత్రములు

యీాదిన పక్ష, మాస, ఋతు, రయన, సంవత్సరములు గడుపుటకు నవగ్రహ, సంచారవశమున నక్షత్రములు గడువగా, కాలమేర్పడును. ఆ నక్షత్రములు 27 గలవు. యెట్లనగా

1 అశ్విని, 2 భరణి, 3 కృత్తిక, 4 రోహిణి, 5 మృగశిర, 6 ఆరుద్ర, 7 పునర్వసు, 8 పుష్యమి, 9 ఆశ్లేష, 10 మఖ, 11 పుబ్బ, 12 ఉత్తర. 13 హస్త, 14 చిత్త, 15 స్వాతి. 16 విశాఖ, 17 అనూరాధ, 18 జ్యేష్ట, 19 మూల, 20 పూర్వాషాఢ, 21 ఉత్తరాషాఢ, 22 శ్రవణం, 23 ధనిష్ట, 24 శతభిషం, 25 పూర్వాభాద్రా, 26 ఉత్తరాభాద్రా, 27 రేవతి, యీ నక్షత్రములలో శుభాశుభము లిచ్చునవి గలవు. యీ నక్షత్రములలో సూర్యుడు, అశ్విని మొదలు రేవతివరకు నడువగా 1 సంవత్సరమగును. వక నక్షత్రము వక పక్షము దినములు నడచును. చంద్రుడు వక నక్షత్రము వక దినము నడచును. కుజుడు వక నక్షత్ర 20 దినములు నడచును. బుధుడు వక నక్షత్రము 15 దినములు నడచును. గురువు నక్షత్రమును 5 మాసముల 10 దినములు నడచును. శుక్రుడు, నక్షత్రమును 15 దినములు నడచును. శని నక్షత్రమును సం 1-మా 1-ది10 వరకు నడచును. రాహువు నక్షత్రమును మా 8-0 నడచును. కేతువు మా 8 మాసములు నడచును. యిట్లు యీ గ్రహములు ఈశ్వరాజ్ఞవలన కాల ప్రవాహము నడుపు దాతలని తెలిసేది. వీరు శుభాశుభములచే మానవుల పాలింతురు.

## 27 యోగములు

నక్షత్ర సమానములుగా ఫలితము లిచ్చునవి. శుభాశుభములు గలిగించు యోగములు యేవనగా.

1 విష్కంభం, 2 ప్రీతి, 3 ఆయుష్మాన్, 4 సౌభాగ్యము, 5 శోభనం, 6 అతిగండ, 7 సుకర్మం, 8 ధృతి, 9 శూలము, 10 గండము, 11 వృద్ధి, 12 ధృవము, 13 వ్యాఘాతము, 14 హర్షణము, 15 వజ్రము, 16 సిద్ధి, 17 వ్యతీపాత్, 18 వరయాన్, 19 పరిఘము, 20 శివము, 21 సిద్ధము, 22 సాధ్యము, 23 శుభము, 24 శుభ్రము, 25 బ్రహ్మము, 26 ఐంద్రవము, 27 వైధృతి, యీ యోగములు నక్షత్రములవలె శుభాశుభము లిచ్చును.

## 11 కరణములు

1 బవ, 2 బాలవ, 3 కౌలవ, 4 తైతుల, 5 గరజి, 6 వణజి, 7 శకుని, 8 భద్రవ, 9 చతుష్పాత్తు, 10 నాగవం, 11 కింస్తుఘ్నం. యీ కరణములు, పంచాంగమందు, కాలమానము జరుపుటకు, పంచ బ్రహ్మలచేతను, పార్వతిచేతను, సిద్ధాంతము చేయబడినవి. యీ వార-తిధి-నక్షత్ర, యోగ, కరణములు. శుభాశుభములు వర్తమానమున నిచ్చుచుండు.

## 60 సంవత్సరములు నామములు

1 ప్రభవ, 2 విభవ, 3 శుక్ల, 4 ప్రమోదూత, 5 ప్రజోత్పత్తి, 6 ఆంగీరస, 7 శ్రీముఖ, 8 భావ, 9 యువ, 10 ధాత, 11 ఈశ్వర, 12 బహుధాన్య, 13 ప్రమాథి, 14 విక్రమ, 15 వృష, 16 చిత్రభాను, 17 స్వభాను, 18 తారణ, 19 పార్థివ, 20 వ్యయ, 21 సర్వజిత్తు, 22 సర్వధారి, 23 విరోధి, 24 వికృతి, 25 ఖర, 26 నందన, 27 జయ,

28 విజయ, 29 మన్మథ, 30 దుర్ముఖి, 31 హేవళంబి, 32 విళంబి, 33 వికారి, 34 శార్వరి, 35 ప్లవ, 36 శుభకృతు, 37 శోభకృతు, 38 క్రోధి, 39 విశ్వావసు, 40 పరాభవ, 41 ప్లవంగ, 42 కీలక, 43 సౌమ్య, 44 సాధారణ, 45 విరోధికృతు, 46 పరీధావి, 47 ప్రమాదీచ, 48 ఆనంద, 49 రాక్షస, 50 నళ, 51 పింగళ, 52 కాళయుక్తి, 53 సిద్ధార్థి, 54 రౌద్రి, 55 దుర్మతి, 56 దుందుభి, 57 రుధిరోద్గారి, 58 రక్తాక్షి, 59 క్రోధన, 60 అక్షయ. యీ సంవత్సరములు 5 గూడిన, సామాన్యముగా యుగప్రమాణమనియు గలదు. మానవునకు శరీర బుద్ధింద్రియములు మారుచుండును. అని జ్యోతిషరత్నాకర సిద్ధాంతము, యీ యుగము 12 గడచిన వార్ధక్యము ప్రారంభమగును. యీ సంవత్సరముల జనించిన ఫలితములు గలవు. యీ సంవత్సర కాలము పితృదేవతలకు, దినము, పగలు వుత్తరాయణము. రాత్రి దక్షిణాయనము. యీ సంవత్సరములు 360 గూడిన వకసంవత్సరము. అది దేవతామానము. యివి 100 గడచిన దేవతలు నిర్యాణము చెందెదరు. మానవులకు బ్రహ్మదేవుండు 120 సంవత్సరములు మాత్రము కలియుగమున మానవులకు పరమాయుర్దాయ మిచ్చియున్నాడు. దేవతలు పుణ్యక్షీణమై నిర్యాణమొంది, జంబూద్వీప, భరతఖండమున, ఉత్తమ కులమున జనించి, శిష్టాచారములు దప్పక భక్తిమార్గమున కాలము గడపుచు, స్వేచ్ఛానందులై యుందురు.

## చతుర్యుగ ప్రమాణము

యీ సంవత్సర కాలమునకు నామములు ఎట్లనగా, నారదుడు విష్ణు మాయకు లోబడి కామించినందున తాను స్త్రీ జన్మకు కారణమైనప్పుడు 60 మంది కుమారులను గనెనని కథ గలదు. ఆ కుమారులు నామములు కాలము గడచుటలో సంవత్సర నామములై వర్తమానమున జరుగుచున్నవి. యీ సంవత్సరములు 360 అయితే దేవతలకు 1 సంవత్సరము. యీ సంవత్సరములు 12 వేలైన దేవతలకు 1 యుగము. యీ యుగములు 2000 వేలైన బ్రహ్మకొక దినము. ఉదయకల్పమున సృష్టిచేయుటయు క్షయకల్పమున సృష్టి నిల్చి ప్రళయము వచ్చుటయు గల్గును. యీ వుదయక్షయకల్పములు 2–కూడిన కాలములు, కృతయుగప్రమాణము 1728000 సంవత్సరములున్నూ, త్రేతాయుగం 1296 వేలున్నూ, ద్వాపరయుగము 864 వేలున్నూ. కలియుగం 432 వేలున్నూ, యీ మొత్తం 43 లక్షల 20 వేల సంవత్సరములు. మహాయుగము 71 యుగములు గడచిన 14 మన్వంతరములు గడచును. ఇవి 2 వేలైన బ్రహ్మదేవున కొకదినమగును. ఇట్లు 14 మన్వంతరములు గడచి ఉదయకల్పము వర్తమానమున శ్వేతవరాహకల్ప ప్రమాణము. 432 కోట్ల సంవత్సరములులో వర్తమానమున 1955885043 సంవత్సరములు గతించినవి.

## మనువుల గతకాల వివరము

స్వాయంభువ మన్వంతరము 30 కోట్ల 67 లక్షల 20 వేలున్నూ, స్వారోచిషమనువున్నూ, ఉత్తమమనువున్నూ రైవతమనువున్నూ, చాక్షుషమనువున్నూ, వైవస్వతమనుగత మున్నూ, 185 కోట్ల 58 లక్షల 85 వేల 43 సంవత్సరములు గతమగుట ప్రత్యక్షము. బ్రహ్మదేవునకు 50 సంవత్సరములు గతమైనవని సిద్ధాంత ప్రమాణము గలదు. అనగా 1 పద్మం 55 మహాఖర్వముల ఖర్వములు సున్నా, న్యర్బుదములు సున్నా, 52 అర్బుదముల 195 కోట్ల సంవత్సరములుజరుగుట నిశ్చయము.

యీ బ్రహ్మదేవుని ఆయుఃప్రమాణము, 3 పద్మాల 11 మహాఖర్వాంల ఖర్వాంలు సున్నా, న్యర్బుదములు సున్నా, 42 అర్బుదములని సిద్ధాంతము, ఇది బ్రహ్మ నిర్యాణ కాలము.

విష్ణుదేవుని ఆయుర్దాయము, 13 క్షోణుల 43 మహాపద్మాల 43 పద్మాల, 52 మహాఖర్వాల 1 ఖర్వం 18 న్యర్బుదాల 44 అర్బుదములకు విష్ణు నిర్యాణము.

ఈశ్వరాయుర్దాయము 58 శంఖముల 4 మహాక్షోణుల 10 క్షోణుల 64 మహాపద్మాల 63 పద్మాల 85 మహాఖర్వాంల 8 ఖర్వాల న్యర్బుదంలు సున్నా, అర్బుదంలు సున్నా. యీ కాలము ఈశ్వరనిర్యాణము.

## ప్రళయ వివరణము

1 చతుర్దశలోకములలో జీవులకు తామస నిద్ర కల్పించి మేల్కొంచునట్లు జరుగుట వక దినమనంబడు. ఇది దిన ప్రళయము.

2 కృతయుగమున 4000 వేల సంవత్సరము లాయుర్దాయమున్నూ 4 తాడిచెట్లయెత్తున్నూ.

త్రేతాయుగమున 3000 వేల సంవత్సరము లాయుర్దాయమున్నూ, 3 తాడిచెట్లయెత్తున్నూ.

ద్వాపరయుగమున 2 వేల సంవత్సరములాయువున్నూ, 2 తాడిచెట్ల యెత్తున్నూ, కలియుగ ప్రారంభమున అర్ధతాడి యెత్తున్నూ, 120 సంవత్సరము లాయుర్దాయమున్నూ, బ్రహ్మదేవుడు విధించియుండును. యుగప్రళయము, మనుప్రళయము ఆగంతుక ప్రళయములయందు మారీస్ఫోటకాదులు జ్వరాది అపమృత్యువులు గలిగి నశింతురు. ఆగంతుక ప్రళయము.

## బ్రహ్మప్రళయము

3 స్వాయంభువ స్వారోచిష, ఉత్తమ, రైవత, చాక్షుష, వైవస్వత, సూర్యసావర్ణిక, దక్షసావర్ణిక, బ్రహ్మసావర్ణిక, రుద్రసావర్ణిక, ధర్మసావర్ణిక, రౌచ్యక, భౌత్యక, యీ 14 మంది మనువుల అంత్యకాలములయందును, ప్రళయము గలుగును. యీ 14 మనువులు 14 మంది ఇంద్రులున్నూ

ప్రళయము చెందెదరు. యుగప్రళయము, మనుప్రళయము నైమిత్తిక ప్రళయము, ఆగంతుక ప్రళయములు గడచె.

బ్రహ్మప్రళయ మాసన్నముకాగా, మృత్యుదేవత జీవులను నొక్కిపెట్టున జంపును. శివుడు ఫాలనేత్రము దెర చును. ద్వాదశ సూర్యమూర్తులు అనగా ॥శ్లో॥ వివస్వా నర్యమాపూషా, త్వష్టాథస వితాభగ। ధాతావిధాతా। వరుణో। మిత్రశ్శక్ర ఉరుక్రమః। యీ సూర్య ద్వాదశ మూర్తులు విజృంభించి సంకర్షణాగ్ని జనించి, ప్రపంచ భస్మీ భూతంబు గావించు. తదుపరి, సప్తవాయువులు, అవహా, ప్రవహా, ఉద్వహా, సంవహా, నివహా, ప్రతివహా, పరావహ ములను సప్తవాయువులు, వక్కపెట్టున వీచును. మరియు నవమేఘములు అనగా ఆవర్త, సంవర్త, పుష్కర, ద్రోణ, కాల, నీల, అరుణ, తమో, వారుణములను నవమేఘములు ఏకీభవించి 100 సంవత్సరములు అనగా దేవతావర్షము యేనుగ తుండపు లావుధారగ వర్షించి సప్తసముద్రములు అనగా లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, శుద్ధోదక ములను సప్తసముద్రములు చతుర్దిశలవిజృంభించి ఏకార్ణవంబై. మహామండలము నాక్రమించి, భూమండల స్వల్పమగు మంటి పెళ్ళవలె జలమందు కరిగి లయమై, అంతట అవార్య పుతాగ్ని చేత, బడబాగ్నిచే ప్రజ్వలించబడి ఏకార్ణవంబు పానంబు చేయు, ఆ యగ్నిని సప్తవాయువులు విజృంభించి, యాబడ బాగ్నిం దెగటార్చుచు యీ వాయువు మహాకాశంబున లయంబగు పంచతన్మాత్రములు, మానసంబుచే హరించు యీ

మానసమును అహంకారంబు మ్రింగు, ఇట్లు అహంకారమును బుద్ధిగ్రహించు యీ బుద్ధియే మహాజ్ఞానంబును నశింపచేయును. యిదే మాయ ఇదే అవ్యక్తానందము, ఇదే అవిద్య, ఇదే అవ్యక్తము, ఇదియే మూలప్రకృతి, ఇదే బ్రహ్మప్రళయము ఇట్టి కారణమే ప్రళయము, ఇట్టి లయమే ప్రళయము, యిదే వృత్తమయోగము అని సుజ్ఞానయోగులు గ్రహింతురు. అల్పులు గురు రహస్యము దెలియక ఇది గ్రాహ్యముగాదు. ముక్తిమార్గమున కిదే పరమ రహస్యము.

ఈశ్వర బ్రహ్మ చైతన్య తత్త్వైక్యమేఅనుభవవేద్యము అసాధ్యము, ఇదే ప్రళయము అజ్ఞాన నాశనమే అత్యంతిక ప్రళయంబు పరబ్రహ్మైక్యము.

యీ ప్రళయములలో దిన ప్రళయమనియు, నైమిత్తిక ప్రళయమనియు, దైనందిన ప్రళయమనియు, బ్రహ్మప్రళయము, కల్పాంత ప్రళయము, అవాంతర ప్రళయమనియు, మహా ప్రళయమనియు గలవు. జీవేశ్వరైక్యజ్ఞానము గలిగిన ప్రళయములచే బాధింపబడక పూర్ణసాక్షిమాత్రుండై చిద్రూపరహిత సద్రూపుడనగుచున్నాను. అని మహాత్ముల యనుభవవేద్యము. సకలార్థ గురుబోధ కైవల్యసార ప్రమాణము, కాలసృష్టికి కల్పసృష్టికి ముందే ప్రళయకాల విమర్శ సిద్ధాంతమైనట్లు సూచన ఇది విరాట్శక్తి ఆజ్ఞ. మహేశ్వర-సదాశివప్రళయములు గడచినను, పరమాత్మకు 2 క్షణికములు కాలము శీతారామాంజనేయ సిద్ధాంతము.

## అధ్యాత్మఖండము–మోక్షవిద్యాసోపానము

### సాంఖ్యసూత్ర రహస్యము

శ్లోకం॥ ఊర్ధ్వేసాత్విక మిత్యాహు। ర్మధ్యే రాజసము చ్యతే। అధోగతం తామసంచ। గుణత్రయ మితీరితం॥ యీ సూత్రాధారమున విచారించగ, పరిశుద్ధ పుణ్యస్వరూపులగు ఊర్ధ్వలోకంబున దేవతాసృష్టిన్నీ, మధ్య భూలోకంబున, పుణ్యపాపమిశ్రమ కర్మజన్మమగు మానవసృష్టిన్నీ. అధోగత లోకములయందు పాపదుర్మార్గ కర్మావేశమగు నరకాధికార తామసకర్ములగు దుర్మార్గులున్నూ, సాత్విక గుణ–రాజసగుణ–తామసగుణ ప్రవర్తకులగు త్రిగుణ స్వభావులున్నూ, సృష్టింప బడిరి. సాత్వికులు పుణ్యాధికారులు ఉత్తమలోకప్రాప్తిన్నీ, రాజసులు మానవలోకంబున పుణ్యపాప మిశ్రకర్మలచేత, జన్మతరించలేక, చచ్చుచు పుట్టుచు నుండుటయు, తామసులు మహాపాప కర్మలచే రౌరవాది నరక నివాసులుగా నుందురు.

సాత్విక గుణవృత్తిగల దేవతాంశ జన్ములు. స్నాన, సంధ్యా, జప, తప, హోమములున్నూ, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి నిష్టాపరులై సాంఖ్యవిమర్శనయు, తారకాను భవమున్నూ అమనస్క పరిచితియు, గలిగి సమాధి నిష్టాపరులై జన్మ తరించు. మార్గాధారులై, సౌధసోపానములు, పర్వతసోపానము లారోహించుపద్ధతి నవలంభించి పరబ్రహ్మైక్యము పొందుటకు సులభమార్గము. పూర్వజన్మ పుణ్యప్రాప్తిలేక

లభించుట దుర్లభము. లభించువారు దేవసమానులు. అజ్ఞాన మత్తతచే, ప్రపంచజీవులు మునిగియుండుటచేత, జ్ఞానముగల్గి జన్మతరించుట దుస్తరము. జీవులకు మాయ ఆవరించి కడతేరు మార్గము వెదుకనియ్యదు. మాయను జయించుట దుష్కరము.

## మానవదేహము

శ్లో॥ దేహో దేవాలయ ప్రోక్తో। జీవో దేవస్సనాతనః

యీ సూత్రమును బట్టి విచారించగా శరీరమను దేవాలయమున జీవుడను దేవుడు నివశించును. యీ నివాసము స్థిరము కాదు. యీ జీవుడు నశించనివాడు ప్రారబ్ధాంతపర్యంతము జీవించును. త్రిగుణమాయా సంబంధకర్మలచేత జన్మదుఃఖముల ననుభవింపుచున్నాడు. వ్యామోహాకర్మలలో జిక్కి, కడతేరు మార్గము వెదుకలేడు. కర్మలు నశించిననాడు యీ జీవునకు దేవత్వము వచ్చును.

## త్రిగుణముల వివరము తామసగుణము లక్షణము

శ్లో॥ తృష్ణా స్నేహారాగలోభ। ఇత్యాద్యాఘోర వృత్తయః। సమ్మోహాభయ మిత్యాద్యాః। కధితామూఢ వృత్తయః। నిద్రాలస్యాలోభమోహా స్తామసా ఇతికీర్తితాః॥

యను సూత్రక్రమమున విచారించగా తామసగుణలక్షణ మెట్లనగా అధిక తామసము, అజ్ఞానము, మనోమాంద్యము, అతినిద్ర, లోభిత్వము, దురాశ, అధికమోహము, తన శక్తి పరుల శక్తినెరుగకపోవడము, పరుల హింసించుట, కొట్టుట,

తిట్టుట, అధికభోజనప్రీతి, మత్తు పదార్థములయందిచ్ఛగలుగు టయు దాహ తాపములు గలుగుట అధికానురాగము స్నేహి తుల యందభిమానము, అధికముగచూపుట. త్రాగుబోతు తనము వెరువక పాపకర్మములు చేయుట, సంకటములుబడుట, నిష్కారణదూషణ సేయుటయు, అధిక భయము, మూఢవృత్తి, దుర్భావులు, రోషప్రసంగములు, వాదించుట కుటిలబుద్ధి సంసారబద్ధుడై ఇహపరధర్మము లెరుగకుండుట. ఇట్టి గుణ ములు గలవారు కఠిన దుర్మార్గ మహాపాతకములంజేసి, 21 రౌరవాది నరకనివాసులగుటకు అధికారులు. క్రిమికీటక మృగ పశు పక్షిజాతులలోను మానవులలో క్షుద్రజాతులలోను సర్వకులములయందును రౌద్రోద్దండములుగా కర్మలు చేసి, హీనస్థితిబొంది, అధోలోకములయందు జనించుచు, జన్మ తరించుమార్గ మెరుగక గతి గానలేరు.

## రాజసగుణ లక్షణము

శ్లో॥ అసత్కార్య రజోధీరః। ఆరంభీ విషయాచయః। సరాజ సోమనుష్యేషు। మృతోజన్మాధి గచ్ఛతః। ఘోర మూఢాసుమాలిన్యా। సుఖాంశశ్చ తిరోహితః ఈషన్నైర్మ లన్ తస్త్రత్ర। చిదంశే ప్రతిబింబనం। ఆహారారాజ సస్యేష్టా దుఃఖశోకామయప్రదః॥ యీ సూత్రమునుబట్టి విచారించగా, రాజసగుణ ప్రవర్తన మెట్లనగా గర్వపడుట, పరులయందు క్రోధము గలిగియుండుట, పరస్త్రీల కామించుట కాముక వ్యవహారములలో పరుల ధిక్కరించుట. అపకారములు

చేయుట. ధీరత్వము పరులకు చూపుట. కార్యారంభమున ఆడంబరములు చేయుట. అధికాభిమానము అధిక రాజసము. రాజసగుణము జీవితపర్యంతము వదలకుండుట, పరజనులతో పంతములాడుట, ఘోరవృత్తులు మూఢాచారములు, అవసరముకోలది ఆచార పద్ధతులు నడచుట, నిత్యసౌఖ్యము గోరుకొనుట, ఒక చోటునందు ఒకపని యందు స్థిరము లేకుండుట, అధిక సంచారప్రీతి పరిశుభ్రతలేక సామాన్యముగ నుండుట, చిత్రవస్తువుల కాశించుట, తన ప్రతిబింబము చూచుకొని సంతోషించుట, రాజసపదార్థముల దినుట, రోగకష్టాదు లనుభవించుట. పలువిధదుఃఖము లనుభవించుట, పరధనముల కాశించుట, పరులకు కృత్రిమములు చేయుట, పరుల నేరములు వెదకుట, డాంబికప్రవర్తనము ఉద్యోగములకొఱకు వెదకుట కలహములకు కాలుదువ్వుట, యుద్ధమున కెదురు చూచుట. భోగభాగ్యములకే గోరుకొనుట, పొగడించుకొనుట, తన్నుతాను పొగడుకొనుట, విలువగల ఆహారపానంబులు గోరుట, వస్త్రభూషణములు సంగ్రహించుట, సుగంధద్రవ్య సేవనలు అధికముగు కోర్కెలు, గోరుట పరులచేత మర్యాదలు గోరుట, మిద్దెలు మేడలు గట్టుట, వనప్రతిష్టయు, తటాక-దేవతా ప్రతిష్టలు, కీర్తిగోరుట, పరులకపకారముచేసియు లొంగగూడదను పట్టుదలయు, అవమానములకు భయపడుట, చింతించుట, శత్రుమూలక దుఃఖము లనుభవించుట, కఠినముగు

ఆపదలు, దుఃఖములు అనుభవించుటయు, ఇట్టి రాజసగుణము గలవారున్నూ, జ్ఞానమార్గమున ముక్తినందలేరు. జ్ఞానవిద్యకు పనికిరారు, సకలార్థగురుబోధ కైవల్యసార ప్రమాణము.

## సాత్వికగుణ లక్షణము

శ్లో॥ ఆత్మజ్ఞశ్చైచవాగ్దాంతః। స్తపస్వీ విజితేంద్రియః। ధర్మకృద్వేద విద్యాస్యాత్। సాత్వికో దేవయోనితాః। శాంతా ఘోరా స్తథామూఢః। మనసావృత్తయ స్తథా। వైరాగ్యం క్షాంతి రౌదార్యం। మిత్యాద్యా సాధువృత్తయః॥ క్షమా స్తే యమహింసాచ। బ్రహ్మచర్య వ్రతంతథా। గురుశుశ్రూషాది కంచ। సాత్వికాః పరికీర్తితాః॥ యీ సూత్రమును విమర్శ చేయగ, సాత్విక పురుషలక్షణమెట్లనగా, ఆత్మయందు వివేక వృత్తిన్నీ, శుచివంతుడుగా నుండుట ఓర్పుగలిగియుండుట, జపతపములయం దాశక్తిన్నీ, జితేంద్రియత్వము, ధర్మాధర్మ ములు దెలుసుకొనుట వేదాచారమార్గమున నడచుట, సాత్విక వృత్తి, దేవతలయం దభిమానము శాంతము,పట్టుదల వదలకుండుట, మౌనమున నుండుట, మిత్రప్రసంగము స్థిరమగు మనోవృత్తి, వైరాగ్యబుద్ధి, కష్టములకు ఒర్చియుండుట, ఉదారగుణము, అహింసయు, వృద్ధశుశ్రూషయు, పరోపకా రము, న్యాయము, ధర్మము, సత్యము, నియమము తప్పకుం డుట, సదాచారము, సద్భక్తి, భగవధ్యానము. యీ గుణ ములతో పరమేశ్వరానుగ్రహమునకు పాత్రుడై, స్నాన, సంధ్య జపతప, హోమాచరణయు, యమము, నియమము, ఆసనము,

ప్రాణాయామము, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి పర్యంతము పరిచితిగలిగి, సాంఖ్యవిమర్శయు, తారకానుభవము, అమనస్క పరిచితియు గలిగి బ్రహ్మైక్యసంధాన పర్యంతము క్రమ సాధకుడై, యుండుట. ఇవి సాత్విక పురుషలక్షణములు. పూర్వజన్మ కర్మలుండగా, జన్మనివృత్తి కాదు గనుక, కర్మలు నశించిననాడు ముక్తిగలుగును. యోగముచే యోగాగ్నివలన కర్మలు నశించును. ప్రయత్నము పట్టుదలతో చేయవలెను. పనులయందు వివేకబుద్ధియు, నిష్ఠయు, మౌనము, బహిరింద్రియ–అంతరింద్రియ నిగ్రహము, శాస్త్రపురాణచర్చయు, ధైర్యము, స్తిమితము, సర్వజీవ సమానత్వము, ఇత్యాది సాత్వికప్రవర్తనముగలవారు, భగవధ్యాన మనోల్లాసములతోనుండి పరమేశ్వరానుగ్రహము పొందుటకు పాత్రులుగా నుందురు.

## 14 భువనాచారములు

పాతాళలోకమున స్నానాది శుచిర్భూతులై ఆదిశేషుని పూజింతురు. అచట పుణ్యమూర్తులగువారు జన్మాంతమున యీ లోకమునకు పైగా లక్ష యోజనముల యెత్తుననుండు రసాతలమున జన్మింతురు.

రసాతలముననుండు వాసుకి, రాక్షసులు మొదలగు వారు స్నానపరిశుద్ధిచేత సూర్యదేవునకు సంధ్యవార్చుటచేత, ఈశ్వరుని పూజించుటచేత, యిచట భక్తులు పుణ్యాత్ములు. జన్మాంతంబున పైలోకంబగు లక్ష యోజనముల యెత్తుననుండు

మహాతలమున జనింతురు. పుణ్యమువలన ఊర్ధ్వలోక జన్మము పాపమువలన అధోలోక జన్మము కలుగును.

మహాతలమున రాక్షసులు మొదలగు వారు స్నానము, సంధ్య, జపము లను 3 నిష్టలచేతను, ఈశ్వరధ్యాన పూజలు చేయు పుణ్యాత్ములు, కడతేరి, యీ మహాతలముపైగా లక్ష యోజవముల యెత్తుననుండు, తలాతలమున జనింతురు.

యీ తలాతలముననుండు గరుత్మంతుడు రాక్షసులున్నూ, సకలమైనవారున్నూ, విష్ణుభక్తులై, స్నాన, సంధ్య, జప, తపములను 4 నిష్టలతో విష్ణుదేవు నారాధింపుచు, ధ్యాన పూజాదుల చేయుచు, కడతేరు పుణ్యాత్ములు, యీ లోకమునకు పైగ లక్షయోజనముల యెత్తుననుండు సుతలమున జనింతురు. బలిచక్రవర్తి ప్రహ్లాదుడు విష్ణుభక్తులై కడతేరి, పైలోకమున జనింతురు.

యీ సుతలమున ప్రహ్లాదుడు బలిచక్రవర్తియు, యితర లోకస్థులు, స్నాన, సంధ్య, జప, హోమముల చేత, విష్ణుభక్తి చేత పూజాధ్యానములచేత, ఉత్తీర్ణులై కడతేరి, యీ లోకమునకు పైగానుండు లక్షయోజనముల యెత్తున వితలమున జనింతురు.

యీ వితలమున రాక్షసులు, మొదలగువారు ఈశ్వరారాధనపరులై పూజాధ్యానములతో, స్నాన, సంధ్య, జప, హోమ, యజ్ఞ సమారాధనములతో, కడతేరి జన్మాంతంబున, యీ వితలమునకు లక్షయోజనముల యెత్తునగల,

అతలమున జన్మింతురు. యీ అతలమున బలాసురుడు మొక్క లగువారు ఈశ్వరారాధనపరులై, స్నాన, సంధ్య, జప, హోమ, యజ్ఞ, పూజాధ్యాన, సమారాధనములతో ఉపవాసాది నియామకములతో కడతేరి జన్మాంతమున దీనికి పైగానుండు లక్షయోజనముల యెత్తున భూమండలమున జనింతురు.

యీ భూలోకంబున, షట్కర్మాచరణలతో యమాది అష్టాంగ యోగములతో, సాంఖ్య, తారక, అమనస్క యోగములతో సమాధి నిష్టాపర్యంతము, సర్వయోగ భోగములు గలిగి, నిత్యానందమయులై యుందురు. యీ భరతఖండమునందు, జంబూద్వీప నవఖండములు-అనగా భరతఖండ, ఇంద్రఖండ, చరుఖండ, గభస్తిఖండ, నాగఖండ, తామ్రఖండ, వారుణిఖండ, సౌమ్యఖండ, గంధర్వఖండ, యీ ఖండములయందును, ఇలావృతవర్షమున, ఈశ్వరుడును, విష్ణువు-బ్రహ్మయు, అగ్నిదేవతలుగానుండి, భద్రాశ్వవర్షమున జనార్ధనుండును, చతుర్భుజుడై, కింపురుషవర్షమున రామ భద్రుండు సీతాలక్ష్మణ సమేతముగానుండును. భారతవర్షమున కూర్మరూపుండగు విష్ణువున్నూ, త్రిమూర్తులున్నూ, హరి వర్షమున నరసింహమూర్తిన్నీ, కేతుమాలావర్షమున ఈశ్వరుండున్నూ, విష్ణువు కామధేనురూపుండై శ్రీదేవితో గూడిన, కామదేవావతారమున్నూ, హిరణ్మయవర్షమున, కూర్మావతారుండగు విష్ణువున్నూ, రమ్యకవర్షమున, మత్స్య రూపుండగు హరి, వంశమంత్రములతో స్వాయంభువ మనువు

వలన పూజాధ్యానంబులతో తనిసి, భుక్తిముక్తు లొసంగు చుండును. కురువర్షమున మత్స్యరూపుండగు హరి తొమ్మిది విధములగు శరీరములుదాల్చి, ఆదదేవతలై పూజింపబడుచు, వారికి సర్వాభీష్ట సిద్ధులిచ్చుచు, భుక్తిముక్తులు జరుపుచుందురు. దేవతా పూజాదులవలన, స్వర్గభోగంబులుదప్ప నిజ మోక్షము లందలేరు. జన్మభారము విముక్తి కాదు. మార్కండేయ పురాణ ప్రమాణము.

## గురువులు కారకులు

గీ॥ గురువులేనివిద్య కూడ దెన్నటికైన, అజునికైన వాని యబ్బకైన, తాళపు చెవిలేక తలుపెట్టులూడును, విశ్వదాభిరామ వినురవేమ॥ తల్లితండ్రిని చూపించినట్లు తండ్రి గురువును జూపును. గురువు పరమాత్మనుచూపు మూలమంత్రము గుర్తు జూపును. ఆ గుర్తుయందుగల గురి పరమేశ్వరుని చూపును. గురువు లేక మోక్షమార్గము దొరకదు. గురు కీలకము దొరకక మార్గము దెలియదు.

"గురువు దొరకుట జన్మపరిపాకమునగాని, దొరకక నిత్యాత్మ గనగరాదు. కులము ఆచారము ఘనమైన శీలంబు దెలిపెడి గురువులు ధరణిగలరు". జన్మ పరిపాకమై పాపకర్మలు నశించి కడతేరు మార్గము వచ్చినప్పుడు మంచి గురువు లభించును. కులము, ఆచారము, శీలములు జెప్పి గర్వపోతులం జేసి, అజ్ఞానావేశ మెక్కించి సంభావనలుదీసుకొను కులగురువులు గురువులుగారు. నిజవిద్యనిచ్చి ఆత్మదర్శనము చేయించిన

గురువు గురువుగాని, యితరులు గురువులుకారు, ఆత్మదరిశన మైనగాని మోక్షము లభింపదు. ఆత్మదరిశన పర్యంతము గురువును వెదకుట అత్యవసరము.

గురువు లక్షణమెట్లనగా

స్నానాది షట్కర్మయుక్తుడై, యమాది అష్టాంగ యోగపరుడై, మంత్ర, లయ, హఠ, సాంఖ్య, తారక, అమనస్క యోగసిద్ధిపరుడై, లక్ష్యసాధనములు దెలిసి, తత్త్వమస్యాది మహావాక్య రహస్యముదెలిసి, జీవేశ్వరైక్య సంధానపరుడైన సద్గురువు దొరకుట దుర్లభము. పూర్ణభావము దెలిసిన పరబ్రహ్మసముడగు గురువు దొరకవలెను. యీ గురువులలో అష్టవిధ గురువులుగలరు. అనగా శ్రుతియర్థములు బోధించు వేధకగురువున్నూ, విజ్ఞానము బోధించు బోధక గురువున్నూ, శిష్యుల హృదయతాపములమాన్పి, ముక్తిమార్గము జూపించు నిషిద్ధగురువున్నూ, తారకమార్గముదెల్పి పరమునకుమార్గము జూపించు కామ్యక గురువున్నూ, శబ్ద బ్రహ్మానందమును పొందించి, సాధన చతుష్టయములదెల్పి. కడతేర్చు సూచక గురువున్నూ, దశేంద్రియ వ్యాపార వేగంబుల నణగించి, అజ్ఞాన చంచల్యము బాపెడు వాచక గురువున్నూ, నీవే బ్రహ్మ తత్త్వమని జీవేశ్వరైక్యసంధానము గలిగించెడి, కారణ గురువున్నూ, సందేహములుమాన్పి, పరమరహస్యము దెల్పెడు ఈశ్వర సముడగు, విహిత గురువున్ను, యీ విధముగా అష్టవిధ గురువులు గలరు. అందు దొంగ గురువులు పొట్ట

కొరకు గురువేషములు వేసుకొని మోసకారులై మొండి ప్రసంగములతో వంచనము చేయుదురు. వారిని పరిశీలించక త్వరపడి వారికి శిష్యులు కాగూడదు. నిజగురువులను వెదకి, శిక్షనందవలెను. ఇది నిజార్థము గనుక నెవ్వరు కాదనగూడదు.

గురుమహిమ నారద బ్రహ్మ సంవాదము

బ్రహ్మదేవుడు బ్రహ్మఋషులతో పంచప్రణవ వేదసంబంధ అద్వైతవిద్యా ప్రసంగము చేయుచుండగా, త్రిలోకసంచార ప్రవర్తకుండగు నారదమహర్షి యచటికిరాగా ఆ ప్రసంగము చాలించిరి. నారదుం డది గ్రహించి, నే నీ ప్రసంగము వినగూడదాయని ప్రశ్నించగా, బ్రహ్మదేవుండు ఇట్లనియె. నారదునితో నీకు గురువులేనందున యీ వేదాంత బ్రహ్మ విద్యా ప్రసంగము విన నర్హుండవుగావని పల్కగా నేను బ్రహ్మ వంశమునందు బుట్టి, నీకు కుమారుండనై స్వర్గ, మర్త్య, పాతాళాది 14 భువనములయందును గౌరవముగలిగి పూజింపబడుచు నేను వినగూడని విషయములు గలవా యని శంకించుచు, నున్న నారదుంగని బ్రహ్మదేవుండు గురుశిక్ష నందని గురు రహస్యములు వినగూడదు. వినిన అర్థములుగాక మనోవిభ్రాంతు లగుదురు. అవ్యక్త ముద్రేకించును. గనుక గురుశిక్ష నందక సంశయములు విడవు. అని బ్రహ్మదేవుండు చెప్పగా నీవే తండ్రివి, నీవేగురుడవు. కాగా నాకు కొరత యెట్లుగల్గును. అని శంకించగా తల్లితండ్రులు పనికిరారు. వేరే గురువును సంపాదించవలెను. అనగా నారదుండు నాకు గురువు యెచ్చట

దొరుకునని ప్రశ్నించగా బ్రహ్మదేవుండు యీ బ్రహ్మపట్న మునకు 100 యోజనముల దూరమున నొక పట్టణము గలదు. ఆ పట్టణమున దక్షిణోత్తరములుగా నొక వీధిగలదు. ఆ వీధి యందు, రాత్రిఝాము ప్రొద్దుండగా, ఉత్తర దిశనుండి దక్షిణ మునకు వెళ్లుచుండగా ప్రథమమున నెవరు నీకు దరిశెనమిత్తురో వారే నీ గురువులని చెప్పగావిని, నారదుండు బ్రహ్మదేవునకు నమస్కరించి సెలవు తీసుకొని, మనోవాయు వేగంబులచే బయలుదేరి, ఆ పట్టణపు ఉత్తరదిశను వీధిలో నొకపంచలో 2 గంటల పర్యంతము నిద్రించి లేచి, శ్రీమన్నారాయణ ధ్యానముతో దక్షిణముఖముగా బయలుదేరి వెళ్లుచుండగా, నొక పురుషుడెదురుపడగా, వారికి సాష్టాంగ దండప్రణామ ములు సమర్పించగా, నేను వచ్చు పర్యంతము యిక్కడికి కొలది దూరమున, పడమరకు వెళ్లు దారియున్నది. ఆ మార్గము కొలది దూరమున, ఉత్తరపు గల్లీయున్నది. ఆ గల్లీలో నొక వృక్షమున్నది. ఆ వృక్షమునొద్ద మా గృహ మున్నది. నీవా గృహము తిన్నెపై నుండవలసినది అని ఆజ్ఞా పించగా, నారదుండు శ్రీమన్నారాయణ ధ్యానముతో, వెళ్లి అచట ధ్యాననిష్ఠాపరుడై యుండెను. గురువుగారు 10 గంటల ప్రొద్దు యెక్కువరకు పని దీర్చుకొని దొడ్డివైపుగా, యిల్లుచేరి స్నానభోజనములు, తీర్చుకొని, వెనుకటి యింటిలో ప్రవేశించగా, భార్యవచ్చి పరిచర్యలతో గంధతాంబూలము లిచ్చి, నేను భోజనము చేయుటకు సెలవిమ్మనగా, బైట అరుగు తిన్నెపై యొక భక్తుడున్నాడు వానికి స్నానము

చేయించి భోజనముబెట్టి తాంబూలమిచ్చి యిచట నొప్పగించి నీవు భోజనమునకు పొమ్మని సెలవివ్వగా, నారదునకు స్నాన-భోజన తాంబూలములిచ్చి వారికి ఒప్పగించి భోజనమునకు వెళ్ళెను.

అప్పుడు నారదుండు గురువుగారికి సాష్టాంగనమస్కార దాసోహములు చేసి, నిలచిన శిష్యుని కూర్చుండ నియమించిన నారదుండు, కుర్చీలులేవు, ఆసనములులేవు, అని శంకించి విచారించుచుండగా, గురువుగారు, గురువులు, శిష్యులకు మర్యాదలు చేయుదురు. శిష్యులు నేలపై కూర్చుండుటయు, చాపలపై పరుండుట, లోకమర్యాదల కాశింపకుండుట, గురువులాజ్ఞ మీరకుండుట, గురువులకు పరిచర్యలు చేయుటయు, మరియు.

సీ॥ గురుడేగుదెంచిన గురుభక్తుడగు వాడు నెదురేగి
సాష్టాంగనియతి పాదాంగుళంబులు పట్టియు
నొకచేత చరణము లెడమహస్తములముట్టి
కర్ణనేత్ర లలాటకములను తాకించి పాదాం
గుళంబులు పట్టిపిల్చి దాసోహమని గురు ధ్యానంబు
గావించి మంత్రజపంబును మరువకుండ

గీ॥ వందనముచేయు శిష్యుని వర్ధిలంగ దీవనల
నిచ్చి గురుమూర్తి దివ్యమైన జ్ఞాన
సూత్రోక్త మార్గంబుపూనిదెల్పి పుణ్య
మతిజేయు తత్వజ్ఞ మూర్తియపుడు.

గురు నియామకములు

సీ॥ గురుడేగుదెంచిన కూర్చుండరాదు కూర్చున్న యెడ
బాయకూడదెందు బోధించవిడనాడిపోదలం
పగ రాదు బోధింపబడకున్న పోరరాదు దయనను
గ్రహమున్న తడవు సేయగరాదు తడవైన
తత్తరపడగరాదు వనులాజ్ఞజేసిన పరిహరింపగ
రాదు చేయవద్దను పనుల్చేయరాదు స్నాన
పానముల్ ముందుగా సలుపరాదు వెంటి
శయ్యాసనం బుండరాదు

గీ॥ వినయ భయభక్తి యెదలోన
విడువరాదు గురుని సేవించు
పరమభక్తునకు వత్సా యని
బోధించి మరియు

ఆత్మోపదేశము అనగా

బ్రహ్మాండ చతుర్దశ భువన కోశాత్మక మగు పర బ్రహ్మము స్థూల శరీరాత్మక చతుర్వేదసమన్విత ప్రణవపంజరం బులగు దేహాత్మక సాంఖ్యస్వరూప చతుర్వింశతి తత్వస్వరూపం బులగు తనువులయందు, జీవబ్రహ్మాంశ జ్యోతిస్వరూప తారక బ్రహ్మరూపమును, అమనస్క సమాధి నిష్టయు, ఇత్యాది పరమ రహస్యములు, జన్మకర్మ బంధరహితములుగాన, మున్ముందు దేహతత్వ స్వరూపంబగు సాంఖ్యసూత్రమును దెలియవలయు నని విమర్శారూపంబుగ, బోధించి, తారకతత్వము దర్శింపచేసి, సమాధి నిష్టాపర్యంతము, యోగనిష్టానియమంబులు బోధించి

నిస్సంశయుండవు గమ్మని దీవించెను. అప్పుడు, నారదుండు, నేను బ్రహ్మపట్నము వెళ్ళి వచ్చెదనని ఆజ్ఞ ఇమ్మనగా. నీ హరినామ స్మరణమాని నేనిచ్చిన గురువిద్యాక్రమంబున జ్ఞానసమాధి నిష్ఠుండవు కమ్మనగా, విని నమస్కరించి, శెలవు దీసుకొని బయలుదేరి, వెళ్లుచూ, కొంత దూరము పోగా, మనోమాయకు లోంగి వికలుండై.

## నారదుని గురుద్రోహము

నేను బ్రహ్మకులమందు బుట్టి, బ్రహ్మకుమారుండనై త్రిలోకపూజ్యుండనై, దేవతలచేత నమస్కారములుగొను నధికారముగల్గి, పల్లెవానికి శిష్యుండనై, శ్రీమన్నారాయణ ధ్యానము మాని, యిట్టి కట్టుబాట్లకు లోనైయుండవలసె గదాయని డోలాయమానసుండై చింతింపుచు, బ్రహ్మ పట్నముచేరగా, కోటకవాటము బంధించియుండె. అంతట నారదుండు చింతింపుచు, విచారింపుచు నుండగ, యిది యేమి కర్మము నేను వచ్చేవరకు బ్రహ్మపట్నకవాటము తెరచి యుండవలెగదా బంధించ్చి యుండుటకు కారణమేమని, వితర్కించుచుండగా.

నీవు బ్రహ్మవిద్యాసక్తుడవై, గురువుగారియొద్ద కారణ విద్యపొంది, పవిత్రుండవై తివని, యిచటికి రాబోవుచున్నావని, బ్రహ్మ, విష్ణు-ఈశ్వరలోకముల పట్నకవాటములు తెరచి యుండగా, నీవు మనోవ్యాకులమున, గురునాజ్ఞదప్పి, గురువును నిందించి, శ్రీమన్నారాయణ ధ్యానము చేయ

నని వాగ్దత్తముచేసి మరల చేయుటచేతను ప్రమాణము దప్పినందున నీవు గురుద్రోహముచేయుటచేత, యీ త్రిలోకములయందు నీముఖము చూడరాదని కోట కవాటములు బంధించి యుండెననియు నీవు శీఘ్రముగా వెళ్ళుమనియు, యీ వాక్యము వినుపించగా బ్రహ్మపట్నము వెళ్ళగా యెవ్వరు కనుపించక పలుకకుండుటచేత శ్రీవైకుంఠముచేరగా కోటకవాటము బంధించి యెవ్వరు గనుపించకుండుటచేత అచటవదలి, కైలాసముచేరగ, అక్కడ యెవ్వరు కనుపించనందున ఈశ్వరుని ధ్యాన్నించగా నీవింత పొరపాటుబడితివి. గురుద్రోహము బ్రహ్మ విష్ణు ఈశ్వరులున్నా తీర్చలేరు. గురువే తీర్చవలెనని వాక్యము మాత్రము వినుపించగ, యే లోకము వెళ్ళినా తీరదని మరల వినుపించగా, విని మనస్సునందుంచుకొని గురువుగారి పట్నము చేరి వెదకుచుండగా, 12 దినముల పర్యంతము గురుదర్శనముగాక అచ్చటి గంగా జల స్నానపానములతో గురువుగారి గృహమున తిన్నెపై కాలము గడుపుచుండగా 13-వ దినమున గురుదర్శనముకాగ, పాదములకు సాష్టాంగదండములు సమర్పించి నిలచిన శిష్యునిం గని ప్రశ్నించగా, నేను గురుద్రోహముచేసితిని తప్పు మన్నించి, రక్షించుడని ప్రార్థించగ దీవించి, యేమి తప్పు చేసితివనిన శ్రీమన్నారాయణ ధ్యానము చేయననిచెప్పి చేసితి ననగ నీకు హరి ధ్యానము పరిచితిగలదుగనుక, నీవు ధ్యానము చేసినా తప్పులేదనగ గురుద్రోహము చేసితిననగా నేను బ్రహ్మకులమందు బుట్టి, కనిష్టునకు శిష్యుండనైతినని చింత

చేసి బ్రహ్మ, విష్ణు, ఈశ్వరలోకములకు పోగా కవాటములు బంధించి నన్ను రానివ్వలేదు. గనుక నాతప్పు క్షమించుమని ప్రార్థించగా దీవించి లేవనెత్తి కూర్చుండబెట్టి నీకు అవ్యక్త సంకల్పములు వచ్చినపుడు మనస్సులో పడనియ్యక స్థిరధీర త్వమున నిలకడచేత నుండుము. నీవు జ్ఞానవిద్యబొంది అవ్యక్త మునకు లోపడక మరువక గురుధ్యాననిష్ఠయందు గురినిల్పి, పరసంకల్పములు మాని ఏకదీక్షగా యోగమయుండవై యుండుము. పరమానందమయుండవై యుండుము. త్రిమూ ర్తులు ఆశ్రయించిన మార్గమిదేనని పూర్ణభావమును బోధించి, నీవెక్కడికి వెళ్ళినా తిరుగులేదుపొమ్మని భయముదీర్చి, దీవించి పొరపాటుపడవద్దని మరలచెప్పి పంపగా, నారదుండు సెలవు దీసుకొని వెళ్ళుసమయమున భోజనముచేసి వెళ్ళుమనగా గురు వాజ్ఞదప్పక భోజనముచేసి గురువాజ్ఞ దీసుకొని బ్రహ్మపట్ట మునకు బయలుదేరగా.

నారదుండు గురునాజ్ఞబొంది, బ్రహ్మపట్నము వెళ్ళుట

నారదుండు గురునాజ్ఞపొంది, బ్రహ్మపట్నము వచ్చు చున్నాడని, కోటకవాటములు దెరచి, నారదునిరాక కెదురు చూచుచుండగా మనోవాయు వేగములతో, సమీపించి నిరాటంకముగా, వెళ్లి, బ్రహ్మదేవుండు దివ్యమునీంద్రులు, బ్రహ్మఋషులు, అద్వైత విద్యాప్రసంగవైభవమును జూచి, బ్రహ్మనంద పరవశులై యుండగాచూచి, పరమానందమున నా కెన్నటికి, యిట్టి బ్రహ్మవిద్య లభించెనని, శ్లాఘించుచు, యీ రహస్యములు, వినుటకు ప్రాప్తించెను. నేను ధన్యుడ

నైతినని, బ్రహ్మదేవునకు-బ్రహ్మఋషులకు, అధికార క్రమములు శిరస్సాష్టాంగ నమస్కార దాసోహములు చేసి, సభాంతరమున బ్రహ్మదేవునియొద్ద సెలవు దీసుకొని, బయలుదేరి, శ్రీవైకుంఠముచేరి, విష్ణుదేవునకు నమస్కరించి దీవనలంది, సెలవు దీసుకొని, బయలుదేరి, కైలాసముచేరి ఈశ్వరునకు సాష్టాంగనమస్కార దాసోహములు చేసిన దీవనలనిచ్చి క్షేమంబులడిగి, యికను జాగ్రత మరువకుమని హెచ్చరించగ సమ్మతించి, పరమానంద మగ్నుండయ్యె, గనుక గురునాజ్ఞ త్రిమూర్తులైనా అతిక్రమించ గూడదని బోధించె. పూర్వజన్మ సుకృతమున సద్గురువు ప్రాప్తించును. పట్టుదల విడువక మంచి గురువుచే విద్య సంపాదించవలెను.

యీ భరత ఖండంబున జనించు సర్వజీవులున్నూ, పూర్వజన్మ కర్మవశంబున, తామసగుణోద్రిక్తులలై ఘోర దుర్మార్గములుచేసి రౌరవాదినరకము లనుభవించుచుందురు. రాజసగుణములతో గర్వాధికులై, ఆర్భాటములతో సకల కార్యములు చేయుచు, గౌరవ లాభములు గోరుకొనుచు పరులకు కృత్రిమములు చేయుచు, మనోదుఃఖములంబొందుచు, పుణ్యపాప కర్మంబులంజేసి, మోక్షమార్గము వెదకక, చచ్చుచు పుట్టుచు నుందురు.

## సాత్వికులు, సన్మానము-జ్ఞానము, వివేకము

పరోపకారము, శాంతము, భక్తి, ప్రారబ్ధకర్మల కోర్చుటయు, పరమపదము సంపాదించు మార్గము వెదకు

టయు వైరాగ్యము గలిగియుందురు. సాత్విక జన్మలకు పూర్వజన్మ కర్మలనుభవింపచేసి, కర్మనిర్ముక్తులంజేసిగాని మోక్షము నందించదు. కర్మలుండగా మోక్షము లభించదు. అకృత్యములు వదలి న్యాయధర్మప్రవర్తనల కాలము గడుపు వారికి కర్మలంటవు. భక్తి నియామకము గలిగి, పరమేశ్వర ధ్యానమున కడతేరవలెను. అజ్ఞానమాయను స్త్రీగాను, అహంకారమును పురుషుడుగాను సృష్టిగల్గినందున యెంత వానికైన అహంకార దుర్గుణములు మానవు. వాటిని దప్పించుకొని జాగ్రతగ నడచిన వానికి భగవదానుగ్రహము దగ్గరనుండును.

## భక్తుల లక్షణములు

సాత్వికుడై జనించి, పూర్వజన్మ కర్మవిశేషములుండి నను పూర్వపుణ్యవశమున, స్నానాది షట్కర్మయుక్తుండై భగవత్సేవా ధురంధరుండై, సంచితకర్మములు, ప్రారబ్ధ కర్మములు- ఆగామి, హఠాత్తుగావచ్చే కర్మలు, వచ్చినపుడు ఓర్పుగలిగి, ఆధివ్యాధి జరామృత్యు పీడలచేతను, తీరని కష్టముల కోర్చలేకను దరిద్రమువలన కుటుంబము, జరుపలేకను, సోదర దాయాదులు, పరజనులు శత్రుత్వములచేతను పుత్ర, మిత్ర, శత్రు, ఋణ, రోగములచేతను, తీరనికష్టములచేతను, భార్యగాని, భార్యవైపు బంధువులతోగాని, పరస్త్రీ వైర ములచేతగాని, ఆయుష్యము తరుగుబడినదను భయముచేతను, భూతప్రేత పిశాచ క్షుద్రదేవతా ఆవేశములచేతను, తంత్రములు

గురువులు, అధికార్లు మొదలగువారి రౌద్రోద్దండ దండనముల చేతను పనులుచేయు శక్తిలేక యేమార్గమునను లాభము లేకను, గృహములు తోటలు దొడ్లు ధనము నశించి, పరుల పాలై, దరిద్రకష్టము లనుభవించలేకను, ప్రాణి విసికి విరక్తి గల్గి, గృహమువదలి, దేశయాత్రలు చేయవలెనను తలంపున సాధుసజ్జన సాంగత్యములుచేయుచు, పరదేశయాత్రలకు బయలు దేరి, దేవతాస్థానములయందు పెద్దలను, సాధువులను, సన్యాసులను, యోగులను, మహాత్ములను దర్శించుచు.

యీ భక్తులలో నిత్య పూజాధురంధరులు, సమారాధనలుచేయువారు దానధర్మపరులు, దయామయులగు దాతలు, వీరివలన అన్నవస్త్రములు గడుపుకొనుచు, మర్రి యూడలువలె జడలుపెంచువారు, సర్వాంగభస్మోద్ధారణచేయు వారు, రుద్రాక్షమాలలు ధరించువారు, నిత్యస్నానముచేయు వారు, గోపీచందనము ధరించువారు, ద్వాదశోర్ధ్వపుండ్రముల ధరించువారు, అర్ఘ్యప్రదానములు చేయువారు, తేవారములు చదువువారు, ఆలయప్రదక్షిణములచేయువారు, జలభక్షణ చేయువారు, పర్ణభక్షణముచేయువారు, కందమూలాదిభక్షణ చేయువారు, నుపవాసములుచేయువారు, దేవాలయముల యందు కొండగృహాలయందు, అరణ్యముల నివసించువారు, ఘోరతపస్సుచేయువారు, కపాలాసనములువేయువారు, ఇంద్ర జాలములనేర్చి పరుల భ్రమింపజేసి పొట్టబోసుకొనువారు, ధనవస్త్రసంపాదనలవలన శరీరభోగములుదప్ప ముక్తిమార్గ

ములు కాకున్నను విధిదప్పకయాచింతురు. ఇట్టి డాంబిక గురువులుజూచి భ్రమించి లోపడరాదు. ముక్తిలేదు.

## దివ్యతిరుపతులు-పుణ్యతీర్థములు

అలహాబాద్, గయా క్షేత్ర స్నానములు, అహ్మదాబాద్ నర్మదానదీ స్నానములు, కాశీ గంగా స్నానములు. విశ్వేశ్వర దర్శనం, అల్లూరి నరసింహాస్వామి, అనగా, బొంబైకి 20 యామడ దూరమున మహాదరణ్యములో అర్ధరాత్ర సమయంబున దేవగంధర్వగానము, జరుగుట-సాధులు-సన్యాసులు దిగంబరులు వెళ్ళి వినుచుందురట. చుండూరు కుమారస్వామి దేవస్థానమందు దేవగంధర్వ గానము భరతనాట్యము జరుగునట. నరసింహ యోగిగారు 3 తూర్లు చూచిరట. హిమాలయ అమరనాధస్వామి, అమరావతి, అమరలింగస్వామి, అయోధ్య శ్రీరాముడు, ఆగ్రా మక్కా మజీద్, అహోబలనారసింహం, తిరుపతి, అలివేలు మంగాపురం. తిరుపతి వేంకటేశ్వర్లు, అనంత పద్మనాభస్వామి, ఉమామహేశ్వరస్వామి, కాశ్మీర పక్షులు, కంచి వరదరాజస్వామి, కంది మల్లయ్యపల్లి, పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వామి. మఠాస్థానము. కపిలాశ్రమం, గంధమాదన పర్వతం, దేవతాసంచారం. సింహాచలం, కూర్మావతారం, త్రికూటాచలం, గజేంద్రమోక్షం, గోవర్ధనగిరి శ్రీకృష్ణుడు, గోకర్ణ క్షేత్రం, గోకుల బృందావనం, గోగర్భం, కుంభకోణం, కురుక్షేత్రం, కోటప్పకొండ, కన్యాకుమారి, కాళీయమర్దన,

గుత్తికొండ బిలం స్నానములు, గరుడానది సర్వప్రయాగం, జంబుకేశ్వరం, జనార్దనం, జగన్నాథస్వామి, చిదంబరం నటరాజస్వామి, చెన్నపట్నం కపాలీశ్వరుడు, చెంగల్పట్టు, జనకపుర పట్నం, సీతామేడ, ఢిల్లీ చక్రవర్తుల స్థానం, పండరీపురం, చంద్రభాగా నది స్నానములు, పాండురంగస్వామి, టాకూర్ కృష్ణవినోదస్థానం, తాటికేశ్వరం, తిరుచునాపల్లి, త్రియంబకం, ద్వారక శ్రీకృష్ణజన్మస్థానం, ద్వారవతి మహావిష్ణువు, తిరువళ్ళూరు వీరరాఘవస్వామి, తపోవనం, నేపాళం, పశుపతి, నాసిక్, పంచవటి, నత్తరామేశ్వరం, పరశురామకోట, బకాసురునికొండ, బైటద్వారక సముద్రప్రయాణం, బరోడా కృష్ణసంస్థానం. మధురాపురం మూలద్వారక, మహాకాళేశ్వరం, మహాబిలేశ్వరం, పాట్నా, యమునానది, భద్రాద్రి యజ్ఞకుండం, బెజవాడ కృష్ణానది, రాజమండ్రి గోదావరీస్నానాలు, రాధాకొండు, కృష్ణకొండు కోనేర్లు, పునహా తుంగభద్రానది, లక్ష్మణజ్వాలా, బ్రహ్మపుత్రానది, దేవర్షి దర్శనం, సింధూనది, సముద్రక్షేత్రం, బ్రహ్మకపాలం, హృషీకేశం, హరిద్వారం, శిలానది దేవఋషి సంచారం, శ్రీశైల మల్లిఖార్జునుడు, రామేశ్వరం రామలింగస్వామి, వాసుకిక్షేత్రం, కుమారస్వామి, ఇత్యాది దివ్యతిరుపతులయందు పుణ్యతీర్థముల పవిత్రులగుచు, పరమభక్తులు నివాసముచేసికొని, భక్తులకు ముక్తిమార్గము బోధించుచు, కడతేరుమార్గము జూపింతురు. విజ్ఞానదాతలై దయాపరమూర్తులై యున్న మహాత్ములచే విముక్తిమార్గము గనుట సాత్విక భక్తరత్నముల కాచారమైయున్నది. గనుక

అట్లే సద్గురువులను వెదకుచుండగా, డాంబిక వేషగాండ్లు, పస లేని గంభీరప్రసంగులు, పన్నెండేండ్లు గురుసేవచేయవలెనను వారు గురువు కోర్కెలు తీర్చినయెడల విద్యలభించుననువారు, త్వరితముగా విద్య అందించగూడదనువారు, దక్షిణ తాంబూలములు భోజన వస్త్ర మర్యాదలు జరుపలేదని విద్యావిష యములో అర్థవిమర్శను మార్చి చెప్పువారు, మోసకారులు, కృత్రిమబుద్ధులుగలవారు, విద్యయిచ్చిన తమ కతిశయము తగ్గిపోవుననువారును, తమ గౌరవము పొగడుకొనువారుగలరు. ఇట్టి దొంగ గురువుల పరిశీలించక విద్యపొందరాదు. యిట్టి వారు తటస్తించుటచేత విద్య లభించక మనోచింతనచేత విచారించుచుండగ ప్రభవసంవత్సర శ్రావణ బ ౧౧ సోమవారం నాటికి ప్రారంభించి, 18 మాసములు మా తండ్రిగారగు జక్కా నరసయ్యగారిచే పొందబడిన మంత్ర జప, పరమేశ్వర ధ్యానములవల్లనో పూర్వజన్మ సుకృతమువల్లనో, సద్గురుదర్శన ప్రాప్తకాలము తటస్థించె.

## సద్గురు దర్శనము

విభవ సంవత్సర పుష్య బ ౧ లు, స్థిరవారము సాయంత్రము ఆరుగంటలకు, బ్రహ్మశ్రీ వేదార్థవేత్తయగు గుద్దంటి భుజంగముగారి గృహామునకు, బ్రహ్మశ్రీ వేదవేదాంగ ఉపనిషత్సారవేదులై, సచ్చిదానంద రహితులై శ్రీమత్పరమహంస నీవారశూక, పీతాభాస్వదణుస్వరూపాధికులై, పంచ కోశాంతర్గత, పంచభూతాత్మక, పంచవింశతి తత్వాతీతులై

షడూర్మిరహిత, షడ్భావ వికారశూన్యులై, నాదుబిందు కళాతీతులై, సర్వతః పరిపూర్ణులై వేంచేసియుండు చుండూరి వెంకటరెడ్డి యార్యదేశికేంద్ర సద్గురుస్వాముల వారు తటస్థింపగా, స్వాములవారు వచ్చిరని, నాయందభిమానము గలిగి, బ్రహ్మశ్రీ వేదవేదాంగ వేత్తలై ఉపనిషత్సారభూతులై, సచ్చిదానంద రహితులగు గుద్దంటి రుద్రయ్యగారు, నాకు చేవుత్తరము వ్రాసి పంపించగా, స్వాములవారు దయచేసిరి. నీవు వుత్తరము చూచిన వెంటనే, యీ రాత్రికి రావలసినది. యీ రాత్రికే గురుపూజ జరుగును. అని వ్రాసియున్న ఉత్తరముచూచి, వెంటనే బయలుదేరి, అచటికిచేరి, గురు దర్శనము చేయుట యెట్లనగా.

సీ॥ గురువరు లరుదెంచ గురుభక్తులగువారు నెమరేగి సాష్టాంగ నియతితోడ। పాదాంగుళంబులు ప్రసరించి కుడిచేత చరణము లెడమహస్తముల ముట్టి। కర్ణనేత్ర లలాటకములను తాకించి। పాదాంగుళంబులు పట్టి పీల్చి। దాసోహమని గురు ధ్యానము గావించి। మంత్రజపంబును మరువకుండి। వందనము చేయు శిష్యుని వర్ధిలంగ దీవనలనిచ్చి గురుమూర్తి దివ్యమైన। జ్ఞానసూత్రోక్త మార్గంబు పూనిదెలిపి। పుణ్యమతిఁ జేయు తత్వజ్ఞ మూర్తియపుడు॥ ఇట్లు శిరస్సాష్టాంగ నమస్కార దాసోహములు సమర్పించి నిలచిన క్షేమసమాచారంబు లడిగి, తదుపరి పరబ్రహ్మ విద్యాసంబంధ కాలక్షేపణ చేయుచుండగా, యీ గురువులవారి గురుపరంపర విచారించగా.

గురుపరంపర యెట్లనగా

సీ॥ శ్రీ పరబ్రహ్మకు శివుడు శిష్యుండయ్యె। శివునకు బ్రహ్మయు శిష్యుడయ్యె। అలబ్రహ్మకు వశిష్టు డలరి శిష్యుండయ్యె। ఆ వశిష్టుకు శిష్యుడా జనకుడు। జనకునకును శుక జన్ముండు శిష్యుండు, సాందీపనికిని కంసారి శిష్యుండయ్యె। వాసుదేవుని శిష్యవర్యు డుద్ధవుడను। ఆవరేణ్యునకును రామావధూత, రామావధూతకు రహిత భీరుండును మల్లిక భీరునకును వేమన్న ప్రియుండు। వేమన్న శ్రీధరు వేత్తను జేసెను శ్రీధరస్వామికి శిష్యుండు సాందీపి శ్రీశూకునకు శిష్యుండు శివరామ దీక్షితవర్యుండు। దివ్యగణుడు। దీక్షిత వరునకు దివ్యకంబాలూరి అప్పయ్య శిష్యుడై యలరుచుండె। అప్పయార్యుని శిష్యుడల పరశురాము, నరసింహ గురుడని యెరుగనయ్యె॥ గీ॥ పరమగురుడైన పోలూరి పాపనార్య గురుని శిష్యుండు చుండూరి గుప్తకులజ, రెడ్డెయాఖ్యుం డఖండుడు దొడ్డవాడు, కారణంబిచ్చి కడతేర్చు ఘన గురుండు॥

ఇట్లు బ్రహ్మశ్రీ చుండూరి వేంకట రెడ్డెయార్య దేశి కేంద్ర సద్గురుస్వాములవారి గురుపరంపర ఇట్లు దెలియగా, వారికి శిరస్సాష్టాంగ నమస్కార దాసోహములు చేసి నిలచిన శిష్యునింగని, వారి కరుణాకటాక్ష వీక్షణమున, హేవత్సా! నీవు పూర్వజన్మ సుకృతము చేత, సాత్విక భావమగు మోక్ష విద్య గోరితివని ప్రసన్నముఖులై, అనుగ్రహించి, గురు సూచనాక్రమంబున, శిష్యులకు, పరబ్రహ్మదర్శన ప్రాప్త కారణంబగు, గురుకారణం బిచ్చుట యెట్లనగా.

## గురుసూచనాక్రమము

సీ॥ స్నానవస్త్రాచ్ఛాదనాచమనంబులు కలశ పూజార్చ
నాక్రమము నడపి। పాదాభిషేకంబు ప్రార్థన ధ్యానంబు నవ
వస్త్రధారణ నటులజేసి। అలపీఠ పూజనా వాహనములుసల్పి
అఖిలాంగ పూజ సమర్పితముగ। మంగళారతులతో మరి లాలి
పాటల మేలుకొల్పిన గురుమిహిరుడపుడు। ద్వాదశదండము
ల్దాసోహములు చేసి ప్రామాణ్యమును ప్రయత్నమునను। మాంస
పిండంబును మంత్రపిండము చేసి। నొసలి పై వ్రాతను నోలి
తుడిచి। జిహ్వాపై బీజముల్ చెలువంద లిఖియించి। మంత్రోప
దేశంబు మరియుజేసి। హంసతారకతత్వ మలవడగాజేసి
ముద్రభావంబును మురియజూపి॥ గీ॥ ప్రణవతత్వ స్వరూపంబు
రమణదెల్పి పాదతీర్థ ప్రసాదముల్ పరగనిచ్చి గురు నియా
మక మార్గంబు గురుతుచ్చి। చెలగి తత్వమలవడగాజేసి ముద్ర
భావంబును మురియజూపి॥ గీ॥ ప్రణవతత్వ స్వరూపంబు రమణ
దెల్పి। పాదతీర్థప్రసాదముల్ పరగనిచ్చిగురునియామక మార్గంబు
గురుతులిచ్చి చెలగి తత్వప్రసంగము ల్సేయునపుడు వరగురు
దయార్థియగుజ్ఞాపర్తునకు తెలుపుచుండునుజ్ఞానంబు తేటగాను॥

గీ॥ సచ్చిదానందమయుడును సద్గురుండు వాదరహి
తుండు చుండూరి వంశభవుడు, రెడ్డి యాఖ్యుండు జ్ఞానియు
దొడ్డవాడు, కారణంబిచ్చి కడతేర్చు ఘనగురుండు॥

క॥ చుండూర్వేంకటరెడ్డికి దండి నమస్కృతులు చేసి
దాసోహమనన్ మెండగు తారకసాంఖ్యములండనుయమనస్థ
విద్యయంతయు నిచ్చెన్॥

ఇట్లాత్మవిద్యనిచ్చిన చుండూరి వేంకటరెడ్డె యార్య్య దేశికేంద్ర సద్గురుస్వాములవారు సంపూర్ణానుగ్రహమున, హితోపదేశముగా, మంత్రరహస్యంబులున్ను మరికొన్ని నడవడికలుదెల్పి, మరియు నిట్లనియె.

గురు నియామకములు

సీ॥ గురుమంత్ర జపములు గురిదప్పి యధములై సారె సారెకు దాము చచ్చిపుట్టు, గురునందు విశ్వాసగుణము లేకుండిన, అంధకారపు త్రోవ నలసటపడు, పరమాత్మ మరచిన పరమిహంబును లేక పంచేంద్రియము లచే బంధకుడగు, జ్ఞాన భక్తియను సన్మానంబు మరచిన నర పశువాస్తిక నాస్తికుండు॥ గీ॥ కర్మచండాలు లల్పులు కఠినగుణులు బుద్ధిలేనట్టి సంసార బద్ధకులను ముట్టుకొన్నను దోషము లుట్టుకొనును అట్టి వారిని మదిని చేపట్టరాదు.

సీ॥ గురు దేగుదెంచిన కూర్చుండగారాదు కూర్చున్న యెడబాయగూడదెపుడు। బోధించ విడనాడి పోదలంప గారాదు। బోధింపబడకున్న పోరరాదు। దయ ననుగ్రహమున్న తడవు సేయగరాదు తడవైన తత్తరపడగరాదు। పనులాజ్ఞ జేసిన పరిహరింపగరాదు చేయవద్దను పను ల్చేయరాదు। స్నాన పానముల్ ముందుగా సలుపగారాదు ఒంటిశయ్యాసనంబున నుండరాదు॥ గీ॥ వినయ భయభక్తి మొదలో విడువరాదు మనసులోపల సూచన ల్మరువరాదు మంత్రమర్మంబు లెప్పుడు మరువరాదు గురుని సేవించు పరమభక్తునకు వత్స యని

గురునియామక రహస్యములు బోధించి, యీ యోపత్మోదేశ విద్యను॥

అనగా బ్రహ్మాండ 14 భువన కోశాత్మకముగా నున్నటువంటి, పరబ్రహ్మ విద్యను, స్థూలశరీరముగా నున్నటువంటి, చతుర్వేద సమన్విత, ప్రణవ పంజరంబులగు, దేహాత్మకముగా నున్నటువంటిదిన్నీ, సాంఖ్యస్వరూపమైనదిన్నీ, తారక స్వరూపాధారముగా నుండునదిన్నీ, అహర్నిశ సంచారముగలదిన్నీ, జ్యోతి స్వరూపమైనదిన్నీ, అమనస్కమున కాధారమైనదియు, జన్మకర్మ బంధరహితముచేయునదిన్నీ ఇట్టి పరమరహస్య విద్యను అన్యులకు చెప్పరాదు. ఇది గురుమర్మము.

## గురువిద్య చెప్పగూడనివారు

మూఢులకు, ఖలునకు, నీతినియమములు లేనివానికి జడమతులకు, దురాచారులకు, డాంబికులకు, ఇంద్రియ లోలురకు, పుత్రదారాధికారాగృహ బంధకులకు, ఆశాబద్ధులకు, భక్తిహీనులకు, దేవుడు లేడనువానికి, భక్తజనద్వేషులకు, యీ యోగంబు దెలుపగూడదని సద్గురుమూర్తి యాజ్ఞ.

## గురువిద్య చెప్పతగినవారు

యీ పరమరహస్యంబగు జ్ఞానవిద్య చెప్పతగిన వారెవరనగా.—సాత్వికులకు, శ్రద్ధగలవారికి, భక్తునకు, నీతినియమము గలవానికి, అసూయలేనివానికి, సర్వభూతసమర్థునకు, గురుశుశ్రూషాభిమానులకు, లోకవిషయవిరక్తులకు, శాంతచిత్తు

లకు, నిర్మత్సరులకు, పరిశుద్ధాత్ములకు, అన్యకాంతవిముఖులకు, నిష్కాములకు ఇట్టి సత్పురుషులకు యోగంబభ్యసింపవలెనని సద్గురువాజ్ఞను పొందినకారణమున.

## గురువుగారి ఆజ్ఞ

**1931-1-1** ప్రమోదూత సంవత్సర పుష్యశుద్ధ ౧౨లు బుధవారం నాటిరాత్రి ముక్కోటి యేకాదశి యగుటవలన, బ్రహ్మశ్రీ చుండూరి వెంకటరెడ్డి యార్యదేశికేంద్ర సద్గురు స్వాములవారు దయచేసి, నీవు వ్రాసిన ఉత్తరములో కొంత మంది గురుసూచన నిమిత్తము కోరియున్నారని వ్రాసినావు. నీవు సంశయించగూడదని ప్రోత్సాహించి, నీకు సాహాయముగా నుందురు. వారికి గురువిద్యక్రమాభ్యాసము చేయవలసినది. నీకిది కొంత ఆధారముగా నుండునని నిశ్చయించి నన్ను రప్పించి వారిబలముచేత ఆరాత్రికి నాకధికారమిచ్చిరి. వెంటనే ఆ కోరినవారికి కారణ మిప్పించిరి. గురువులవారికి ఆ రాత్రి యోగదృష్టిలో యీ కారణము తీసుకొన్నవారందరు స్తిమితములేక చీమలు చెల్లాచెదరుగా వారి వారి యిష్టములప్రకారము చాంచలముగా దిరుగుచున్నారు. నీయొద్ద నొక్కరైనా నిలువరు అని సెలవిచ్చి గురువులవారు వెళ్ళిపోయిరి. తర్వాత విద్యాప్రాప్తిగలవారు యెప్పటికైనా యేవిధమునైనా విద్య కొరకు వెదకుచుందురు. అవసరములేనివారల బ్రతిమాలుట కంటే నిదానించుటమంచిదని, కొందరు వచ్చి విద్య నడుగగా షుమారు 42 మందికి కారణమిచ్చి గురువిద్యను బోధించగా వారున్ను అవసరము గడుపుకొని అంతట వెళ్ళిపోవుటనుబట్టి

విద్యాదానము శ్రేష్ఠమని గ్రంథరూపముగా వ్రాయుట మంచి దని యెంచి, జనోపకారముగా నుండునని వ్రాయడమైనది. మోక్షవిద్య గోరువారికి మిక్కిలి సాహాయ్యముగా నుండును.

1943-10-10 తేదీ రాత్రి అనగా

గీ॥ సరసమైన స్వభాను సంవత్సరమునందు, యాశ్వ యుజ శుక్లపక్షంబునందు గలుగు తిథిని యేకాదశియు గల దినమునందు సాంఖ్యయోగంబు మనమున చర్చగలిగె. యీ జంబూద్వీప భారతవర్ష నివాసులగు, పుణ్యాత్ములైన సాత్విక భక్త శిరోమణులకు అద్వైతమార్గప్రచారక సిద్ధపురుషులకు బ్రహ్మాండసృష్టిక్రమ పంచీకరణ సాంఖ్యసూత్ర రహస్యము, అను గ్రంథమును పరమాత్మనుండి జగత్సృష్టికలిగిన క్రమం బున స్నానాది షట్కర్మలున్నూ యమాది అష్టాంగయోగ విధులు, సర్వదేవత మంత్రజప నియామకములు, దేవతా భేదంబులు దేవతోపాసనాక్రమంబులు సాంఖ్య, తారక, అమనస్క యోగవిధానములు, సమాధి నిష్టాపర్యంతము, అనగా పరబ్రహ్మైక్య పర్యంతము, క్రమవిమర్శారూపంబులుగా నుండునట్లు, బ్రహ్మశ్రీ జక్కా వెంకటసుబ్బయార్య విరచిత మగునట్లున్నూ ముముక్షు జనమార్గదర్శకముగా నుండు నట్లున్నూ, గ్రంథము వ్రాయడమైనది. యెట్లనగా:

భక్తి కారణ నిష్టాచారములు

బ్రహ్మదేవుని కుమారుడగు, స్వాయంభువ మనువు, హిమాలయ దక్షిణప్రాంత ఆర్యావర్తదేశమున సింధూనదీ

తీరమున, బ్రహ్మావర్త దేశముమధ్య ప్రవేశించి, కాలము గడుపుచుండగా, ప్రియవ్రత ఉత్తానపాదులు, యిద్దరుకుమారు లుదయించిరి. వారిలో ప్రియవ్రతునకు 10 కుమారులు కాల క్రమమున జన్మించగా, ప్రియవ్రతుండు తపోధ్యాన నిష్ఠలతో మోక్షమార్గ ప్రియుడై యుండగా, బ్రహ్మదేవుండువచ్చి తపోధ్యాననిష్ఠ నీకిప్పుడనవసరము. రాజ్యముచేయుట యత్యా వసరమని బోధించి, పట్టాభిషిక్తునింజేసి రాజ్యభారంబు వహింపచేసి, అర్బుద సంవత్సరములు, రాజ్యంబుచేయునటుల నియమించె. అంతట, స్వాయంభువమనువు, షట్కర్మ-యమాద్యష్టాంగ యోగపరుడై-సాంఖ్యతారక అమనస్క యోగ సిద్ధిపరుడై, సమాధి నిష్ఠలతో, బ్రహ్మైక్యపర్యంతము, నిష్ఠ సమగ్రముగజేసి, కాలక్రమంబున, పర బ్రహ్మైక్యము పొందెను. తదుపరి ప్రియవ్రతుని పుత్రులు, 10 మందిలో, జ్యేష్ఠుండగు, అగ్నీంధ్రుడు జంబూద్వీపమును, మేధాతి, ప్లక్షద్వీపమును, వపుష్మంతుడు శాల్మలీ ద్వీపమును, జ్యోతిష్మంతుడు కుశద్వీపమును, ద్యుతివంతుడు క్రౌంచ ద్వీపమును, భవ్యుడు శాకద్వీపమును, సవనుడు పుష్కర ద్వీపమును వీరివీరినీ యీ ద్వీపములకు పట్టాభిషిక్తులంజేసి యొక్కొక ద్వీపమునకు అనేక దేశపట్టణములుగా నియ మించి, అధిష్టాన పురములతో నిర్మించి, యేలించెను. భగవద్భక్తి నియామకములు వదలక, యోగమయులై యుండిరి. పుణ్యమూర్తులుగా నుండిరి. త్రిలోకములయందు 2 ద్వీపములయందు అతలాది 2 లోకములయందును

2 ఊర్ధ్వలోకములున్నూ కలిసి 14 లోకములయందును, నిష్టాచారములు, యెట్లనగా: అతలా అధోలోకనిష్టలు. యింతకుముందు వ్రాసియున్నవి. యికను ముందు వ్రాయునవి ఊర్ధ్వలోక నిష్టలని తెలియవలెను. మరియు.

పుష్కర ద్వీపమున సకల నిష్టలతో బ్రహ్మదేవునకు నిత్యకర్మారాధనమున్నూ, శాకద్వీపమున శ్రీహరిని సేవింపుచు ప్రాణాయామమున ఆత్మానుసంధానుపరులై, సమాధి యోగము సాధింపుచు వాయుదేవుని పూజాధ్యానములు చేతురు. క్రౌంచద్వీపమున సకల నిష్టలతో విష్ణుభక్తిగలిగి వరుణదేవు నారాధింపుచు కృతార్థులగుదురు. కుశద్వీపమున సకలనిష్టలతో యజ్ఞపురుషు నారాధింతురు. శాల్మలీద్వీపమున సకలనిష్టలతో సోముని ఆరాధింపుచుందురు. ప్లక్షద్వీపమున సకలనిష్టలతో అగ్నిదేవుని సూర్యదేవుని బూజారాధనములతో కడతేరుచుందురు.

## భూలోకము

జంబూద్వీపమున షట్కర్మాదులు అష్టాంగ యోగములున్నూ తారకసాంఖ్య అమనస్కములు దెలిసి త్రిమూర్తుల పూజింపుచు, సకలయోగ సిద్ధులు పొందుదురు.

భువర్లోక నివాసులు, ఆహార నియమములచే నుపవాసములు చేయుచు వ్రతాచారులై తపోయోగ సంపన్నత్వముచేత, సిద్ధగణ గగన సంచారులై యుందురు.

సువర్లోకమున, అనగా, స్వర్గమువరకు, అష్టాంగ యోగపరులై మహాయోగ భోగములతో నుందురు.

మహర్లోకమున ఆత్మయోగధారణాపరులై, అణిమాద్యష్ట సిద్ధులుగలిగి, తన్మయయోగానందంబున నోలలాడుచుందురు. గగన సంచారములతో దేవసమానులై యుందురు.

జనోల్లోకమున, అష్టాంగయోగ సమగ్రులై నిరంతర యోగ సమాధిపరులై, పద్ధతులు దప్పని యోగారూఢులై నిశ్చలానందమున నోలలాడుచుందురు.

తపోలోకమున నిరంతరధ్యానారూఢులై నిరంజన నిర్వికల్పులై నిశ్చలానందమగ్నులై యుందురు.

సత్యలోకమున ధారణాయోగమయులై అతిశయానందంబున నిరంతర నిష్టదప్పక బ్రహ్మానందపదవి నొందుచు, చలనము లేకయుందురు.

ఆ పైగా పరబ్రహ్మలోకమువారు యేభేదంబులు లేక నిత్య సమాధి నిష్టాపరులై ఐక్యసంధానపదవి నొందెదరు.

ఇట్లు యీ క్రిందట తెలియజెప్పిన 14 భువన బ్రహ్మాండ మండల సకల నిష్టాచారులు, యెప్పటికైనను మోక్షము పొందువారే, అన్యులు ముక్తిపొందజాలరు.

పూజా ఫలితము

శ్లో॥ పూజా కోటి సమం స్తోత్రం। స్తోత కోటి సమంజపం। జపే కోటిసమం ధ్యానం। ధ్యానకోటి సమోలయః॥ యీ సూత్ర

క్రమమున కోటిపుష్పములతో పూజించిన ఫలితము రెండు ఝాములు భజనలు చేయుటచే కల్గును. కోటితూర్లు భజనలు చేసిన ఫలితము. 108 జపఫలిత సమానము. కోటి జపించిన వేదచోదిత పూజాధ్యానముచేసిన ఫలితము గల్గును. కోటితూర్లు మహాధ్యానముచేసిన రెండుగంటలు మనోలయ ధ్యానముచేసిన ఫలితముగల్గును. 1 సహస్రము జపించిన ఫలితమున్నూ గల్గును. కోటిసహస్రములు చేయుటకంటే మనోలయసమాధినిష్ట రెండు ఝాములు నిల్పిన ఈశ్వర సమానుడగునని సర్వవేదసిద్ధాంతము.లోకమునందు 14 అచార నిష్టలు పర్యంతము సమాధినిష్టయే శ్రేష్టమని చెప్పియుండిరి.

ఇచట వైకృత మానవాది సృష్టి ప్రారంభమున సాంఖ్యసూత్ర పంచీకరణ తత్వసృష్టి విభాగము విమర్శగా చేసియున్నందున అది చూచిన తత్వోత్పత్తి దెలియును.

## స్థూలదేహ జీవుని లక్షణము

జీవుడు 1 అంతఃకరణములు 4 పంచ ప్రాణములు జ్ఞానేంద్రియములు 5 తన్మాత్రము 5 కర్మేంద్రియములు 5 అవిద్య 1 కూడి 26 తత్వములు స్థూలదేహమని ప్రసిద్ధి గలదు. యీ స్థూలదేహము బ్రహ్మాండావరణమును పోలి యుండు. మరియు చతుర్వేద సమన్విత ప్రణవపంజరంబనియు, ఈశ్వర స్థూలవిరాట్టనబడి దీని కభిమాని విశ్వుడుగాను, క్రియా శక్తియు, రజోగుణమునకుస్తానమై నేత్రస్థానమందు జీవుడు నిలచి ప్రత్యేక భోగము లనుభవించుచు, యీ జీవా

త్ముడు అకార బ్రహ్మతత్వమున జాగ్రతగలవాడై, వ్యావహారిక జీవుడై, నామరూప ప్రపంచములతో సర్వదేహాది స్థూలకోశములయందు వ్యాపించుచు ప్రత్యక్షతనుకరణ భువన భోగముల ననుభవించుచు నున్నాడు. ఋగ్వేదరూపంబై, ప్రజ్ఞానమను గర్వంబున వివేకములేక అవ్యక్తమత్తతచేత బ్రమత్తుడై యుండు.

## పంచభూతగుణ ధర్మ కర్మములు

పృధ్వీగుణం. శ్లో॥ రోమం మాంసం చాస్థి చైవా। నాడీచర్మత థైవచా। ఏతేషు పృధివీగుణ్యాం। శరీరేణస ఉచ్యతే॥

జలభూతగుణం. శ్లో॥ మూత్రం శ్లేష్మం స్వేదకంచ। రక్తశుక్లంచ దీపికం। ఏతేషు ఉదకాద్గుణ్యా శ్శారీరేణస్య ఉచ్యతే॥

అగ్నిగుణం. శ్లో॥ క్షుధాతృష్ణాచ నిద్రాచ। మోహమైధున మాంద్యకం। ఏతేచాగ్ని గుణప్రోక్తాః। శ్శారీరేణస్య ఉచ్యతే॥

వాయుగుణం. శ్లో॥ ఉల్లంఘనం ప్రచలనం। స్తూలమున్మీలనం తధా। నిమీలనం మహావేగం వాయోచ్చగుణ ముచ్యతే॥

అకాశగుణం. శ్లోకం॥ కామక్రోధం లోభమోహం। భయడాంబికమేవచ ఆకాస్యగుణ ప్రోక్తోవ్యోమ పంచక ముచ్యతే॥ యీ పంచభూతగుణములు మానవులకు కలిగి యుండును. ఇవి జయించినవాడే యోగి యగును.

## షట్చక్ర వివరము

శ్లో॥ ఆధారోర్ధ్వంచాంగు శేద్వి। స్వాధిష్టానం సలింగ కం। మణిపూరోర్ధ్వం। పద్మకంస్యా। అనాహత దశాంగుళం। తదూర్ధ్వం ద్వాదశాంగుళ్యం। విశుద్ధంచ తదూర్ధ్వకం। దశ ఆజ్ఞా పూరకంచ। చక్రాణాం మానముచ్యతే॥

## షోడశప్రాణ స్థానములు

శ్లో॥ ఆధారే లింగనాభౌ। హృదయసరసిజే। తాలుమూలే లలాటే। దేపత్రే షోడశారే। ద్విదశ దశదళే। ద్వాదశార్ధే చతుర్ధే। వాసాంతే జాలమధ్యే। డపకటసహితే। కంఠదేశే స్వరాణాం। హాంక్షంతత్వార్ధయుక్తం। సకల దళయుతం। వర్ణరూపం నమామి॥

## షట్చక్ర దేవతా ధ్యానంలు

### ఆధారస్థాన గణపతి ధ్యానం

శ్లో॥ ఆధారం స్వర్ణవర్ణం। చతుర్దళ సుశోభితం వాదిసాం త్రైశ్చతుర్వర్ణం గణేశా। మండితప్రియం॥ వ-శ-షం-స-దళయుక్తం। సమ్యగాధారపద్మే। తరుణ మరుణవర్ణ। వారణాస్యం త్రినేత్రం। అభయ వరదహస్తం చారుపాశాంకు శాఢ్యం కరయుగళే మనన్యం చింతయే విఘ్నరాజం॥

### స్వాధిష్ట బ్రహ్మధ్యానం

శ్లో॥ స్వాధిష్టానం విద్రుమాభం॥ షట్పత్రంచ సుశో భితం। బాలాంతం షడ్వర్ణాని। బ్రహ్మాణే మండితప్రియా॥

బ-భ-మ-య-ర-ల, సాక్షే రక్తైర్ద్వి ప్తపద్మే! సురుచిర ముపవిష్టం సుందరం పద్మయోనిం॥ అభయ వరద హస్తం! చారుకుంభాక్షమాలాం! కరయుగళ మనన్యం చింతయే విశ్వరూపం॥ యీ దేవతల నుపాసనచేయుచు, ఆస్థానములయందు, దృష్టినిల్పి మంత్రధ్యానము చేయుచున్న, మంత్రసిద్ధియై, దేవతా వశీకరమగునని, సర్వవేద సిద్ధాంతము. ఇష్టే సర్వత్రా గ్రహించేది.

## మణిపూరక విష్ణుధ్యానం

శ్లో॥ రత్నాభం మణిపూరంచ! దశందళమిహోచ్యతే డాద్యైః ఫకారవర్ణాని, విష్ణునామండితప్రియం॥ డాద్యైః ఫాంతగతైః ప్రకల్పితదళే! పద్మేనివిష్టం హరిం! మార్తాండద్యుతి మాది పూరుషనిభం! నారాయణం చింతయేత్! హస్తాంభోజ గదాదిశంఖమమలం! పీతాంబరం కౌస్తుభం! గ్రైవేయాంగదహారనూపురయుతం! హేమాంబరం భావయేత్॥

## అనాహత ఈశ్వరధ్యానం

శ్లో॥ అనాహతం! హేమవర్ణం! దళం ద్వాదశ శోభితం! కాదిష్టాంతైర్వర్ణయుక్తం! శంకరోమండితప్రియ కాద్యైష్టాంతగతైః ప్రకల్పితదళై! పంకేరుహే పార్వతీకాంతం కాంత శశాంక బింబరుచిర ప్రఖ్యాకపర్దోజ్వలం! శాంతం టంకమృగాది యుక్తమమలం! హస్తైక రైః కంకణం! గ్రైవేయాంగద! హారనూపురయుతం! చర్మాంబరం భావయేత్॥

## విశుద్ధజీవుడు

శ్లో॥ విశుద్ధమంబుజం చైవా। తేజఃపుంజ తద్దైవచ।
వర్ణాని షోడశంచైవా। జీవానామండితప్రియం। మూర్ధాంగేషు।
నివిష్టమంగరచితం। వ్యాప్తం జగత్కారణం। మూర్త్యాశేష
గుణా గుణాగుణమయం। భావైక్యసంమిశ్రితం। సాక్షాత్షోడశ
వర్ణపత్రకమలం జీవం విశుద్ధాంబుజం॥

## ఆగ్నేయచక్ర గురుధ్యానం

శ్లో॥ ఆజ్ఞాపూరం రక్తవర్ణం। ద్విదళంచ శుశోభితం।
హంక్షం ద్వేక్షరసంయుక్తం। సూర్యచంద్ర సమన్వితం॥
అంక్షాభ్యాం పరివృత్త పత్రరచితం। వ్యాప్తం జగత్కారణం॥
విశ్వోతీర్ణ మనేక దేహనిలయం। ప్రత్యంచ మాత్మైత్యయా
తత్తద్యోగ్యతయా। స్వదేశికతనుం। సంప్రాప్త మాప్తప్రభం
ప్రత్యక్షాక్షర మవ్యయం। గురుపదం ధ్యాయే త్పరం దైవతం॥

## సహస్రారచక్ర పరమాత్మధ్యానం

శ్లో॥ తస్మాదూర్ధ్వమధోభాగే। పద్మం దశసహస్రకం।
నిత్యానంద మయం శంభుం। గురుశక్తిసమన్వితం। ఏవంజ్ఞాత్వా
విధానేన భావయేద్యోగిమానసః। అనంతగుణవర్ణానాం। శక్తి
రూపమిదం బుధైః॥

శ్లో॥ విశ్వవ్యాదిసమాదిమేకమమలం। నిత్యం పరం
నిర్మలం। నిత్యోద్బుద్ధ సహస్రపత్రకమలే। లుప్త్యక్షరైర్మండితే।
నిత్యానంద మనంత పత్రపళిభిః। శక్తిస్ఫురత్యాత్మకం। సత్యా
త్మానమనేక దేహనిలయం। స్వచ్ఛం గతస్సర్వదాః॥

బ్రహ్మరంధ్రమంటపే సహస్రదళ కమలకర్ణికా మధ్య స్థిత పరమాత్మనే అకారాది షకారాంతం అనులోమవిలోమ దశకం దశవారం బ్రహ్మరంధ్ర మంటపే పరమాత్మనే నమోన్నమః।

యీ ష డా ధా ర చ క్ర ము ల యం దు, అ న గా :

ఆధారస్థానమందు విఘ్నేశ్వరుడు, స్వాధిష్టమున బ్రహ్మయు, మణిపూరకమున విష్ణువు, అనాహతమున ఈశ్వరుడు, విశుద్ధమున మహేశ్వరుడు, ఆగ్నేయమున సదా శివుడు, సహస్రారమున పరమాత్మ, వీరలుచిరనివాసస్థాయిగా శరీరియందు యీస్థానములయందు అనగా, గుదస్థానమందు, మర్మస్థానమందు, నాభిస్థానమందు, హృదయస్థానమందు, దృక్కునిల్పి పూజాధ్యానములు చేయువారికి భోగసౌఖ్యాభీష్ట సిద్ధులిచ్చుచుందురు. యీ పూజాధ్యానాదుల వలన, యెంత పుణ్యముగలుగునో అంతకాలము స్వర్గలోకమున ఆపుణ్యము నశించువరకు, క్షీణే పుణ్యే మర్త్యలోకే విశంతి యను న్యాయమున, పుణ్యము నశించగా భూలోకమున జనించకతప్పదు. పూజాధ్యానాదులవలన వచ్చిన పుణ్యముచే మోక్షము దొరకదు. పరమాత్మను దర్శించిన మోక్షము గల్గును.

## ఎరుక ప్రభావము

అండపిండ బ్రహ్మాండములకు పరమే యాధారము. పవన స్వరూపుడగు ఆత్మారామ బ్రహ్మమును జపయుక్తముగా

నుంచుకొని, యీ అక్షరద్వయమును ధ్యానించుచు, నేత్రము లచే బ్రహ్మమును దర్శింపుచు, అట్టి బ్రహ్మమును, యెఱుక యనియు, మాయయనియు జెప్పుదురు. యెరుక టెంకాయ జలమువలె అఖండాకృతియై ప్రభవించె. ఉత్పత్తి-స్థితి-లయము లుండుట చేత, అచలమువలె తాను అఖండాకృతి పొందనేరక, ఖండఖండములుగా రూపములు దాల్చి, లోకములను, లోక ములో హరిహరులు మొదలుగాగల దేవమానవులను, మృగ పక్షి క్రిమి-కీటకాదులను బుట్టించి, తాను భగవచ్ఛబ్ద మును పొంది, ఆత్మ్రడనబరగి దేవమానవాదుల కోర్కెలు నెరవేర్చుచు, తనమాయకు లోబరచుకొని, తాను సూత్ర ధారియై, యొకచోట ఆడుచు, నొకచోటపాడుచు, నొక చోట వినుచూ, నొకచోట నవ్వుచు, నొకచోట నేడ్చుచూ, నొకచోట పుట్టుచూ, నొకచోట గిట్టుచు, యీ ప్రకారము అనేక చిత్రములు చేయుచుండును. ఎరుకపుట్టుటయు, మర ణించుటయు, ప్రభావమును, మహత్వమును, వివరించి చెప్పు టకు నెవరికి తరముకాదు, సాధ్యపడదు. పట్టిచూడబోతే నిల్కడలేదు. భ్రమరూపమై, యెండమావులరీతి, త్రాడు భుజంగమనునట్లు, వంధ్యాసూనునికైవడి. మిధ్యారూపమై, భ్రమింపచేయుచుండును. శరీర నవరంధ్రములలో వాటిలో నాసికారంధ్రములు ౨ యీ రెంటిలో యెరుపు సూర్యనాడి, తెలుపు చంద్రనాడి యీ రెంటిలో మిశ్రమనాడి ఇది సుషుమ్న, చీకటి కోనవంటిది. దీనికి నగ్రభాగమున యెరుక యనెడు, అజపకుండలి యందు యెరుకయనెడు పులుగుండును. ఆ

వులుగునే హంసయనియు, ఇంద్రజాలికుడనియు, జీవబ్రహ్మ మనియు, పరబ్రహ్మమనియు, నారాయణుండనియు, సదా శివుండనియు, మహాలింగమనియు, కళాస్వరూపుండనియు, సర్వసాక్షియనియు, ఆపోజ్యోతియనియు, సచ్చిదానంద మనియు చెప్పబడును. యీ చతుర్దశ లోకములున్నా మెరుకగా దెలియనగు. యీ మెరుకకు మూలములేదు. సంధ్యాసూనుని వగిది మెరుక తనకుతానేవచ్చి భ్రమింపచేసి చచ్చుచుండును.

---

ఓం

## ప్రణవవిరాట్టు విషయము

శ్లో॥ ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ। ధ్యేయం సర్వ ముముక్షుభిః। ఓమిత్యేకాక్షరం బ్రహ్మ। వ్యాహరన్మామను స్మరన్। యః ప్రయాతిత్యజందేహం సయాతి పరమాంగతిం। ప్రాధాన్యం శ్రూయతేశ్వత్వా। ప్రణవస్యజపాదిషు। తస్మాత్సర్వ ప్రయత్నేన ప్రణవైకపరోభవేత్। జపజ్ఞానాత్తథాధ్యానా। స్నానవృద్ధిఖిలోస్తుశోధనం। తస్మాత్తాని తథాకుర్యాత్ ద్యుతి శుద్ధ్యర్ధమాత్మనః।

ఓంకారమే విరాడ్బ్రహ్మము, ఇదే పరబ్రహ్మస్వరూ పము. దీని కన్యముగా మించినదిలేదు. ఇది త్రిమూర్త్యాత్మ కము. ప్రధమ, ద్వితీయ మూర్తులు స్వరవ్యంజనాత్మకము

లుగా, తృతీయమూర్తి అతి సూక్ష్మము అని యోగులు ధ్యానింతురు. అరూప పరమాణువు అర్థాంశము. నిర్గుణ ప్రకాశము అక్షయమైయుండు. ఇది యెరిగిన ముక్తిలభించును. జ్ఞానతేజస్సు గలుగును. అకారము తేజస్సున్నూ, ఉకారము క్షరమున్నూ, మకారము అతిసూక్ష్మమున్నూ కలిసి ఓంకారమయ్యెను.

అకారము బ్రహ్మస్వరూపము, ఉకారము విష్ణుస్వరూపము, మకారము రుద్రస్వరూపము అని తెలియవలెను. నిత్య నిర్మల నిర్గుణము ఓంకారమాయెను. దీని నుచ్చరించుచు జపించుచు, స్మరింపుచు యోగముసాధించు యోగరూఢునకు సర్వసిద్ధులు గలుగును.

ఇట్టిప్రణవమును పూరకమున౨, రేచకమున౨ కుంభకమున౨ ఇట్లు త్రివిధములుగా చేయుచు పరిచితివలన ౧౨ ప్రణవము లుచ్చరించునంతకాలము అనగా, రేచక పూరక కుంభకములయందు, ౪ మాత్రలుగా, ౧౨ వరకగును. తర్వాత, ౨౪ ప్రణవముల వరకున్నూ ౩౬ ప్రణవముల వరకున్నూ, చేయుచూ ఇట్లే క్రమాభివృద్ధిచేయు యోగికి తారకమూర్తి దర్శనము శీఘ్రముగా నగును. ఇది ప్రత్యక్ష ప్రమాణము. ఇట్లు చేయుటచే జల చల స్థల చర క్రూర జంతువులవలన గలుగుబాధలు బాధించవు, దోషములంటవు; సర్వజంతువులు వశీభూతములగును. యోగాభ్యాసులకు కాల క్రమంబున వాయువులు వశీభూతములగును. వశ్యసిది

లభించును. యిందుకు పథ్యము-సాత్విక-రాజస-తామస గుణలక్షణ విమర్శ దెలుసుకొని, రాజస-తామస గుణ వికారములను అవశ్యము వదలవలెను. యీ గ్రంథమం దీ ఖండమందే యివి వ్రాసియున్నవి.

పంచరత్నములు

౧. శ్లో॥ నాహం దేహోనేంద్రియాణ్యంతరంగో। నాహంకారప్రాణ వర్గోనబుద్ధిః। దారా పుత్ర క్షేత్ర విత్తాది దూరః। సాక్షీనిత్య ప్రత్యగాత్మా శివోహం॥

౨. శ్లో॥ రజ్జుజ్ఞానాద్భాతి రజ్జోయథాహి। సత్యంజ్ఞానాదాత్మనో జీవభావః ఆప్తోస్త్వాహి। భ్రాంతి నాశోహిరజ్జుః। జీవో నాహం దేశికోక్త్యాశ్శివోహం॥

3. శ్లో॥ ఆధాతదం విశ్వమాత్మాన్నసత్యం। సత్యం జ్ఞానానంద రూపో విమోహాత్। నిద్రామోహాస్స్వప్న వత్తస్య సత్యం శుద్ధఃపూర్ణో దేశికోక్త్యాశ్శివోహం॥

౪. శ్లో॥ జాతోనాహం సప్రవృద్ధోననష్టః। నాహందేహా ప్రాకృతస్సర్వధర్మాః। కర్తృత్వాద్యా శ్చిన్మయా శాస్మినాహం। కారో జీవాత్మనోమే శివోహం॥

౫. శ్లో॥ ముక్తోనాన్యత్కించిదత్రాస్తి విశ్వం। సత్యం చాహం వస్తు మాయోపక్లుప్తం। అస్యశ్చాంత్యంద్భాసమానం స్వతుల్యం। మయ్యంద్వైతే భాతి తస్మాచ్ఛివోహం॥

యీ పంచరత్నములు నిత్యం త్రికాలములయందు ధ్యానము చేసుకో తగినవి.

## సాకారభావము స్థూలదేవతలకు

'ప్రజ్ఞాన బ్రహ్మ'మను స్థూలశరీరమునందుండి సకల విజ్ఞానములు గలిగి ప్రవర్తింపుచు 'అహంబ్రహ్మాస్మి' యను చైతన్య స్వరూపుడైన ఆత్మారామ బ్రహ్మామను బ్రహ్మ పిపీలికాపర్యంతము సర్వశరీరులయందు నిలచియుండుటంబట్టి, మహాత్మా సర్వభూతాత్మాయను శ్రుతిని గురువులు ప్రథమమున బోధించిరి. ఇది సాకారభావమనుట సత్యము. తల్లి దండ్రుల శుక్లశోణితముల వలన జన్మించి, పోషింపబడి పిమ్మట తల్లి తండ్రిని, తండ్రి గురువును, గురువు పరమాత్మను చూపించును. తల్లి తండ్రులను గురువులను పూజించవలెగాని రాళ్ళను పూజించిన ముక్తిలేదు. మూడవ త్రేతాయుగమున తిండిపోతులై, కామాంధకారులై, నిరంతర సంగమాపేక్షులై సప్తధాతువులు నశించి కోటానకోట్లు జనులు నశించ మిగిలిన వారు కొంతమంది దేవతోపాసకులుగా నున్నవారు అష్టాంగ యోగసాధకులు గగనసంచారాది ప్రయత్నములతో వారి యిష్టదేవతా మండలములకుపోయి యాచించుచు స్తోత్రములు చేయుచు, బ్రహ్మ, విష్ణు, ఈశ్వర-లక్ష్మి, పార్వతి, సరస్వతి, దిక్పాలక, నవగ్రహ, గంధర్వ, గరుడ, సిద్ధసాధ్య, కిన్నరకింపురుషుల వలన తగినంత ఆయుర్వేదము దెచ్చి, నిర్జీవుల సజీవులంజేయు విధానములున్నూ దెచ్చి పీఠాధిపతులై శిష్యుల చేత వైద్య చికిత్సలం జేయుచు, సజీవులను బలవంతులను చేసి, పత్యనియామకములు, నిష్టనియమములు, పూజలు, వ్రతములు, విగ్రహారాధనలు, ౧౬ తిథులయందు, పర్వదినము

లందు శుచిగానుండి స్త్రీలనంటక పూజావ్రతములు చేయించుచు శ్రద్ధతో కాపాడగా నిల్చినవారి సంతతియే యీభూమిమీదనున్న జనులని తెలియవలెను. తదాదిగా విగ్రహారాధన లేర్పడినవి.

## స్థూలదేహం

కేవల అజ్ఞానమూఢులకు భక్తి మార్గోపదేశముల బోధింపుచు, ప్రత్యక్షముల జూపుచు, అభ్యాసపరచిన ప్రమాణములు గలవు. భక్తి మార్గమునకు గుడిగోపురములనవసరములు, మూఢులకొరకు నిర్ణయించబడినవి. శివకేశవుల మంత్రములను శ్రద్ధాభక్తులతో ఆసక్తిగలిగి, గురుముఖంబున గ్రహించి, అంతర్ముఖులై ప్రాణవాయువుతో మనస్సునుగల్పి, దృగ్భావమున ఆధారమున గణపతిని, స్వాధిష్టమున బ్రహ్మను, మణిపూరకమున విష్ణువును, అనాహతమున ఈశ్వరుని, విశుద్ధమున మహేశ్వరుని, ఆగ్నేయమున సదాశివుని, ధ్యానపూజాదికములు చేయుచు నిష్టతోనున్నవానికి సర్వాభీష్టపదవులు సిద్ధించునని భక్తవరుల దృష్టుల చేయుచుందురు. సద్గురువులగువారు చతురాక్షరి, పంచాక్షరి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి యిచ్చుచుందురు. వాటిని నియమవ్రతములుగా జరిపినవారికి, ఇష్టసిద్ధులు పదవులు గలుగుచుండును. వివేకజ్ఞానములున్నా గల్గును. యీ పదవులు శాశ్వత సుఖానందములు గానందున, ఆ దేవతా లోకమున కూలిపనికి యున్నట్లు, కొంతకాలము సుఖముగల్గును. మరల జన్మలెత్తవలసినదేగాని నిజమోక్షము దొరకదు.

మోక్షమునకు విదేహ కైవల్యమునకు భేదముగలదు. భక్తి-వైరాగ్యము జ్ఞానయోగములు సహేతుకములగుచుండును. దేవతలు, సాత్వికమానవులు సగుణ నిర్గుణముల వలన పదవు లందుట నిజము. నిర్హేతుక జాయమాన కటాక్షమనిచెప్పుట విరుద్ధము. నిర్హేతుకము స్థాపించినప్పుడు గురుశిష్యులు, పిన్న పెద్దలు, ఉత్తమ కనిష్ఠులు కృతకృత్యముల నెరుగకుండుటం బట్టి, మానవులు దుష్ప్రవర్తనవిడచి, సత్ప్రవర్తనులగుట దుస్తరము. నిర్హేతుక మనగా, తనకుతోచక త్రిలోకముల యందు తానుగానే పరిణమించి పరిపూర్ణభావమున నిండి యుండుటయని యర్థము.

## సూక్ష్మశరీర మనగా లింగదేహము

సూక్ష్మదేహమని దీనికి నిజార్థము. జ్ఞానేంద్రియము లను శ్రోత్ర-త్వక్-చక్షు-ర్జిహ్వా-ఘ్రాణములున్నూ, కర్మేం ద్రియములను వాక్-పాణి-పాద-పాయూ-పస్థలను, ప్రాణాది పంచకమను ప్రాణా-పాన-ఉదాన-వ్యాన సమానములను వాయువులును, మనో-బుద్ధులు అను కలిసి ౧౭ తత్వము లాయెను. ఇది సూక్ష్మ శరీరమనిపించుకొనుచు, లింగదేహ మనియు, హిరణ్యగర్భుడనియు, అభిమాని, తైజసుడు, సాత్వికము, ఇచ్ఛాశక్తి, కంఠస్థానము, ఇచ్ఛాభోగము, అంతర్యాత్మక, ఉపకారము, స్వప్నావస్థా. యీ స్వప్నావస్థ ప్రత్యక్షముగాక స్థూలదేహసంబంధ శూన్యమై నామరూప ప్రపంచములయందు తాను మనోరూపుడై వ్యాపించి, సర్వ

భోగములను జ్ఞప్తిమాత్రమున ననుభవింపుచున్నాడు. యజుర్వేదరూపంబగు అహంబ్రహ్మాస్మియని యనబడుచుండును.

## సచ్చిదానంద భావము

ఆత్మారాముడను హంసుడు, లింగశరీరధారియై, అంతర్బహిర్ వ్యాపకత్వము గలిగి, అగ్నిచేగాలక, నీటదడువక, జాగ్రత్స్వప్నాదులు లేక, తంతురూపమున షడాధారములను అనగా, ఆధార, స్వాధిష్ట, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆగ్నేయములం జుట్టుకొని దినమునకు ౨౧౬౦౦ తూర్లు, యీ హంసుడు సోహ మను ప్రణవజప మొడతెగక పలుకుచుండును, ఇది స్వాధీనపరచిన, జ్ఞానాగ్ని వలన పాపములనెడు కట్టెలను భస్మముగావించును. ఇట్టి సమాధి అభ్యాసపరచిన, ఇదియే సచ్చిదానందము అనియు, సచ్చిదానందమయ చైతన్యమనియు చెప్పబడును.

## నాదానంద ప్రభావము

శుచివంతుడై గోముఖాసనమున కర్ణరంధ్రములు మూసి ఆలకింపుచు యీ దశవిధనాదములను విమర్శించుకొనుచు, యీ నాదబ్రహ్మమును బైటకు దీయజాలక, స్వల్పచిత్కళలను చూచి సంతసింపుచు యీ విషయము పూర్ణముగా దెలిసికొన జాలరు. రేచక పూరకాభ్యాసములు లేనందున తెలియచాలరు. రేచక పూరకాభ్యాసములచేత, శబ్దబ్రహ్మము విజృంభించి, ఉగ్రసర్పాకారమువలె లేచి కర్ణరంధ్రముల బైటబడును. యీ నాద బ్రహ్మమందు మనసు

లయము చేసిన బ్రహ్మానందము గల్గును. భ్రూమధ్యమున దృష్టి నిల్పి సద్గురు ధ్యానము చేయవలయును. నిందు వైరాగ్యమున నిలిచిన మనోలయమునకు సులభమార్గ మిచ్చును. బ్రహ్మానందము కలిగి, ముక్తికి సులభమార్గము గలుగును.

## పంచముద్రాలక్షణములు – ఖేచరి ముద్ర

లోకచిత్రభ్రమల మరగి నేత్రము దృక్కునిల్పియూర్ధ్వ దృష్టిచే నభ్యాసము చేయుచు మనస్సును గురిబెట్టి నిల్పిన ఖేచరీముద్ర యనబడు, తొలుత కష్టము తదుపరి యతి సులభముగా నుండును. యోగారూఢునకు మిక్కిలి సాహాయముగా నుండును.

## భూచరి ముద్ర

నేత్రముల గదలించక భ్రూమధ్యస్థానమందు దృక్కు నిల్పి, జీవబ్రహ్మసంచారగు హంసను గనిపెట్టుట–ఇది మనోల్లాసము నిచ్చును. నిల్కడగల్గును. ఇది అధోభాగ దృష్టి యగుటచే తన్మయము గల్గును, నిల్కడలేనివానికి అధిక నిద్రవచ్చును.

## మధ్యమ ముద్ర

భ్రూమధ్యస్థానమందు దృక్కునిల్పి బహిర్దృష్టి వదలి అంతర్ముఖదృష్టిచే చూడగా, భూమ్యాకాశ నక్షత్ర సూర్య చంద్రులం జూచుచు, మనోల్లాసంబున నుండును. బహిర్గత లోకచంచలములు మాని స్థిరమనోల్లాసంబున నుండును.

## షణ్ముఖీముద్ర

నేత్రములు ౨ శ్రోత్రములు ౨ నాసికము ౨ యీ యారు రంధ్రములు బంధించి, భ్రూమధ్యదృష్టి నిల్పి నాద బిందు కళలం జూచుచు, పంచాకాశ జ్యోతి స్వరూపంబులంజూచుచు, ఆనందించుచుండుట.

## శాంభవీముద్ర

నేత్రముల వికసించి బహిర్దృష్టుల ప్రారంభమున నభ్యసించి తదుపరి, భ్రూమధ్యమున అంతరదృష్టితో నిల్పిన, అభ్యాసము కొలదిచేసి మధ్య లక్ష్యమున స్థిరముగా నిల్పవలెను. అంతట సమగ్రముగ యోగమయుండగును. బ్రహ్మాండము సర్వము దృగ్గోచరంబగును. త్రినేత్రము వికసించును.

## జ్ఞానదర్పణ యోగసాధనము

ప్రణవ పంచాక్షరీ మంత్రముచేత మననమువలన పాపములు భస్మముగావించి, జీవబ్రహ్మము అవాఙ్మానస గోచరుండని తెలిసి వేద ప్రమాణముల ద్వారా విచారించగా అచల పరబ్రహ్మము. వాక్కుకు-మనస్సుకు గోచరించనివాడని తెలియుచున్నందున, ఇది సత్యప్రమాణము, నిత్యుడగు నిరాకార బ్రహ్మమును, అనిత్యములగు ఇంద్రియములు చూడలేవు. ఆకాశముతో ఆకాశమును, వాయువుతో వాయువును, అగ్నితో అగ్నిని, జలముతో జలమును, పృథివితో పృథివిని, లోహముతో లోహమును గూర్చి మథించినట్లు శోధించవలెను. "ఆపోజ్యోతి రసోమృతంబ్రహ్మ"

అను సూత్రాధారమున ఆపోజ్యోతులతో నాదబ్రహ్మమును పొందవచ్చును. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ అంతఃకరణాదుల కగోచరుండగు, ఉదకజ్యోతి స్వరూపము జ్వలింపుచుండు. ఇది యుదక ప్రతిబింబితము, దీనిని ఆపోజ్యోతియనియు, అద్దమున ప్రతిబింబాకృతి చూడుమని గురువరుండు అద్దము చేతికిచ్చి, నేత్రములం దెరచి, చూడుమనగా మరియు, స్థూలమగు కనుగ్రుడ్డును, సూక్ష్మమగుపాపను, నడుమనున్న కారణ శరీరమును, ఆ బింబమందుగల తేజస్సును చూడుమనగా, శిష్యుడు గురునకు నమస్కరించి, చూచుట ప్రారంభించగా అందుగల తేజస్సును కళయనియు, యెరుకయనియు, నాపో జ్యోతియనియు, మహాలింగమనియు, లింగశరీరమనియు చెప్పబడును. ఆ బింబము దప్ప పరబ్రహ్మమును వేరొండు చూడనొల్లవు. అచట వటపత్రశయనుడు, కారణ స్వరూపుడు నైన నారాయణమూర్తియు, గంగ యమునా సరస్వతులు, ముక్తికాంతామణియు నుండు. గురుముఖంబున నిన్నియు గ్రహించిన పుణ్యాత్మునకు మోక్షము కరతలామలకముగ నుండు. అట్టి పుణ్యాత్ములు, సూర్యచంద్రులుండు పర్యంతము మరణములేక యుందురు. గంగాయమునా సరస్వతులుగూడిన చోటు, నల్లకలువలను నేత్రములందు, తెల్లతామరలో తేజస్సువలె నుండు అట్టి తేజస్సును కళయనియు, ఆపోజ్యోతి యనియు, యెరుకయనియు చెప్పుదురు. యీ చలించు ఇంద్రియములు, అచల బ్రహ్మమును చూడలేవు గనుక, ఆపోజ్యోతుల వలన దివారాత్రములు, అచలబ్రహ్మమును

చూడవచ్చును. నీ వెవ్వరు, బ్రహ్మమెవ్వరు, మీ యిరువు రకు భేదమేమి. నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేనని, నేనొక్క డనే చతుర్దశ భువనములలో భేదరహితముగా నున్నాను. భ్రాంతివలన గుణభేదములచేత భేదము గలుగుచున్నది.

— : : —

## కారణ శరీర వివరణము

యీ జీవుడు మనోబుద్ధులతో చేరి, కారణశరీరియై. హృదయస్థానంబున చేరి, ప్రాజ్ఞుడను నామమున జ్ఞానశక్తి యుక్తుడై, మకారమాత్రికతో చేరి, తమోగుణ సుషుప్తి యవస్థను పొందును. సామవేద స్వరూపతత్వ మసి యను, ఐక్య పదవిగల అధికారతత్వమై యుండును. ఇదే కారణ శరీరమూ యీ సుషుప్త్యవస్థ యెటువంటిదనగా.

దారిలోనుండు బావిపై గడ్డిచెట్లు మొదలైనవి అల్లు కొని యుండు సమయమున మేఘావరణమై చీకటిలో బావి కానరాక, అందుబడి నీట మునిగిన సమయమున బైటనుండు వారికి తన స్థితి, యెట్లు తెలియపర్చ శక్యముకాదో, అట్లె యీ సుషుప్తియందు, తామసమాయ ఆవరించుటచేత, జీవుడు విలీనమై, తానను భవించు అవస్త తెలియ చెప్పుటకు వీలుగాని, అంతఃకోశములు, యేలియనగా, అన్నమయ కోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, ఆనంద మయకోశము, విజ్ఞానమయకోశము అహంకార సమష్టితో

గూడిన అన్నమయ కోశమున్నూ, మనోమయవాయువుతో గూడిన ప్రాణమయకోశమున్నూ, చిత్తము జ్ఞాతతో గూడిన ఆనందమయ కోశమున్నూ, మనస్సు కర్మేంద్రియములతో గూడిన, మనోమయకోశమున్నూ, బుద్ధి జ్ఞానేంద్రియములతో గూడిన విజ్ఞానమయకోశమున్నూ, ఇవి వీటిని యొకటిని యొకటి నెరుగవు. వీటితో జీవుడుచేరి, శబ్దము మొదలగు నామరూపాత్మక విషయములను, శ్రోత్రాది జ్ఞానేంద్రియము లెరుగును. జ్ఞానేంద్రియములను, అంతఃకరణ మెరుగును. అంతఃకరణమును జీవుడెరుగును, జీవుని జీవసాక్షియగు ఈశ్వరుడెరుగును.

వీటిని యెరిగినయెరుకయే జీవుడు, ఘటపటాదు లెరిగిన ఇంద్రియములు, ఘటములుగావు. ఇంద్రియముల ద్వారా యెరిగిన అంతఃకరణము, ఇంద్రియములుగావు. అంతఃకరణ మును యెరిగిన జీవుడు అంతఃకరణములుగావు. జీవుని యెరిగిన జీవసాక్షి, జీవుడుకాడు, గనుక యొకటిని యొకటి యెరుగవు, వీటికన్నిటికి మేలైన జీవచైతన్యమే సాక్షిగానుండు. వీటిని తెలిసే తెలివిలేని, ఇంద్రియములకు జడత్వముగలదు. సర్వ వ్యవహారములకున్నూ, చైతన్యము అధికారియై, చేయించు చుండును. తదాకారముగాక అనగా ఇంద్రియములతో జీవుడు చేరక, జ్ఞానేంద్రియములు లేక, విషయములుదోచవు, జీవుడులేక, అంతఃకరణము దోచదు. జీవసాక్షి యను ఈశ్వ రుడు లేక, జీవునకు నిలకడదోచదు. నామరూప ప్రపంచ ములు, ఇంద్రియములకు విషయములు, ఇంద్రియములు,

అంతఃకరణమునకు విషయములు, కరణములు జీవునకు విషయములు, జీవుడు జీవసాక్షికి విషయము, జీవసాక్షి వివేకజ్ఞానమునకు విషయము, వివేకజ్ఞానము బ్రహ్మచైతన్యమునకు విషయము, పరిపూర్ణచైతన్యము ఏ యొకటికిన్ని విషయము గాదు. గనుక యీ తెలివిచేత దానిం దెలియవలెను.

## భ్రాంతివలన గలుగు, తాపత్రయ నివృత్తి వివరణము

రాగద్వేషములుపోతే కర్మలు పోవును, కర్మలుపోతే శరీరముపోవును, శరీరభ్రాంతిపోతే దుఃఖములు పోవును. రాగద్వేషములుపోతే అభిమానము పోవును, అభిమానముపోతే, అవివేకముపోవును, అవివేకముపోతే అజ్ఞానముపోవును, అజ్ఞానముపోతె జ్ఞానోదయమగును. ఆత్మజ్ఞానోదయములు గలుగగా భక్తి వైరాగ్యములు గలుగును. భక్తివైరాగ్యముల వల్లను సాధన చతుష్టయాభ్యాసము వల్లను, సత్ప్రవర్తకులగు సాత్వీక సహావాసము గలుగగా, సంశయరహితమగుచుండును. సద్గురువుల సత్కాలక్షేప ప్రసంగాదులవలన నిధిధ్యాస ఏర్పడును. నిధిధ్యాసలవలన ఆత్మానాత్మ విచారణగల్గును, ఆత్మానాత్మ విచారణవలన శుద్ధమగు ఆత్మజ్ఞానముగల్గును, యితరమగు యేపద్ధతివల్లను ఆత్మజ్ఞానము గలుగదు. జ్ఞానము లేక చంచలములగు, లోకభ్రమలలో దగులుకొని వదలలేక అజ్ఞాన మత్తులై యుండువారికి మోక్షములభించుట దుర్లభము. జన్మకడతేరుట దుస్తరము. జ్ఞానము పట్టుదలతో అభ్యసించక లభించుట దుస్తరము. ధనము, పుణ్యము,

జ్ఞానము, కర్మలు క్రమాభ్యాసముగా పట్టుదలతో చేయు చుండవలెను.

## మహాకారణ శరీరవివరణము

యీ జీవుడే విజ్ఞానమయ కోశమున బుద్ధీంద్రియము లతో చేరి, మహాకారణ శరీరియై, ప్రత్యగాత్మ యను నామము వహించి, అథర్వణవేద స్వరూప, 'అయమాత్మా'యను మహాతత్వమును పొంది, బ్రహ్మానందమున నోలలాడు చుండును. ఓంకార మాత్రకతో చేరి, తుర్యావస్థనుబొంది, సహస్రారమందు స్థిరుడై, నేను బ్రహ్మమని పిలువబడి, చక్రము ౧ కి ౨ లోకములు, 3 దళములు, ౪ దేవతలు, ౫ నాదములు, ౬ వర్ణములు, ౭ హంసలు, ౮ శక్తులు, ౯ బీజములు కలిగియుండు. మనస్సు ప్రాణవాయువుతో కూడుకొని, సర్వేంద్రియముల నెరుగుచున్నటువంటి, జ్ఞాతను సహస్రారమందు మగ్నపరచి, యోగసమాధిలోనుండి మగ్న పరచిన విద్యావిద్యలు నశించును. పై సాక్షాత్కారమును దర్శిస్తున్నపుడు, బ్రహ్మానందం గల్గును. ఆ బ్రహ్మానందమే ఆత్మసాక్షాత్కారము. ఇదే సవికల్పసమాధి ఇట్టి మహత్తర పదవి కానని మూఢులు, విష్ణుమాయా కల్పితాభిమానంబున ఆగ్రహము గలిగి, శాంతములేక, మనస్సున బట్టక, ఈశ్వర ధ్యానమంత్రములు, అవ్యక్తమత్తతచేత నేమియుందోచక, మహాంధకారమైయుండు. యీ మాయయే ఉత్పత్తి-స్థితి నాశనములకు కారణమై, దీనితో జగత్తంతయు కట్టబడి

యుండును. ఇదియే సర్వలోక మానవశరీరుల ధర్మకర్మ మూలంబు మరుపుట్టువునకు కారణంబు.

## సాంఖ్యసూత్ర వివరము

(బ్రహ్మశ్రీ) పోలూరి నరసింహ సద్గురు స్వాముల వారిచే రచించబడిన సాంఖ్యసూత్ర వివరము సులభమార్గము.

నిరామయ నిరంజన–నిర్గుణ పరబ్రహ్మమునందు, అకారణముగా మాయజనించి, యీ మాయవలన పంచాకారముల కూడికచేత, శక్తియంశగల అధోకుండలినియు తదుపరి, ఈశ్వర సంబంధ ఊర్ధ్వ ప్రణవకుండలిని యగు ఓంకారమును, యీ ఓంకారము వలన పంచాక్షరియు, పంచాక్షరివలన పంచ బ్రహ్మలున్నూ, పంచబ్రహ్మల వలన పంచతన్మాత్రము లున్నూ ఈ పంచతన్మాత్రల వలన పంచభూతములున్నూ, పంచభూతములలో భూమియందు 20 లక్షల ఓషధు లున్నూ, ఓషధుల వలన షడ్రసపదార్థాది అన్నములున్నూ, అన్నమువలన సప్తధాతువులు వృద్ధి బొందుటయు, ధాతు బలమున వీర్యోద్రేకమున్నూ, వీర్యోద్రేకమున కామాంధకారియై స్త్రీ సంగమము వలన గర్భమున బిందు పతనమై జన్మోత్పత్తి గలుగుటయు, ఇట్లు లోకములాయెను. మాయయే జీవుని జన్మకు కారణము.

ఒక మానవుని నేత్రేంద్రియము ద్వారా, చూచుటచేత జగద్విషయములు తెలియుచుండును. యీ ప్రపంచమందు, ఘటపటాదులయందు, ఆకాశ ప్రతిబింబమట్లు సర్వశరీరముల

యందు, నిర్గుణ బ్రహ్మము ప్రతిభాసికుడై జీవేశ్వరనామమును పొంది, యెట్లనగా, కులాలకుడుచేయు మృద్ఘటములలో జలమందు సూర్యునివలె ౨౪ తత్వముల స్ఫూర్తియగు శరీరములయందు, అద్దమున ప్రతిబింబమువలె అంతఃకరణాదిస్థానమైన జ్ఞాత నిర్మలాంతఃకరణమున కల్పితనామముచేత, ప్రకాశించు సచ్చిదానంద స్వరూపుడగు ప్రత్యగాత్మ, అంతఃకరణ కూడికవలన, సర్వేంద్రియ లోలుడై అరిషడ్వర్గములకు లోబడి, జీవనామమున, జాగ్రత్స్వప్న సుషుప్తులయందు, విశ్వ, తైజస, ప్రాజ్ఞులను నామములతో నేను నేను, అను దేహాభిమానమున, కర్తృత్వముచే వర్తింపుచుండు. ఇట్లు కులగోత్ర నామరూప భేదములచేత నంగీకరించి, రాజసన్యాయమున నేను చేయుచున్నాను, నేను చూచుచున్నాను, నేను వినుచున్నాను అను యెరుక స్వరూపుడై ప్రవర్తింపుచుండు.

## యెరుక స్థాననిర్ణయము

యెట్లనగా, నేత్రముల పంచరంగులు, మధ్య భాగమున స్ఫటిక వర్ణరూపములచేత ప్రకాశించుచున్న దానినే యెరుకయనియు, ఆర్యులు నిర్ణయించిరి. యీ రెండు నొకటిగాచేరిన త్రినేత్రమే జ్ఞాననేత్రమని తెలియవలెను. ఇది తెలిసిన మోక్షమార్గము, యీ కర్మచక్షువులు కావు. గుడ్డివాడు లోకము చూడక పోయిననూ, ఆ నేత్రములో నొక తేజస్సున్నది. ఆతేజస్సు వలన బట్టబయలను పరబ్రహ్మను చూచుటకు మార్గము, ఇంతకు మించిన మార్గములేదు. యీ

మార్గము ఇడాపింగళలు కూడిన త్రికూటస్థానమున నేత్ర మార్గములు రెండు, శ్రోత్రమార్గములు రెండు, కూడి యున్నందున చతుష్పదమనియు.

దశనాళముల వివరము

ఇడ, పింగళ, సుషుమ్న, గాంధారి, హస్తిని, శంఖినీ పద్మినీ. అలంబస, పూష, సినీవాలి ఇవి షడ్విధవర్ణములుగా తెలుపు, నలుపు, యెరుపు, పీతవర్ణము, సునీలము మిశ్రవర్ణ ములు కూడి నందున దీనిని శృంగాటకమని చెప్పిరి.

గంగ–యమున–సరస్వతులు మేళనత్వము వలన త్రివేణీ సంగమమనియు, సూక్ష్మదృష్టియనిన్నీ, ఆపోజ్యోతియనిన్నీ, అదే ప్రణవమనిన్నీ, ఆత్మారామ తత్వమనిన్నీ, మహాతత్వ మనిన్నీ, శుద్ధచైతన్యమనిన్నీ, సచ్చిదానందమనిన్నీ విద్యుల్లేఖ యనియు, అక్షరమనిన్నీ, గురుతత్వమనిన్నీ చెప్పుదురు. ఇది జీవేశ్వరైక్యస్థానము అని యెరుగవలెను. మరియు అంగిటి యందు అధోభాగముగా వాలి బొడ్డువలెనుండు, చిరునాలు కకు పైగా సహస్రారమునంటి యుండును. బ్రహ్మరంధ్రము నకు నీవారశూకమనియు, దీనిని అగ్రభాగమున అను స్వరూపమై ప్రకాశించు ప్రత్యగాత్మయై సర్వమునకు విలక్షణ మైన తాతని తెలియవలెను. నల్లని మేఘముల మధ్య మెరుపు తీగవలె ప్రకాశించుచున్నది. వరి ముల్లువలె శరీరముగలది, పచ్చని వర్ణముగలది, ప్రకాశముగలదిగా నున్నది, అణు స్వరూపముగా నున్నది, పరబ్రహ్మము ఇట్లున్నాడు. ఈ

శాస్త్రమార్గమున చెప్పినట్లు, ప్రత్యక్షముగానున్న ప్రత్యగాత్మయేతాను, ప్రత్యగాత్మయైన తనకును, పరమాత్మయగు బ్రహ్మమునకున్నూ ఐక్యమెట్లనగా, కేవలము ప్రత్యగాత్మయైన బ్రహ్మమును, గుర్తెరిగినను, మనసు గుర్తెరిగెనని చెప్పజాలదు. మనసు జడముగనుక, దీనిని గుర్తెరుగుటకు స్వాతంత్ర్యములేదు. యేది గుర్తెరిగి జీవేశ్వరైక్యమును పొందెననిన, ఆ ప్రత్యగాత్మయే జడరూపమైన మనసును కలిసిన బ్రహ్మమును గుర్తెరిగి లయించినది.

## ఇందుకు దృష్టాంతము

క॥ వెలిబయలుగలదు దెదో। కలిసిన మరి మూలనాభి కర్ణికయేదో। జలసూత్ర బిలమ దేదో। మలసిన లయ జనన మేదో మరువక చెప్పుమా॥

క॥ ఇది ఇదియునాత్మయేగా। ఇది బ్రహ్మము నేనటంచు నెరుగునె జడమై। కదలక నీమదివెటులా। యది తెలియునతండె స్వప్రభాకారుడిలన్॥

గీ॥ మూలనాభిలోనవాల కర్ణికశిఖ। జాలరంధ్రగోళ ఫాలమందు కాలశూలియెవడు। కాలాంత మెవ్వడు। చాల బయలుమించి సరస చెప్పుమ॥

గీ॥ కాలసూత్రము క్రిందను కాలుడెవడు। తంతు పటలంబు ద్వాదశ తత్వమేది। రెంటిరేకంబు నడుమను పంట యేది। జంట జెప్పిన యమనస్కజాణుడతడు॥

క॥ కాలాంత కాలమందున। బాలాంత భ్రమరియందు బాలికపరమై। లీలావినోద మెట్టిదో। చాలా వివరించి చెపుమ సజ్జన తిలకా॥

క॥ అమనస్కంబన నెట్టిదో। మరాంతర దీవియందు భావంబేదో। కమలంబు విడచినప్పుడు। విమలంబ మనస్కమేదో విసువక చెపుమా॥

---

తారక భావము

చైతన్య స్వరూపమగు యీ యాత్మారామ బ్రహ్మము సర్వశరీరముల యందును, వాయు విధంబున బ్రవేశించి, ఆత్మ్మడనబరగి అంతర్బహిర్ వ్యాపకత్వమున లింగ శరీర భంగము గలుగకుండ ఆధార, స్వాధిష్ట, మణిపూరక విశుద్ధ-ఆగ్నేయముల దివారాత్రముల నారోహణావరోహణంబులు చేయుచు సూర్య-చంద్ర-సుషుమ్నలయందు, దినమునకు ౨౧౬౦౦ హంసలవరుసను సంచరింపుచుండు దీనినే అజపా గాయత్రియనియు, జీవేశ్వరైక్యమనియు, ప్రణవమనియు, మానసమాధియనియు, తారకమంత్రమనియు, ఓం-హంసః యనియు, రేచక పూరకాదులతో చేర్చి, జపించుచు, హంసుని వెంటనంటి తిరుగుచు, సర్వకాల సర్వావస్థలయందు యేమారక పెదవులను బంధించి, జిహ్వాజ్ఞానేంద్రియ మారుతములనందు గూర్చి, జపించుట నిజమైన తారకము. హంసాక్షర ద్వయ జపము చేయనేరక, మాటలు వినినంతమాత్రముననే, మాకు

దెలుసునని సంతసింతురు. ముద్రలు-దృష్టి నిలుపుట సాధనము గాని చిత్కళలు తారకముగాదు. సర్వమైన నారదాది మునీంద్రులు, బ్రహ్మఋషులు, బ్రహ్మదేవునిచేత తెలుసుకొని, త్రిలోకపూజ్యులై మహాత్ములైరి.

## అమనస్క భావము

ఆనందో బ్రహ్మమను శ్రుతిననుసరించి. కశ్యప, భరద్వాజ, కణ్వ, గౌతమ, వశిష్ట, గార్గేయ, విశ్వామిత్ర, నారద, శుక మొదలగు బ్రహ్మఋషులును, నేనును, అనేక మానవులు సచ్చిదానంద రూపుడగు పరబ్రహ్మను ఉద్దేశించి, సద్రూపచిద్రూపముల నొకటిగ జేసి, ఆనంద స్వరూపులై యున్నారు. అందువలన మేము బ్రాహ్మణులమైతిమి, దేవమానవులలో బ్రహ్మత్వములేక, మోక్షము నొందచాలరు. విధి నిషేధనియమ నిష్టలతో స్నానసంధ్యానుష్టాన జపతపహోమములు, మోక్షమార్గములుగావు. ఇవి కర్మకాండలోనివి, కర్మకాండకు లోబడినవారు అగడ్తలోబడిన మార్జాలమువలె పోలేక, రాలేక, విమోచనము పొందనేరరు. దారిగానక తపింతురు. జ్ఞానకాండలో తగిలిన దేవమానవులలో నెవ్వరైనను, సన్యసించి తపోవృత్తినుండినను, లేక గృహస్థాశ్రమములో నుండినను, భేదరహితము గలిగిన బ్రహ్మత్వమును మోక్షము బొందుదురు.

వేదములలో నధర్వణవేదము, ఉపనిషత్తులలో నిర్గుణ బ్రహ్మోపనిషత్తు, శాస్త్రములలో వేదాంతశాస్త్రము, గుణ

ములలో సత్వగుణము, యోగములలో రాజయోగము, మంత్రములలో ప్రణవమంత్రము, మార్గములలో కుండలినీ మార్గము, మానవులలో వేదాంత ప్రవర్తకుడున్నూ, శ్రేష్టము, మనస్సు లయించుటయే యమసన్యము ఇదియే యోగమని చెప్పబడును.

అష్టాక్షరీమంత్రమును గ్రహించి, షడాధారాధి దేవతలైన గణపతి, బ్రహ్మ, విష్ణువు, శివుడు, జీవుడు ఆత్మలకు నమస్కరించి, నాదబ్రహ్మమునందు రాంబీజమున గురినిల్పి దృష్టి చెదరనీయక, నధోకుండలియందున్న హంసను రేచక పూరకములచేత, నజపకుండలికి సమముగా లేవదీసి, కుంభించుచూ, అష్టాంగుళములు పూరించుచు, ద్వాదశాంగుళములు రేచించి అజపకుండలిని భేదించి, నాదబ్రహ్మమును లేపి, సూర్యనాడిని చంద్రుని, చంద్రనాడిని సూర్యుని నడపించుచుయూ చంద్ర భాస్కరులను చీకాకుపరచి, హంసను సూత్మ్మమగు విద్యుల్లేఖయను సుషుమ్నానాడిని యెక్కించి, గోముఖాసనమున యోగదండమును పూనిక చేసుకొని కూర్చుండి, నడుము సమముగ నిక్కించి, ముఖమువంచి, జంటనాగస్వరముల నూదుచు, మధ్యవీధి నలంకరించి, యొక చేతి వ్రేలున దంతముల మధ్యనుండు జిహ్వేంద్రియములను, చిత్తమను రసనేంద్రియమును చేరనీయక, మాటుపరచి మరియొక వ్రేలున హంససంచార త్రోవ నడ్డగించి, వేరొక త్రోవను నడపించుచు, పెదవులను బంధించి, రెండవచేతి వ్రేలున కాటుకపిట్టలను నీలంపుజ్యోతులను గదియంబట్టి,

ఏకతిత్తిన బలీయముగనూదుచు, హంస సూర్యకుండలిదాటించి త్రివేణీసంగమమున బొందుపరచి మనోమారుత సంధానము గావించుచు, యీరెంటిని లక్ష్యమందుంచి, చూచిన నచట చిత్రములైన తళుకులున్నూ, చంద్రసూర్య ప్రకాశములను, నాదబ్రహ్మానందమును, దహరాకాశ చిదాకాశములను, ఇన శశికాంతుల నొకటిగ జేసి వెలివెల్గులోను, లోవెల్గులోను కలిపి పండువెన్నెలలో గలిసి మనంబచట లయించి యేమియు దోచక యుండునదియే యమనస్కము అను భావము. దీనిచే నిండు వైరాగ్యంబున కుండలిని సాధించవలయును.

## నిరాకార భావము

హంస పంచాక్షరిని బోధించి, అయమాత్మా బ్రహ్మ మను శ్రుతి ననుసరించి, రూపనామ క్రియాదులులేని ఆత్మా రామబ్రహ్మమును సాకారశరీరమునందు వాయు విధమున ప్రవేశించి, బహిర్వ్యాపకత్వము గలిగి జాగ్రత్స్వప్నసుషుప్తులు లేయుంబవళ్లు, క్షుత్పిపాసలచేతను, అస్తితే, జాయతే, వర్ధతే పరిణతే, అపక్షీయ్యదే, వినశ్యతే యను షడ్భావవికారములు లేక కళాస్వరూపుడై సూత్రధారి యనబడి పంచకోశములగు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయములను పంచకోశములకు వ్యతిరిక్తుడై, తంతువులవలె షట్చక్రముల జుట్టుకొని రేచక, పూరక, కుంభకములచేత ఇడాపింగళ సుషుమ్నలను, సంచరింపుచుండు. దాని యవ రోహణారోహములను, ప్రణవాక్షరద్వయమని పెద్దలు ధ్యానింతురు. హంసుడు నిరాకారుడనియు, అతని మహిమ

కనజాలమనియు, త్రిమూర్తులు వచించిరి. నామ రూపంబులు లేకుండుటవలన, నిరాకారుండని చెప్పవలసి వచ్చెను. దీనికి మహావాక్య ప్రమాణములని చెప్పిరి.

---

## అచల పరిపూర్ణ భావము

శ్లో॥ భ్రమేణాహం భ్రమేణత్వం। భ్రమేణోపాసకాజనాః।
భ్రమేణేశ్వర భావత్వం। భ్రమమూలమిదం జగత్॥

ప్రకృతిద్వయ నామరూపములుగల త్రిలోకవాసుల కన్నా కాంచనమందును, కాంతలయందును, కుమారుల యందును వాంఛగల్గియుందురు. వాంఛకు మూలము భ్రమ, భ్రమకు మూలము చిత్తము, చిత్తమునకు మూలము కామము, కాముకత్వము వలన సకల జీవజన్మోత్పత్తియు యాయెను. ఆ చిత్తు సత్తుల సంధానమే యానందము. ఇదియే సచ్చిదానందము, ఇదే నాదు బిందుకళలు, ఇదియే తత్పదము, త్వంపదము, అసిపదము, ఇదియే కార్యకారణ ములు, ఇదియే ప్రపంచము, ఇదియే మిథ్యాస్వరూపము, సర్వము భ్రాంతియే, భ్రాంతికి మూలము లేదు. సచ్చిదానందమే రహితము.

శ్లో॥ జన్మాభావే కర్మంవాస్తి। కర్మాభావే ఫలంనహి।
ఫలాభావే భయంకుత్ర భయాభావేన సంశయః।

నామరూపములు గలిగినది సర్వము భ్రాంతియే. యెరుక యనెడు మాయకు మూలములేదు. ప్రకృతి ద్వయమైన శరీరాత్మలే యెరుక. యెరుకకు నిల్కడిలేదు. ఇంద్రజాలము వలె నటింపుచుండు, యీ ప్రపంచము కలవంటిది. కుందేటికి కొమ్ములులేనట్లు యెరుకలేక పోవుచున్నది, యెరుకే మటు మాయము అచల పరిపూర్ణము యేకాలమందును లేకపోలేదు. పెక్కండ్రు మాయను దెలియక ఎరుకను బ్రహ్మమని భావించిరి.

ఈర్ష్యా మాయలు గలవాడై తమతమ సుఖమునను, పుణ్యపాపములను, బంధమోక్షములను గలవనియు, భక్తి వైరాగ్య జ్ఞానములు యోగములు, పదవులకు మార్గము లనియు, సచ్చిదానందమే సత్యమనియు, వృధామతములచేత నిజస్వరూపము తెలియనేరక, మదపుటేనుగు తనపై తాను మన్నుబోసుకొనునట్లు, విధినిషేధ నియమనిష్టలు, ఉపవాస స్నాన జపహోమాదిక్రియలు, గావింతురని చెప్పెను.

శ్లో॥ ఇంద్రజాల మిదం సత్యం। యధామరుమరీచికాః। అఖండితమనాకారం। వర్తతే కేవలం శివం॥

ఇటుల జెప్పుటచేత యెండమావులయందు నీళ్లులేనట్లు అచల పరిపూర్ణబ్రహ్మమందు ప్రపంచములేదు. నామరూప ములుగల చేతనములన్నియు మాయయనియు, నీవు నేను ప్రపంచము, నేను నీవు రహితము, ప్రపంచము రహితము పరిపూర్ణముకంటె నేమిలేదు. సర్వము భ్రాంతిరూపమని

తెలియక పెక్కండ్రు యమ, నియమ ప్రాణాయామములు మంత్ర, లయ, హఠ, రాజయోగములు, ముద్రలు, ప్రణవాది మహామంత్రములు అభ్యసించి మిగుల ప్రయాసపడుచుందురు. సాధక విద్యలు ప్రయోజనములు లేనివి, సచ్చిదానందము నిలువదు. నిర్మల దేహమునకు మలము బూసుకొని, దుర్గంధ జలముచే కడిగినట్లు, తాను నిర్మలమైన యచలమును జూచు చుండియు. భ్రాంతివలన వివిధ కర్మలు, నాశ్రయించుటచేత జనన మరణ ప్రవాహముల విడువ చాలకుందురు.

సూత్రం॥ క్షేత్ర క్షేత్రజ్ఞయోరణ్యం। నామరూప వివర్జితం। సదాత్రిపుటీరహితం। సర్వద్వంద్వ వివర్జితం॥

ఇట్లు చెప్పుటచేత అచల పరిపూర్ణము జ్ఞానముకాదు, అజ్ఞానముకాదు, సత్యముకాదు, అసత్యముకాదు, ధర్మము కాదు, అధర్మముకాదు, ఆత్మానాత్మలుకాదు, జీవేశ్వరులు కాదు, దేహీదేహములుకాదు, క్షరాక్షరములుకాదు, సచ్చిదానందమున్నూకాదు. ప్రకృతి ద్వయములులేని పరిపూర్ణము గనుక పలుకదు, భాషింపదు, వినదు, తినదు, చలించదు, సర్వకాల సర్వావస్థలయందును, నొకటే విధముగనున్నది. నామరూపములులేనిది, పరిపూర్ణమును దరిసించనేరనివారు. అచల పరిపూర్ణమునందు మాయయను యెరుక పుట్టినదని చెప్పిరి. అఖండ పరిపూర్ణము యేకాలమందును, ఖండ ఖండ ములుగా నుండలేదు. అండపిండ బ్రహ్మాండములను, ఖండ ములయం దానందించెడు జ్ఞానులున్నూ, యోగులున్నూ అచల పరిపూర్ణ బ్రహ్మము నెరుగక, భ్రాంతిరూపమగు యెరు

కను, బ్రహ్మమని యెంచి, తమ భ్రాంతి విడువక జనన మరణములం బొందుదురు.

సూత్రం॥ ఆత్మాతీతం కేవలాత్మా। దేహానాస్తిక దాచన అస్తినాస్తీతికో వేదాః। నిర్ణయో నాస్తి సర్వదాః। ఛిందంతి వేదశాస్త్రాణి ఛిందంతి భువనత్రయం। శరీరం సర్వదా నాస్తి। శరీరరహితం సదా॥

మూలములేని గురుతెరిగే శరీరం యేమిలేదు. త్రినేత్రమును గ్రహించవలెను. పరిపూర్ణముకంటె నేమీలేదు, యీ యుత్త బట్టబయులేమిలేదు.

శ్లో॥ ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే॥

ఇది జనన మరణ ప్రవాహరహితము. అచల పరిపూర్ణ బ్రహ్మమును దర్శించిన మహాత్ములకు, విదేహకైవల్యము, పరమ పదము గల్గును. ఇందుకు సందియములేదు. నీవు ఈశ్వర రూపదర్శనముచేసి యీ విశ్వరూపమైన శరీరాత్మలుగల యెరుకను సమూలముగ విడువుము, ఇది సత్యము, సత్యము, సత్యము.

---

## అధ్యాత్మ విద్యాపరులకు హెచ్చరిక

భ్రమే॥ భ్రమర ఝూంకార కీటకగుహాదష్టకం। స్వస్వన జాయంతి పునరావృత్తి కారణం ఇట్లు నిర్వికారుండైన పురుషుండు, కేవల జడాత్మికమైన ప్రకృతిం బ్రత్యేకంబుగా, కర్తృత్వ భోక్తృత్వ సంసారంబిపుడు ఘటియింపదు గావున,

అకార స్వరూపుండైన ఆత్మారాముండు, అన్యోన్యతత్వ తత్వధ్యాన రూపంబునంగూడి, వివిధేంద్రియ ప్రాణమనో యుక్తుండై, పంజరాంతరంబున మెలంగు పులుగు చందంబున, వెడల నుపాయంబుగానక, నానావిధ భోగంబుల ననుభవింపుచు క్రీడించుచున్నట్టి హంసకు అగ్నిసోమంబులు, పక్షంబులు, ఓంకారంబు శిరంబు, త్రినేత్రంబులు ముఖంబులు, రుద్రరుద్రాణువులు చరణంబులై యొప్పారు. భానుకోటి ప్రతిభాకాశంబై కాష్టంబుల వహ్నియు, తిలలయందు తైలంబును, క్షీరములం దాజ్యంబును, వ్యాపించియున్న చందంబున నాత్మ బ్రహ్మాది సర్వభూతములయందు అధిష్టించియుండును హెూ? శిష్యాయని బోధించి.

## సహస్రార అష్టదళ కమల విమర్శన

శ్రుతి॥ ఏనదం వ్యాప్తాంత చాష్టదళావృత్తీ భవతి। పూర్వదళైః పుణ్యమతీ భోగీ, ఆగ్నేయే నిద్రాలస్యాదయో భవతి। యామ్యే క్రౌర్యమతిః। నైరుత్యే పాపే మనుష్యాణాం। పశ్చిమదళే క్రీడాయాం వాయుక్యే రతిప్రీతి కుబేరదళే ద్రవ్యాధానం ఈశాన్యదళె ధ్యానయోగః। మధ్యదళే వైరాగ్యం కేసరోజాగ్రద వస్థాకర్ణికాయాం స్వప్నలింగే సుషుప్తిః। పద్మత్యాగే తుర్యః। యదాహం సోనాదేలీనో భవతి। తత్తుర్యాతీత అధోనాదమాధారాది బ్రహ్మరంధ్ర పర్యంతం। శుద్ధ స్పటిక సంకాశః।

యీ అష్టదళ పద్మమునందు జాగ్రత్స్వప్న సుషుప్తుల భ్రమల నొందిన జీవుండును ఈశ్వరుండును అంగక్రమంబుల

ఆనందంబు విలీనంబుగా, తుర్యంబునందుండు అన్నం బాధా రంబుగా, బ్రహ్మరంధ్ర పర్యంతంబుగా, శుద్ధ స్ఫటిక సంకాశంబుగా నిండియుండు, నిదియే పరిపక్వ చిత్తులకు యోగ్యంబై యుండు అన్యుల కతిదుర్లభంబు, అణి మాద్యష్టైశ్వర్యకరంబు, జ్ఞానంబు ప్రకటంబుగాచేయు, నిది భోగమోక్షప్రదంబు. యీ రెంటికి పరమాత్మ చరణ, కమల ద్వయ, భక్తియే కారణంబు.

## వైరాగ్య వాక్యములు

శ్లో॥ జన్మదుఃఖం జరాదుఃఖం। జాయాదుఃఖం పునః పునః। సంసారసాగరం దుఃఖం। తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ మాతానాస్తి పితానాస్తి। నాస్తిబంధుస్సహోదరాః। అర్థంనాస్తి గృహంనాస్తి, తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ కామక్రోధంచ లోభంచ। దేహేతిష్ఠంతితస్కరాః। జ్ఞాన రత్నాపహారేణ। తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ క్షణంచిత్తం క్షణంవిత్తం। క్షణంజీవితమావయోః యమస్య కరుణానాస్తి। తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ సంపదా స్వప్నవార్తాయాం। యౌవనం కుసుమోపమం। ఆయుష్యం విద్యుచ్చపలితం। తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ ఆశయాబధ్యతేలోకే। కర్మణా బహుచింతయాః। అయుక్షీణం నజానీతి। తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ ఇదంకాష్ట మిదంకాష్టం। నదీతీరేణ సంగమం। సంయోగాశ్చ వియోగాశ్చ। కాతత్ర పరివేదనా॥

శ్లో॥ మృణ్మయానిచ భాండాని। బహూనిలివిధానిచ।
భిన్నభాండం పరిత్యజ్య। కాతత్ర పరివేదనా॥

శ్రీసద్గురు దేవార్పణ మస్తు

మం గ ళ హా ర తి

మంగళం మంగళం, సద్గురురాయా॥ మంగళం మంగళం ధీరసంతత నిర్వికార నిర్మల నిర్విచారా నిత్య నిరాకారాయ శరీరా సారావిహీన సంసార దూరయవి, కారనిర్విషయ ప్రచార నిరాధారా ॥మం॥ పుట్టిగిట్టకయున్న యట్టి ద్వయర హితమై నట్టి ద్వాదశివస్తు గొట్టు దయబుట్టి అట్టిశిరమున చెయ్యిబెట్టి జన్మముకర మట్టమెరుకను విడగొట్టిన ప్రభు రాయా ॥మం॥ యెన్నడేమియు గాక యున్న బయలందెరుక యున్నదన్నమాట సున్నా పరిపూర్ణా మున్నాది స్వప్నమం దెన్నో తోచినరీతి, యెన్నడీజగము లేదన్నసద్గురునకు ॥మం॥ కాలాకాలము యొక్క లీలనిలిచియుండి చాలా కలయెరుకల కవలయ్యేవేళా మూలములేని గురుతెరిగే శరీరము, కాలము లేకున్న కేలుదెల్పినతండ్రీ ॥మం॥ సాటిలేని కృపతోటిబయలును జూపి, పాటియెరుకనుగోట మీాటి ధరమేటి కోటిలింగయను యీా సూటి నెరిగించిన దీటులె నేల్పూరి కోటీశ్వరప్రభో॥మం॥

బ్రహ్మశ్రీ చుండూరి వెంకటరెడ్డియార్య
CC-No. దేశికేంద్ర సద్గురు ప్రభోన్న మోన్నమః
7455

సంపూర్ణం.

---

భారతీ ప్రెస్,తెనాలి.

2.4.5
VEN